ఓం

నారాయణాయ నమః

# గణపతి రామాయణసుధ



## యుద్ధకాండ

(మొదటిభాగము)








పతిశాస్త్రి

వెల : రూ|| 15-00

ఓం

నారాయణాయ నమః

# గణపతి రామాయణసుధ

## యుద్ధకాండ

(మొదటి భాగము)



చర్ల గణపతిశాస్త్రి

వెల : రూ॥ 15-00

ఓం

పరమాత్మ యగు

శ్రీమన్నారాయణునికి.

శ్రీ తిరుపతి దేవస్థానము వారిచే ప్రారంభించబడిన

ధార్మిక గ్రంథ ప్రచురణ సహాయ ప్రణాళికక్రింద

ఇయ్యబడిన విరాళముతో

ముద్రింపబడినది.

# రామాయణసుధ – యుద్ధకాండ – (పూర్వభాగము)

## / విషయసూచిక /

# రామాయణసుధ

## యుద్ధకాండ

### —: సముద్రము దాటు నాలోచన :—

హనుమంతుం డిటు సర్వమున్ దెలుపఁగా నాలించి రాముండు ప్రీ
తిని నీరీతి దలంచె; మారుతి ధరిత్రిన్ దుష్కరంబై మహా
ఘనమౌ కార్య మొనర్చె నన్యులెవరున్ గానీ యిటుల్ చేయులే;
రనిలుండున్ హనుమంతుఁడున్ గరుడికా కబ్ధిం దరిత్రే పరుల్. 1

సుర గంధర్వ నిశాచరోరగులు రక్షో యక్షులుం గాని సం
గరరంగాన నెదుర్ప రాక బహు దుర్గంబౌచు నారావణా
సుర సంరక్షితమైన లంకపురి నేశూరుల్ గాని చొచ్చి క్ర
మ్మఱఁ బ్రాణంబులతోడ వచ్చెదరె హన్మంబోల్ ఘనుల్ తక్కగన్. 2

అతుల సుగ్రీవునికి మారు తాత్మజుండు
స్వామిగాఁ దనబలమును జక్కఁ జూపి
విక్రమమునకుఁ దగినట్లు భృత్యకార్య
మెంతొ గొప్పగ మించి గావించె నట్లు. 3

ప్రభువు నాసతి యిచ్చిన యంత త్వరితముగనె
ఎట్టి దుష్కర కర్మల నేని తాను
భృత్యుఁ డనురాగమున నొనరించు నేని
వాని నిటను త్తముగ బుధుల్ పల్కుచుందురు. 4

యుక్తుఁ డయ్యు సమర్థుఁ డయ్యును నెఱింగి
ప్రభువె పన్చిన యిష్టకార్యమ్ము కంటె
నెక్కువగఁ జేయకుండిన భృత్యు నెపుడు
మధ్యముఁ డనుచుఁ పెద్దలు పలుకుచుంద్రు. 5

శ్రద్ధగల యుక్తుఁ డయ్యును శక్తుఁడయ్యు
ప్రభువె యానతి యిడిన కార్యంబు నెపుడు
చేయకుండిన వానిని క్షితి తలాన
అధముఁ డని ప్రాజ్ఞు లనువార లనుచు నుంద్రు. 6

ఉత్తమ మగు కార్యమున నియుక్తుఁ డైన
యాంజనేయుఁడు సరిగఁ గార్యంబు చేసె
ఇతఁడొ యాత్మ గౌరవము తగ్గింపలేదు
ప్రభువు సుగ్రీవునికొ ప్రహర్షంబు గూర్చె. 7

రఘుకులము నేను బలియుఁడొ లక్ష్మణుడును
సీత కనఁబడ ధర్మ రక్షితులమైతి
మిటు ప్రియము చేసిన హనుమ కేమి తగిన
ప్రియము చేయనైతినని నా హృదియె కుందు. 8

ఇపుడొ నాదు సర్వస్వమై యెన్నఁదగిన
కౌఁగిలె మహాత్ముఁడొ హన్మ కీఁ గలాఁడ
ననుచుఁ గృతకృత్యుఁడై వచ్చినట్టి పూజ్యు
హనుమఁ గౌఁగిలించుక రాముఁ డలరి పొంగె. 9

అనయం బట్టులఁ బొంగి రాముఁడు ప్లవంగాధ్యక్ష సుగ్రీవుడున్
విన నిట్టుల్ వచియించె జానకిని నన్వేషించు సత్కార్య మె
ల్లను తీరెన్ సరె యట్టి వార్ధిఁగన విభ్రాంతిన్ గనెన్ చిత్త మె
ల్లను నా దక్షిణంపుతటు లెట్లున్దాటుదుర్ వారిధిన్. 10

సరియే మంచిది సీతవార్త యెఱింగించం బడ్డదే కాని సా
గర మెట్టుల్ గపు లెల్లదాటుదురొ యింకన్ దీనికా నేమి యు
త్తరమంచున్ దలపోసి శోకమునఁ జిత్తంబందు సంభ్రాంతుఁడై
యరి విద్రావణుఁడా మహాభుజుఁ డెదన్ ధ్యానించె నా మారుతిన్. 11

ఇటు శోకంబున గ్రుక్కు దాశరథితో నీరీతి సుగ్రీవుఁ డం
తట శోకంబు చనంగ వాకొనియె, "సంతాపంబు నో వీర! యే
మిటికిం బొందెదు, వట్టి ప్రాకృతు నటుల్, మేల్మర్చు దుష్టాత్మకుం
డిట సౌహార్దము వీడునట్లు, వెత వర్జింపన్ మదిం బూనుమీ. 12

ఇటులన్ సీత ప్రవృత్తియా దొరకె నా హీనారివాసంబు నె
చ్చటదో కూడను దెల్సె నింక వగకున్ స్థానంబు లేదోయి, యు
త్కట విజ్ఞుండవు బుద్ధిమంతుఁడవు శాస్త్రజ్ఞుండవున్ సూరి, వీ
విట మోహంబును యోగివోలె విడుమీ యాచిత్త దౌర్బల్యమున్. 13

పలు నక్రంబుల వ్యాకులంబ యగు నాపాదోధి లంఘించి సే
నల లంకాపురి కంపఁజాలదుము, యింతన్ శత్రువుం జంపఁగా
గల, ముత్సాహములేక దీనుఁడయి శోకావిష్టుఁడై కుందు వ్యా
కులు సర్వార్థములున్ నశించును, వ్యథంగూడన్ గడున్ బొందుఁగా. 14

ఇదిగో ఈమనవానరాగ్రసరు లెంతే శూరులున్ శక్తులున్
గద, నీయిష్టము కోవ మగ్ని దుమకంగా నైన నుత్సాహియౌ
మదిలో నుండిరటంచు వీరి నుబదమే మాకిందు వాక్రుచ్చు ని
య్యదనన్ నాదగు నూహ సత్య మిట లే దావంత సందేహమున్. 15

ఎటు పాపాత్ముని రావణుం దునిమి యిందే సీతఁ దెప్పింతుమో
యటులన్ విక్రమముం గనంబఱుప నీవర్హుండ, వంబోధిపై
నెటులన్ సేతువుగట్టి యందఱము నిట్టే రాక్షసాధీశు నా
పటు లంకాపురిఁ జూతుమో యటు మహోపాయుంబు చింతింపుమీ. 16

ఇటులు త్రికూటశృంగమున నేర్పడి యుంచు లంకఁజూడ న
చ్చట నిక నాజిరావణుని జంపిన యట్లె తలంచుచుం దగున్
అట వరుణాలయం బయిన యబ్ధిని సేతువు గట్టుచుంచుచో
నెటుల సురేంద్రుతోడి సురలేనియు లంకను జొచ్చురీతఁజిన్.

కని లంకాతటి వార్ధి గట్టితిమ, యింకన్ సేసలే పోవ గె
ల్పును వేగన్ గనినట్లె యెంచు; మన శూరుల్ వానరుల్ కామరూ
పున దైత్యాన్వితయైన లంకను గడున్ మూలంబుతోపాటె యిం
తనె శీఘ్రంబుగఁ బీకి తీసికొని రాఁ దథ్యంబుగా శక్తులే.

కనుకన్ బేలతనంబు చాలు మఱి యీ కార్పణ్యమే సర్వమౌ
వనులన్ నాశము చేయు లోకమునఁ గార్పణ్యంబె శౌర్యాపక
ర్షణమౌ, శౌర్యముపూని మానవుఁడు కార్యంబెల్ల సాధించు, దా
నిసె యాశౌర్యమె ధైర్యమే గనుమిఁకన్ నీ తేజుచే ధీనిధీ!

నినుబోల్ శూరమహాత్ములౌ నరు లెదేనిన్ నష్టమైనప్పు డై
నను గన్పింపని యప్పుడైన నిటుచింతన్ గాంచ సర్వార్థ నా
శనమౌ, ప్రాజ్ఞులలోన శ్రేష్ఠుఁడ విఁకన్ శాస్త్రార్థ సంవేదివిన్
ననుబోల్ మంత్రులఁ గూడి శత్రుజయమున్ గావింప యోగ్యం బ

ధనువున్ దాలిచి నీవు నిల్వఁ ద్రిజగద్ధాత్రిన్ మఱెవ్వానినై
నను నీముందర నిల్చువానిని గనన్ నామాట యాలింపు,మీ
ఘనులౌ వానరులంద యుంచునెడ నేకార్యంబుఁగానీ విప
త్తును బొందంగను; వార్ధి దాటి త్రుటి నిందున్ గాంతు వాజానకిన్

కనుకన్ శోకము వీడి, క్రోధమును నింకన్ బూనుమా భూప! పూ
ననియాసోమరిక్ష త్రియాధములు చండాత్మున్ నిరీక్షించి భీ
తినిగాంతెప్పుడు; ఘోరమైన ఘనవార్ధిన్ నీవు లంఘింప వెం
టనె మాతోడ సుసూక్ష్మబుద్ధి వయి యత్నంబూన యోచింపుమీ.

అనికిన్ వీలుగఁ గామరూపు లయి శౌర్యం బూని యీ వానరుల్
ఘనమౌ తాళ్ళను చెట్లఁ గూర్చి రిపులన్ ఖండించుచున్ గూల్తు; రె
ట్లనొ క్షుభ్యద్వరుణాలయుం బయిన పారావారమున్ దాటి క్ర
న్ననఁ బోజాలుదు మింక శత్రువు నిఁకన్ నష్టుంగ నీవెంచుమీ. 23

పలు వాక్యంబు లిటేల చెప్పి సకలంబౌ రీతులన్ నీవరిన్
గెలువంజాలుదు, వీవిటన్ విజయి వీక్షింతున్ నిమిత్తాలు మి
క్కిలి నాచిత్తము సంతసించు, నని సుగ్రీవుండు సద్ధేతులన్
గల సత్యార్థమతిన్ వచింప హనుమన్ గాకుత్థు డీలా గనెన్. 24

వడిగా సేతువు గట్టియో మఱియు నాపాథోధి నెండింపియో
కడలిన్ సర్వవిధాల దాటుటకు నింకన్ నేసమర్థుండ, ని
య్యెడఁదె; ల్బాచొరరానిలంకపురిలో నెన్నెన్ని దుర్గాలు చొ
ప్పడు సాక్షాత్తుగఁ జూచినావు గనుకన్ వాక్రువ్వుమీ ముందుగా. 25

బల పరిమాణ మెంతటిదొ ద్వారవు దుర్గపుఁ గర్మ లెట్టివో
కల ప్రహరుల్ మఱేవొ, పరిఖాముల రక్షణ లేవొ, లంకలోఁ
గల సదనంబు లెన్నొ, సరిగాఁ దగినట్లుగఁ జూచినావు కౌ
శలము గలట్టివాఁడ విఁక సర్వము నాకెఱిఁగింపు మారుతీ.. 26

అని రాముం డన నాలకించి కడు వాక్యార్థజ్ఞులన్ శ్రేష్ఠుఁడౌ
హనుమంతుం డిటు పల్కె రాఘవునితో, "నాలింపు సర్వంబు వా
కొనెదన్; దుర్గపుఁ గర్మ లెట్లు పురిలోఁ గూర్చంబడెన్, దుర్గర
క్షణ మెట్లున్నదొ రావణౌజమున రక్షః స్నేహ మెట్లున్నదో. 27

వ. మఱియు నాలంకాపురిలో మహాసమృద్ధి యెట్టిదో సముద్ర మెంత భయంకరమైనదో బలసంఘంబు లెట్లు వ్యూహములుగఁ బన్నఁబడినవో వాహనముల విన్యాస మెట్లున్నదో చెప్పెదను వినుము. అని కపిశ్రేష్ఠుఁ డైన హనుమంతుఁడు పల్కి మరల పస్తుస్థితి నిట్లు చెప్పసాగె. 28

లంకయంతయును హర్షమునఁ బొంగుచు నుండ
మత్తేభములు నిండి మసలుచుండు
హయరథ పూర్ణమై యసురులతో నిండి
పరులకుఁ జొరరాక పురి దనర్చు
తగుకందకము లొప్పుఁ దల్పుల బద్ధమై
పెనుకోట ద్వారముల్ తనరు నాల్గు
పరులఁ బ్రతిఘటింప బాణశిలాక్షేపి
బహు మహాయంత్రముల్ బలసి యుండు

కాఁ తినుము మయమై యన్ని ద్వారములను
శతశతఘ్నులఁ దాల్చి రాక్షస గణాలు
ముత్యములు కెంపు వైడూర్యములులోన
మీఱఁ జొఱని పసిఁడి ప్రాకార మెసఁగు. 29

చలినీళ్ళం దగి యన్నిచోట్లఁ బెనుమత్యంబుల్ చరింపన్ మొస
ళ్ళల భీతిప్రదమై యగాధపరిఖల్ పొల్చున్ వెడల్పై యగ
త్తల ద్వారంబులపైని దారుఫలకల్ రాజిల్లు సంచార వీ
థులు నాల్గొప్పును దీర్ఘమై బహుళ యంత్రోపేత గేహాళులన్. 30

పరసైన్యంబులు రాఁగ దారుఫలక వ్యాప్తంపు సంచారపున్
సరణుల్ యంత్రపు పంక్తిచేఁ బరిఖలన్ సర్వత్ర వేయుంబడున్
పురి యట్లప్పుడు కావఁగాఁ బడును నెప్డున్ మీఱి కొండొక్క సం
చరణాంచ త్ఫలకం బకంప్య కనక స్థంభాల వేద్యాఢ్యమౌ. 31

వ. రామ ! వ్యసనములందుఁ దగుల్కొనక తన ప్రకృతి యందుండి యుద్ధము చేయ నిచ్ఛగల రావణుండు ఆదారు ఫలక నధిష్టించి ప్రతిదినము లేచి యప్రమత్తుఁడై స్వీయబలములను జూచుచు జాగరూకుఁడై యుండును. దేవతలకును దుర్గముం బయిన యా లంకాపట్టనము త్రికూట మందుండి

యారోహణాలంబనము లేనిదై యందఱకు భయావహమై యుండును. జలదుర్గము పర్వత దుర్గము వనదుర్గము ప్రాకారాదిస్థలదుర్గము అను నాలుగు దుర్గములు గల దయి లంక యున్నది. విశాలంబయిన సముద్రమున కవతలి పాదమున అది నిర్మితము. అందు నౌకా సంచారము లేదు కాన ఎందుండియు వార్తల సంచారము లేక యున్నది. దేవపట్టనము వంటి యాలంకాపట్టనము శైలాగ్రమందు దుర్గమంబుగ నిర్మింపఁ బడినది. వాజి వారణ సంపూర్ణ మయి యది దుర్జయం బయియుండు. ఆ దురాత్ముఁ డగు రావణుని పురము పరిఘలతోను శతఘ్నులతోను వివిధ యంత్రములతోను నిండియున్నది. అందు తూర్పు ద్వారమున పదివేల రాక్షసులు శూల హస్తులై ఖడ్గాగ్రములతో పోరుచు నెదుర్కొనరాని వారై యుందురు. దక్షిణపు ద్వారమున లక్షమంది సైనికులు ఉత్తములు చతురంగ సేనలతోఁ గాయు చుందురు. ఇఁక పడమటిద్వారమునఁ బదిలక్షలమంది సర్వాస్త్ర కోవిదులైన సైనికులు చర్మ ఖడ్గధరులు కాపుందురు ఉత్తర ద్వారమునఁ బది యర్బుదముల సైనికులు కులపుత్త్రులు సుపూజితులయిన వారు రథికులైన ఆశ్వికులు కాయుచుందురు. వందలు వేలుగా సైనికుల మధ్యను స్కంధావారము చుట్టు ముట్టి పూర్తిగా కోటిమంది ఆశ్రయించి యుందురు. నేనీ దారు ఫలక నిర్మిత సంచారమార్గముల విఱుగఁ గొట్టితిని. పరిఖలు నింపి వైచితిని ప్రాకారములు నష్టపఱచితిని. లంకాపురిని దగులబెట్టితిని. ఈ విధముగ మహాత్ములైన రాక్షసుల బలము లోనియొక్క భాగము నాశనము చేసితిని ఏదో యొక మార్గమున వరుణాలయ మగు సముద్రమును దాటుదము. వానరులచేత లంకానగరి నష్టము కావించబడినట్లే నిశ్చయించుకొనుము. అంగదుఁడు ద్వివిదుఁడు మైందుఁడు జాంబవంతుఁడు పనసుడు నలుఁడు సేనాపతి నీలుఁడు ఎగిరిపోయి పర్వతములతో ఖాతములతో ప్రతోరణములతో పాటు రావణుని లంకాపురిని చేధించి ప్రాకారములతో భవనములతో గూడ నిచ్చటికిఁ దీసికొని రాగలరు. ఇంక మిగిలిన బలముతో పనియేమి వేగముగా బలము లన్నిటిని సంగ్రహింప నానతిమ్ము. యుక్త మగు ముహూర్తమున బలప్రస్థానమునకు ఇష్టము చూపుము అని. 32

హనుమంతుం డిటు లానుపూర్విగను నొయ్యం జెప్ప నాలించి యా
ఘన తేజుండగు సత్యవిక్రముడు నైక్ష్వాకుండు రాముండు ని
ట్లనె "నీ చెప్పిన భీమ రాక్షసుని దౌ లంక దగ్ధంబు చే
తును సుగ్రీవ! క్షణంబులోనె వలతున్ దూర్ఘంబ బైల్దేరగన్. 33

అభిజి న్ముహూర్తమున రవి
నభమధ్యముఁ జన జయముమనకు లభియించున్
లభియించి వెళ్ళ లక్షో
విభుడిటు సీతగొని యెటకు వెళ్ళం గలుగున్. 34

నా చైత్రయాత్ర వినియును
న్నా జానకి జీవితాశ ననువుల నొందున్
ఈ జగతి విషము గ్రోలిన
యా జ్ఞనుఁ డమృతంబు నోక నను లొందునటుల్. 35

ఈరో జుత్తర ఫల్గుని
ఆ రేపో హస్తతోడ ననువుగ గలియున్
ఈ రోజే మనమింక బై
ల్దేరెద మీ సేనతోడ, లే సుగ్రీవా. 36

శుభ శకునాలు కానబడు శూరత రావణుఁ జంపి జానకిన్
స్వభవన మిట్టె చేర్చెదను పైకి స్ఫురించెడి నాదు నేత్రమే
శుభముగ నేను నిష్టపడు శూరజయుంబును చెప్పునంచు నా
సుభుజుడు రాముడున్ దెలుపఁ జొక్కిరి గొల్చి కపీశ లక్ష్మణుల్. 37

ఘరలన్ రాఘవుఁ డర్థకోవిధుడు ధర్మాత్ముండు డిట్టుల్ చెప్పె ముం
దర నీసేనకు దారిచూపుటకుఁ జెంతన్ నూర్లు వేల్ గాగ వా
నరులన్ గైకొని నీలుడేగుతను పండ్లన్ మూలశీతాంబులన్
నిరతం బొప్పుచుఁ దేనెలూరు పథమున్ వీక్షించుచున్ బోవుతన్. 38

## యుద్ధకాండ (33 నుండి 4వ సర్గ)

ఫలముల్ దుంపలు నీరముల్ పథములోఁ బాపాత్ములౌ రాక్షసుల్
మలినంబుల్ పొనరింత్రు వారి యెడ నశ్రాంతంబు జాగ్రత్తగా
మెలగం గావలె నిమ్న దుర్గములలో మేలౌ నరణ్యాలలో
బలముల్ దాతురు పొంచి పై కెగిరి క్రేనన్ నిల్చి కాసందగున్.

గజుఁడు గవాక్షుఁడు గవయుఁడు గిరిసములు
పొగరు నాఁబోతులఁ బోలెఁ జనుత
పశ్చిమ పార్శ్వంబుఁ బట్టి కపులఁ గూడి
కపివర ఋషభుండు కదలుఁ గాక
మదపుటేనుగులు గంధమాదనుఁ డుద్భటుఁ
డేగుతఁ దూర్పుగ నేపు మిగుల
బలమధ్య హనుమపై నిలిచియు సేన సై
రావతముపై నింద్రాభఁ జనెద

అంతకాభుఁడు సౌమిత్రి యంగదుఁ గాని
సార్వభౌమమున ధనేశు సరణిఁ జనుత
పడి సుషేణుఁడు జాంబవంతుడును వేగ
దర్శియును గాచుతను బల మధ్యంబునీది.

అనుచు రాముండు చెప్ప సేనాధిపతియె
యైన సుగ్రీవుఁడు మహాబ లాఢ్యులైన
వానరుల కానతీయగ వారు పర్వతములు
శృంగములు గుహల్ లంఘించి యెగిరి రపుడు.

అవలఁ గపిరాజు సౌమిత్రి యర్చ చేయ
సైన్యములు వేలు కోట్లు లక్షలును రాఁగ
అంత ధర్మాత్ముడౌ రాము డఖిలసేన
తీసికొని యేగె దక్షిణ దిశకు నపుడె.

మఱి యారాముని వెంట నంటి బలముల్ మర్యాదలన్ మీరియున్
వరువెత్తున్ దుముకున్ సుగంధి ఫలముల్ భక్షించుఁ గే
సరులట్టుల్ ధ్వని చేయు తేనెలు సమస్తం బాను వృక్షాల మం
జరులన్ దాల్చును గంతుపైచు విసరున్ సల్లాప మాడున్ కడున్. 43

ఒండొరు నెత్తికొంచు వడి నూరకె లీలగఁ గొట్టుకొంచు రా
రండిదె రావణుం దునిమి రాక్షసుల న్వధియించి వైతు మా
లెండని ఘోషపెట్టి ప్రహరించుచు రాము సమీపమందె యు
ద్దండముగాఁగ గర్జనలు దద్దయుఁ జేసిరి వానరుల్ వెసన్. 44

ముందుగా నీలుఁడును ఋషభుండు కుముదుఁ
డా కపులతో పథముల రమ్యముగఁ జేయ
రయమ సుగ్రీవుడును రామలక్ష్మణులును
వీర కపులతో మధ్యగా వెడలి నారు. 45

పది కోట్ల కపులతో వరవీర శతబలి
యొకఁడె సైన్యము లెల్ల నోపికాచు
మూరు కోటులు కపుల్ మీఱఁ గేసరి గజ
వన సార్కు లొకప్రక్కఁ జనిరి కాచి
పడి సుషేనుఁడు జాంబవంతుఁడు ఋహుఋక్షు
లేతేర సుగ్రీవు నెడమఁ గాతు
రవ్వారి సేనాని యట నీలుడంతట
వారి బలము కావి త్వరగ నడచె

రంభుఁడు దధిముఖ ప్రజంఘు రభసు లపుడె
యితర కపుల వేగిర పెట్టి యేగి రతిగ
ఇట్టులఁ గపివరు రెల్ల దర్పించి మిగుల
తరుయుత శ్రేష్ఠ సహ్యాద్రి నరసినారు. 46

సరసుల్ వెర్వులు విచ్చియున్న వనముల్ చక్కన్ నిరీక్షించుచున్
పురముల్ వానిసమీప దేశముల రాముం డానతీయున్ త్యజిం
చి, రవంబున్ బొనరించుచున్ గపుల యాసేనల్ మహాఘోషముల్
సరగన్ జేయుచు వార్ధిc జేరె నట గర్జద్వార్ధి వార్ధిం బలెన్. 47

కపి మత్తేభము తోలగాc బసు తురంగా లట్టులున్ రాముపా
ర్శ్వపు భాగంబుల వేగమే యెగిరిపోవన్ వానరుల్ మ్రోయు నా
నృపపుత్రుల్ వెలుగొంది రంత గ్రహసంస్పృష్టంబులౌ సూర్యరా
త్రిపతుల్ వోలెను: నేగె దక్షిణదిశా దేశంబు రాముండిcకన్. 48

వ. అట్లు దక్షిణదిశగc బోవుచున్న యన్న రాముని జూచియుంగదునిపై
నున్న లక్ష్మణుcడు పరిపూర్ణార్థుc డయి స్మృతితో ప్రతిభావంతుడయి యిట్లనె
ఓసమృరార్ధ ! సమృద్ధార్థములుగల యయోధ్యకు శీఘ్రముగా సీతను పొంది
రావణుని జంపి చేరగలవు. 49

ఇదిగో ధారుణిపైని నాకసముపై నీయామిత్రాల్ శుభ
ప్రదమై నీపరమార్ధ సిద్ధికయి కన్పట్టున్, శుభంబై కడున్
మృదువై భద్రమునై సుఖానిలము హాయిన్ వీచుc బక్షుల్ మృగాల్
మధుర స్వానము చేయు, దిక్కు లమలం బై సుప్రసన్నం బగున్. 50

రవి స్వచ్ఛద్యుతి యయ్యె శుక్రుcడు శుభార్చి స్సొప్ప నిన్ మెప్పొనెన్
ధ్రువుcడో శుద్ధుcడె యయ్యె సిద్ధపరమర్షుల్ జ్యోతిలో నిండి యా
ధ్రువునిన్ జుట్టి ప్రదక్షిణంబ చనుచున్ద్యోతింత్రు శాంతిన్ త్రిశం
కువుమీఱెన్ సపురోధ రాజ ఋషిమాకున్ తాత గ్గైక్ష్వా కువున్. 51

కడుశుద్ధిన్ నిరుపద్రవంబయి విశాఖ ల్మీఱు, వీక్షింపు మె
య్యెడ నిక్ష్వాకుల కివ్వెశ్రేష్ఠములుగాదే, నైరృతం బింక నె
ప్పుడు నారాక్షస పంక్తికిన్ జెడుగెయౌ మూలంపు నక్షత్ర మి
ప్పుడు మూలాన్విత ధూమకేతువు పదంబున్ సోకి బాధించుc జూ 52

ఇది సర్వంబును రాక్షస క్షితికి యిట్లే సిద్ధమయ్యెంజుమీ
ఇదిగో కాలగృహీతులౌ జనులకిందే పీడ నక్షత్రముల్
ఒద వించున్, జలముల్ ప్రసన్నరసమై యుండెన్ వనీభాగముల్
ముదమున్ గూర్పఁగఁ బండ్ల నిండెఁదరువుల్ పోషించుఁ దావుల్పువుల్. 53

అనిలో తారకుఁ జంపదేవతలు వ్యూహంబుల్ వినిర్మించు తీ
రున నీ వానరసేన వ్యూహములు దీర్చెం జుమ్మి నీవింక వీ
నిని వీక్షించుచుఁ బ్రీతిఁబొందు మనుచున్ నేర్పార నోదార్చి ల
క్ష్మణుఁడంతన్ మది హృష్టుఁడై మరియు వక్కాణించె నీరీతిగన్. 54

నఖదంష్ట్రాయుధమైన ఋక్షకపి బృందాలన్ ధరిత్రీ తలం
బఖిలంబున్ బలమాక్రమించి చనెఁ బాదాగ్రాల హస్తాగ్ర స
న్ముఖ పూత్కారములన్ గపీంద్రులట దుమ్మున్‌రేపి సూర్యప్రభన్
నిఖిలంబున్ వడిఁగప్పె మాయమును పొందెన్ సర్వలోకంబులున్. 55

ఘనపంక్తి నభమట్లు వనశైల నభయుక్త
దక్షిణదిశఁ గ్రోతిదండు గప్పె
బహుయోజనపు దవ్వు బలము దాటుచునుండ
తలక్రిందు నదులు స్రోతసులు పాఱె
విమలాంబు సరసుల ద్రుమకీర్ణగిరులను
సమభూమి ఫలవనుల్ చమువుఁ జొచ్చె
సర్వసైన్యంబులు సరిగ మధ్యను గ్రింద
పైని నర్దంబును వ్యాప్తమయ్యె.

కపులు మదిఁ బొంగి వాయువేగమ్ము గలిగి
రామునకయి చూపినారు విక్రమము లెల్ల
మార్గమున హర్ష వీర్యసమాక్రమణల
భావనోత్సాహ దర్పాల నడరి రపుడు. 56

కొందఱు వేగఁ బర్విడిరి కొందఱు పైపయిదూకినా, రిఁకన్
కొందఱు కీచుకీచనిరి కొందరు తోకలు గొట్టి దుర్విపై
కొందఱు కాళ్ళఁదన్నిరిలఁ గొందఱు కొండలు చెట్లఁగూల్చిరిబుల్
కొందఱు నెక్కిరద్రులను గొందఱు చేసిరి సింహనాదముల్. 57

పెక్కరు తీపెల గుంపుల
నెక్కొని తొడలవడిఁ ద్రొక్కి నీల్గిరిమిగులన్
నిక్కుచు నీల్గుచు ఱాళ్ళను
తక్కంగల చెట్ల విఱిచి తరలిరి క్రీడన్. 58

శతములు లక్షలు కోటులు
సతతము వ్యాపింప భూమి ఛాదిత మయ్యెన్.
అతిగా సుగ్రీవునిచే
సతతము రక్షింపఁబడుచు సైన్యము లలరెన్. 59

త్వరగా కపు లెల్లరు సం
గరమును మెచ్చి నిశి పగలు గడు వేగముగా
నరుగుచు సీతను విడిపిం
ప రెచ్చి నడచి రొక త్రుటియు నుసలర యెచటన్. 60

పిదపఁ జెట్లతో నిండియుఁ బెను మృగాలఁ
దనరు సహ్య ములయు గిరుల్ కనిరి కపులు
సహ్య మలయాద్రులఁ దనర్చు సకల వనుల
చిత్ర ఝర నదుల్ రాము డీక్షించు చరిగె. 61

వకుళాశోక కరంజ నీప తిలక ప్లక్షంబులన్ సిందువా
రక జంబూ తిమి శామ్రు సాల కరవీ రాంకోల నారంగ తిం
దుక వృక్షంబుల నెక్కుచున్ విఱచుచున్ దూర్జంబ న్యగ్రోధముల్
వికలంబుల్ పొనరించుచున్ జని రటన్ వేగంబ యువ్వానరుల్. 62

చెలువౌ కొండల సానులందు వనిలోఁ జెట్లెల్లఁ బెన్గాలిచే
చలనం బొందుచుఁ బూలరాల్చె సుఖ సంపన్నార్యాన చెల్వార గా
లులు శ్రీచందన శీతలంబులయి మీఱున్ తేనె సెత్తావులే
యొలకం బోయు వనాలఁ గూయు నళులం దూగన్ దనర్చున్ గిరుల్. 63

పలురంగుల ధాతులచే
నలరఁగ గిరిరాజు మెయిని నలఁదుచు గాలుల్
చెలువుగఁ గ్రోతుల గాత్రం
బులఁ గూడ నలంది మిగుల మోదించె నటన్. 64

అలరుల్ విచ్చిన సింధువార ధవ నీపాశోక వాసంతి శా
ల్మలి హింతాల మధూక కుంద చిరిబిల్వాంకోల బంధూక వం
జుల ఖర్జూరక నాగవృక్ష వకుళ స్ఫూర్జార్జు నామాదు లా
కులముం జేసిరి వానరుల్ వివిధభంగుల్ మీఱఁ గ్రీడించుచున్. 65

అట నాశైలమునందు శీతల జలవ్యాప్తంబులౌ చెర్వులున్
వటు కారండవ సేవితంబు లగు వల్వావుల్ సుచక్రాల ము
చ్చట లింపారు కొలంకులున్ భుజగ ఋక్ష క్రౌంచ శార్దూలముల్
కిటి పంచాస్య తరక్షువుల్ గల జలాకీర్ణ హ్రదా లింపగున్. 66

అట సౌగంధికములు మి
క్కుటమౌ పద్మములు పుల్లకుముదంబులు ము
చ్చటఁ గొల్పు నల్వకల్వలు
స్ఫుట పుష్పంబులు గల సరసులు చెల్వారున్. 67

వ. ఆ జలాశయంబుల దిగి జలాంబులు గ్రోలి క్రీడలం దేలుచు ఒక రొకరిపై నీళ్ళు చల్లుకొనుచు మరల శైలంబు లెక్కి వివిధ భంగుల నుఱుకుచు వానరులు తమ శత్రుసంహార కార కోత్సాహంబులు చూపం దొడంగిరి. 68

అందు ముత్త కపులు నమృత గంధముఁ జిల్కు
ఫల మూల పుష్పంబు లెలమిఁ దినిరి

కొందరు హృష్టులై కుంచెఁడు కొలగల
వ్రాలు తేనియ పట్లు గ్రోలి చనిరి

చెట్లు విఱచి లతల్ చేత లాగుచు గిరుల్
పిండి చేయుచుఁ గపుల్ సెడలినారు

కొందఱు వానరుల్ కూల్చుచుఁ జెట్టుల
మధు మత్తులయి చెట్లు పొదివి పడిరి

పండిన వరిపొలము భూమి వలెను మిగుల
క్షమ యొకటి యూధపులచేతఁ గప్పఁబడియె
ఇంకఁ బద్మాక్షుఁడగు రాముఁడే మహేంద్ర
శైల మెక్కి మీన కమఠన్ జలధిఁ గాంచె. 69

వ. పిదప వానరులు సహ్యపర్వతమును మలయమహాగిరిని దాటి వరుసగ భీమ ధ్వనిగల సముద్రమును సమీపించిరి. అంత రాముఁడు సుగ్రీవ లక్ష్మణులతోఁ గూడి యుత్తమమైన వేలావనము నుండి దిగి వెంటనే పైకెగురు జలములు వాళ్ళ తలములనుగడుగుచుండ నాసముద్రతీరమును జేరి ఇట్లనియె. ఇదిగో మనమిపుడు సుగ్రీవా! వరుణాలయమగు సముద్రమును జేరితిమి.ఇంక సముద్రము దాటు నుపాయమును గూర్చిన చింత యిపుడు ముందుగాబయలు దేఱె. ఇంక నీసముద్రము ఉపాయముచేఁ గాకమరొక విధముచే దాటరానిది. ఈవానర సేనయంతయు అవతలి గట్టును చేరునట్టి యుపాయముచేయుదము అంతవఱకు ఈసేనాదులు ఇక్కడనే యుండవలయును. అని యామహాబాహువు సీతాహరణముచేఁ గృశించిన వాఁడై అక్కడనే సేనానివాసముండ నానతిచ్చె. ఓవానరశ్రేష్ఠ! సమస్తసేనలు ఇక్కడనే యుండ నియోగింపుము. ఈ సముద్రమును లంఘించు నుపాయమును ఆలోచించు సమయము వచ్చినది. ఎవఁడును గూడఁ దన తన సేనను విడిచి యెచ్చటకును బోరాదు. వాన

రులు సంచరించు మనకు భయకారణముగా అక్కడక్కడ దాగిన శత్రుసైన్య మును తెలిసికొనవలె అని యిట్లు రాముఁడు చెప్పగా విని సుగ్రీవుఁడును లక్ష్మణుఁడును చెట్లతో నిండిన యాసముద్ర తీరమున సేనలను నిలువ నియోగించిరి. 70

వారిధి దగ్గఱ నున్న య
పార బలంబంతయు విభాసిలె మిగులన్
మీఱిన తేనియఁ బోలు న
పార జలంబుగల ద్వితీయ వారిధి వోలెన్. 71

నయతఁ గపు లెల్ల వేలావనంబు చేరి
ఆ సముద్ర తీరంబున నాగినంత
సైన్య సన్నాహ నిస్స్వనము ముందు
ఆ సముద్ర ఘోషము మాయ మయ్యె నపుడు. 72

అంత సుగ్రీవ రక్షితమైన సేన
ప్లవగ ఋక్ష గోలాంగుల భాగములుగ
మూఁడుగా విభక్తంబయి చూడఁబడియె
చేరి యిటు రాముపని తీర్ప సిద్ధ మయ్యె. 73

వ. అంత నావానరసేన వాయు వేగముచే నల్లకల్లోలముగా నున్న విశాలసాగరమున విడిసెను. అపు డాసముద్రము– 74

క్రూర నక్ర గ్రహ ఘోరమంబుధి సంజ
నురుగుల నగె నాడెఁ గెరటములను
చంద్రోదయంబునఁ జాలఁ బెరిగి ప్రతి
బింబించు చంద్రులన్ వింతగొల్పె

అసలె సన్ననౌ సీత శోకార్తిఁ గుమిలి
దేశ కాలము లిటు కాఁగఁ దిండె తినక
వస్తుపడి యుండి యింకను వాసి దక్కి
చిక్కి శల్యమౌ నని యెంతుఁ జిత్తమందు. 85

ఇటులు ప్రాజ్ఞు డయ్యును రాముఁ డేడ్చుచుండఁ
జూడలేక మందార్చియై సూర్యుఁ డపుడు
దినము క్షయమొందఁ గ్రుంకె లక్ష్మణుఁడు మూర్ఛ
డింప సంజ వార్చెను రాముఁ డేడ్పుతోనె. 86

—: రావణుడు మంత్రులతో నాలోచించుట :—

అటులన్ లంక మహాత్ముఁడౌ హనుమచే నాయింద్రుచేఁ బోలె ను
త్కటమున్ ఘోరమునైన కార్య మిదికాఁగాఁ జూచి దైత్యేశుఁ డం
తట వక్త్రంబును వాల్చి రాక్షసులతోఁ దాఁబల్కె నావానరుం
డిట సామాన్యుఁడె సైపరాని యదియౌ నీలంకలోఁ గాలిడెన్. 87

మఱి యీమాత్రముతోడఁ బోవకయు భామన్ సీత నీక్షించి యీ
పురిఁ బ్రాసాదము జైత్యమున్ విఱిచియున్ ముఖ్యంబులౌ దైత్యు ల
త్తరి వారింపఁగఁ జంపి లంకను సమస్తం బిట్టులంజేసి వా
నరుఁడౌ నాహనుమంతుఁ డేగె వినుఁడీ నామాట జాగ్రత్తగన్. 88

ఏమొనరింతు మీకు శుభమే యగుఁగావుతమింక పిమ్మటన్
ఏమి యొనర్చఁగావలెనొ యేమి మొనరించినఁ జక్కనౌనొకో
ఈమహి మంత్రమూల మెపు డీవిజయంబని ప్రాజ్ఞులందు రీ
రాముని గూర్చి యోబలియులార! వచింపుడు యోగ్యమంత్రమున్. 89

ధరణి నుత్తము మధ్య మాధము లనంగ
పురుషులు ముగ్గు రుందురు వార లెవరొ
కలిసి సంకీర్ణమౌటను దెలియ వలయు
వారి గుణదోషములఁ జెప్పువాఁడ నిపుడు. 90

హితకాముల్ సమదుఃఖ సౌఖ్యులును నెంతే శక్తులున్ మిత్రులున్
హితులున్ మంత్రులు గాని కూడి నపుడెందేఁ జక్క శోధించి స
ద్ధితమౌ కర్మలఁ జేయు మానవుని నాదేవున్ మదిన్ నమ్ముచున్
యతనంబున్ బొనరించు పూరుషుని సంద్రాదార్యుల్ కరం బుత్తమున్.
91

ఏనరు డొంటిగాఁ దలఁచి యేకత ధర్మము చేయుఁ బూనునో
ఏనరుఁ డొక్కఁడే పనుల నెంతయుఁ జేయునొ వాఁడు మధ్యముం
డేనరుఁ డెందు మంచి చెడు లెంచక ధర్మము నాశ్రయింపకే
యేనొనరింతు నంచు నొనరింపఁడొ వాఁడు నరాధముం డగున్. 92

ధరణి నుత్తమ మధ్యమాధములు వోలె
మఱి యధమ మధ్యమో త్తమ మంత్రములును
గలవు; శాస్త్రప్రకారము గలిసిమంత్రు
లొగిని మంత్రించు మంత్రంబు లుత్తమములు. 93

అర్థనిర్ణయమున మంత్రు లాశయములు
మఱొకటయి యెందు తగు నదె మధ్యమంబు
తమతమ మతాలఁ బట్టి మంత్రణము చేయ
ఐక్యమత్య మొందని మంత్ర మధమ మగును. 94

కనుక మతిమంతు లగువీర లనువుగాఁగ
మంత్రణము చేసి పని చేత మతము నాకు
వేలకొలఁది వీరకపుల వెంటఁబెట్టు
కొనుచు లంక రాముఁడు చేరు మనల నణచ. 95

త్వరగ రాముఁడు భ్రాతతో బలముతోడ
సులువుగా సముద్రము దాఁటు స్ఫుటము నిజము
వార్ధి యెండించుటో యేదొ బలిమిఁ జేయు
ఇటు విరుద్ధమౌ నిఁక మనహితము గనుఁడి. 96

అని దైత్యేశుఁడు చెప్ప వీరు లగు దైత్యాగ్రేసరుల్ శత్రు శ
క్తిని గుర్తించక నీతిబాహ్యులయి బుద్ధి క్షీణులై యుండి రా
వణుతోఁ బల్కిరి రాజ! యీమన బలవ్రాతంబు ఘోరాస్త్రముల్
ఘనశూలంబులు పట్టిసాలును మహోగ్రంబౌటఁ జింతేటికిన్. 97

భోగవతికి పోయి నాగుల గెల్చితి
కైలాసగుఁ గుబేరుఁ గట్టినావు
హరుసఖుం డయి యొప్పు నాకుబేరుని గెల్చి
ధృతి విమాన మిటకుఁ దెచ్చినావు
దనుజపతి మయుండు త్వత్సఖ్యమును గోరి
తన కూతుర నీకీయఁ దనరినావు
పొగరు కుంభీనసి మగడైన మధుదైత్యు
వడి యుద్ధమున వశపఱచినావు

ఆరసాతలం బేగియె యహుల గెల్చి
వాసుకి జటి తక్షకు శంఖు వశపఱచితి
వరముఁ గని యక్షయులు కాఁగ వత్సరంబు
పోరి కాలకేయుల గెల్చు వీరుఁ డీవు. 98

వలుమాయల్ వడి నేర్చినావు విబుధస్వామిన్ వినిర్జించియున్
బలియుండ్రౌ వరుణాత్మజాతులఁ జతుర్భంగిన్ విజృంభించు వీ
రుల నిర్జించియు, మృత్యుదండ మకర క్రూరంబు భీమంబు శా
ల్మలివక్త్రాయుధ వక్షమున్ యమబలాబ్ధ్యంబులన్ దేలుచున్. 99

జయమున్ గొంటివి, కొలుగెల్చితి సమస్తంబైన లోకంబు లి
ట్టె యధీనం బొనరించుకొంటివి, మఱిట్లే రామునిన్ మించు క్ష
త్త్రియులన్ వీరుల శక్రతుల్యబలులన్ పృథ్విన్ విరాజిల్లు చె
ట్లొ యనన్ మించినవారి గూల్చితివి యుద్ధుల్ నీకునున్నే యెటన్. 100

ఇటనే హాయిగ నుండు: చాలు శ్రమ దైత్యేశా ! మహాబాహువై
పటు వీరుం డగు నింద్రజిత్తె కపులన్ బంధించి చంపున్ హుటా
హుటి నీశుం డెదమెచ్చ యజ్ఞమున నెంతో దుర్లంబౌ వరం
బటు పొందెంగద రాజ! యేల యిటు నీవాందోళనం జెందఁగా. 101

త్వరగాఁ దోమరశక్తి మత్స్యమయి వ్యాప్తాంత్రంబులే నాచుగా
కరులే కూర్మములై హయావళులె పెన్కప్పల్గ రుద్రార్కులే
మఱి గ్రాహాలుగ, దేవతావసులె భీమంబౌ భుజంగాలుగా,
కరులశ్వాల్ రథముల్ తరంగములు, కాల్బలంబగున్ సైకతాల్. 102

ఇటులన్ మీఱెడి దేవసాగరము నిట్టే చేరి దేవేంద్రు నం
తట బంధించియు లంకఁ జేర్చితిక నంతన్ ధాత చెప్పంగ న
చ్చట ముక్తుం బొనరింప దేవతలు నర్చల్ చేయు నింద్రుండు పి
మ్మట స్వర్గంబున కేగె నీకపులఁ జంపం బంపు నీ యింద్రజిన్. 103

ఎదియో పామరుచే సై
సది యిటులిది మనసునందు ననుకొసరాదున్
ఇదిగో నిపుడె రాముని
వధియింపం గలవు సుమ్ము త్వరలో నీవున్. 104

వ. అంత కార్మబ్బువంటి రాక్షసుఁడు ప్రహస్తుఁడును శూరుఁడైన సేనా
పతి ప్రాంజలియై యిట్లనెను. 105

సుర గంధర్వులు గాని పన్నగపిశాచుల్ పక్షులుంగాని ముం
దర నీకున్ నిలువంగ లేర,యిఁక యుద్ధం బందెటుల్ నిల్తు రీ వా
నరు: లానాడయితే ప్రమాదపడుటన్ బల్‌నమ్ముటంబట్టిటుల్
జరిగెన్, నేఁబదికుండ జీవములఁబో శక్తుండె నాక్రోత్రియున్. 106

వన శైలాన్విత సాగరంబు వరకున్ వర్తిల్లు సర్వక్షితిన్
హానరింపం గల నొక్కవానరుల పుర్వ్యంగాని లేనట్టు, లీ
క్షణమే వానరు నుండి రణమున్ గల్గింతు నేకొంచమై
నను నీనేరమువల్ల రాదు వ్యథ, యాజ్ఞాపింపు దైత్యేశ్వరా. 107

వ. అంత నాపల్కులు విని కోపించి దుర్ముఖుండను రాక్షసుండిట్లనియె.

ఇది యీసర్వ నిశాటధిక్కృతియొ యింకేమాత్రమున్ సైవరా
నిదె, యీవానర ఘర్షణల్ మనకె గాదీప్రోలి కంతఃపురి
విధికిన్ నీకును రాక్షసేశ్వరునికిన్ విస్మేంత ధిక్కారమో
యిదె పాతాళము నబ్ధిఁ జొచ్చినను గానీ కూల్తు వారిన్ త్రుటిన్. 108

మఱి పల్‌మాంసము నెత్తులన్ దడిసి భీమం బౌచు దుర్వారమౌ
పరిఘం గైకొని వజ్రదంష్ట్రుఁడనియెన్ బాపమ్ము దైన్యానఁ గ్రు
మ్మరు వామారుతితోఁబనేమి మనకున్ మన్నింపఁగా రాని యా
నరుఁడౌ రాముఁడు వానరేశ్వరుఁడు, నుండన్ వాని జోలేటికిన్. 109

ఇదె సుగ్రీవుని తోడ లక్ష్మణునితో నీరాము నీ దుడ్డుతో
వధియింతున్ గపిసేన లెల్లఁ ద్రుటిలోఁ బాఱంగ క్షోభించి పై
చెప నీవింకొక నాదుమాట విన వాంఛించితే నుపాయజ్ఞుఁడే
యెది యైనం బని పూర్తి చేసి గెలుచున్నెంతే పడిన్ శత్రులన్ 110

ఘనులున్ శూరులు కామ రూప ధరు లుగ్రాకారులౌ రాక్షసుల్
చని వేవేలుగ నిశ్చయించుక మనుష్యాకారముంబూని రా
ముని తోడన్ "భరతుండు పంపె నిటు మమ్మున్వినుమీ యాతండు పెం
టనెవచ్చున్ గను"మంచు సంభ్రమము వీడన్ బల్కగానొప్పెడిన్. 111

పిదపన్ వెంటనె శూలశక్తి శరముల్ వేపూని చాపాస్త్రముల్
గదలన్ పైనిడిపోయి యొక్కెడకు నాకాశంబుపై గుంపులై
మది నావానరసేన లెల్ల వివులాశ్మాస్త్రంబులన్ గుర్పి స
మ్మదమూరన్ బలమెల్లఁ గాలుపురికిం బంపించునిట్లైనచో. 112

రాముడు లక్ష్మణుండు మెతలంబడి ప్రాణములం త్యజింత్రు గా
ఈ మహినంచు నాతఁడననింక నికుంభుడు కుంభకర్ణు ను
ద్దామ సుతుండు నల్గియుమె రావణు భీషణు లోకరావణున్
ఏమిటి కీ శ్రమల్ నిలువుఁడిక్కడె నేనువధింతు నందఱన్. 113

అనఁగా వజ్రహనుండు పర్వత సముండాలించి కోపించి మో
మును పెన్నాల్కను నాకుచుం బలికెఁ బోబొండింక మీమీ పనుల్
ఘనతం జేసి సుఖింపుడేనె మఱి యొక్కండన్ సమస్త ప్లవం
గ నికాయంబులఁదిందు, రాముని ప్లవంగాధ్యక్షు నాలక్ష్మణున్ 114

వధియించెదను; హనుమంతం
గదాదులను గూల్చి పై తుఁగనుఁడీ యింకన్
మదవక్రమ పరాక్రమమును
నిదిగో నిరీక్షింపుఁడని వచించెను మిగులన్. 115

వ. పిదప నికుంభుడు రభసుండు మహాబలుడైన సూర్యశత్రువు సుప్త
ఘ్నుడు యజ్ఞహుడు మహాపార్శ్వుడు మహోదరుడు అగ్నికేతువు దుర్ధర్షుడు
రశ్మికేతువు మహాతేజుడు బలవంతుఁడు రావణుని కొడుకగునింద్రజిత్తుప్రహస్తుడు
విరూపాక్షుడు, వజ్రదంష్ట్రుడు, ధూమ్రాక్షుడు, అతికాయుడు దుర్ముఖుడు వీరు

పరిఘలను పట్టసములను ప్రాసములను శక్తిశూలములను గొడ్డళ్ళను బాణము లతో నున్న విండ్లను వాడియైన పెద్దకత్తులను గ్రహించి ఎక్కువ కోపముతో నెగిరి తేజస్సుచే దీపించిన వారువలెనయి రావణునితో నిట్లనిరి. అప్పుడు సుగ్రీవుని రామలక్ష్మణులను లంకను ధర్షించిన కృపణుడగు హనుమంతుని నిపుడే చంపెదము అని బైలుదేరగా వారినివారించి వారిని మరలకూర్చుండ బెట్టి దోసిలొగ్గి వారితో విభీషణు డిట్లనియె. 116

సామ దాన భేదోపాయ సరణివల్ల
నర్థ మెపుడు పొంద శక్యంబు గాదొ
అప్పుడె పరాక్రమమునకు నవసరంబు
కలుగు నంచు నాయనః మనీషులు వచింత్రు. 117

పొరపడిన వారియెడ శత్రువులు పడంగ
దైవము విరుద్ధ మైనట్టి తరుణమందు,
విధిఁ బరీక్షించి సరిగఁ గావించఁ బడిన
యెడఁ బరాక్రమ మన్న! సిద్ధించుచుండు. 118

పొరపడని వాని విజిగీషుఁ బరమబలుని
అసమయమున రోషము పొంద నట్టివాని
ఎదురుకొన రాని వాని మీరెదురు కొనఁగఁ
దలచుఁచున్నార, లింతయుఁ దగని దిద్ది. 119

నదములకు నదులకు నాథుఁడైన
యాసముద్రుని లంఘించి యరుగుదెంచె
చేయ లేనట్టి కర్మను చేసి యున్న
యిట్టి హనుమంతు శక్తి నూహింప గలమె. 120

వీరులార! రాముదుల వీర్యగరిమ
నెంచ నమితము దూఱ రానెట్లు గూడ
పరుసతిని బల్మి గొనుట పాపంబు ఘోర
మ ధనుశసునయిఁజంపు ననర్థకారి. 121

వ. ఇందువల్ల సీతకోసము మనకు చాల భయము కలుగును. కాన తీసి కొని రాబడిన సీతనిచ్చివేయుము కలహమెందుకు. 122

ధర్మానువర్తియె తగు వీరవరుతోడ
వృథగ వైరముగొంట హితముకాదు
కరి హయ బహురత్న పరిపూర్ణ మౌలంక
శరముల క్షయమౌట యరయరాదు
ఎదురుకొనఁగ రాక యెంతయు నుగ్రమౌ
కపిసేనచే లంకఁ గాల్చనీకు
లంక కూలుచు నుండ రాక్షసు లందఱు
రణవహ్నిఁ గూలుట కనఁగఁబోకు.

చాలయాప్తుడ నిను బ్రతిమాలుకొందు
నిన్ననుగ్రహింపఁగఁ జేయ నేను దలఁతు
హితము పథ్యము నీకు వచించుచుంటి
ఇపుడు నామాట విని సీత నిచ్చివేయు. 123

శరదర్కాంశులఁ బోలి యుద్ధపై పదునుంచంగా నమోఘంబులౌ
శరముల్ రాముఁడు వేయు, ధర్మసుఖముల్ శాంతంబు పోఁగొట్టు దు
ర్భర కోపంబు త్యజించి, కీర్తిసుఖదంబౌ ధర్మముం బూని ప్ర
మ్మఱ మమ్ముం దయ చూడు మనని మా బంధుమిత్రాళితో. 124

వ. ఇపుడే పోయి యట్టిరామునికి మన ప్రాణములుండగనె సీతనప్పగిం గింపుము. అని విభీషణుండు పలుక విని రాక్షసేశ్వరుం డగు రావణుండు ఆ రాక్షసులందఱను వీడ్కొల్పి తన గృహంబునకరిగె. 125

## —: విభీషణుడు రావణునికి హితము చెప్పుట :—

అవలనుషస్సు కాఁగఁ బరమార్థము ధర్మము నిర్ణయించి దా
నవపతికిన్ హితంబిక వినంబడఁజేసెడి భీమకర్మచే
యు వడిగ నావిభీషణుడు నద్రి శిరోగణ సన్నిభంబు నై
ప్రవర నగోన్నతంబయిన రావణు హర్మ్యము చేరియుంత టన్. 12

సరిగ నేర్పుఱచిన వరకక్ష్యలఁ దనర్చి
యెల్ల జనము లధిష్ఠించి యుండ
మతిమంతు లగు మహామాత్య లాప్తులు నను
రక్తులచే నెల్ల రక్షపొంది
మదకరు లూర్పుల మారుతము భ్రమింప
శంఖధ్వనుల వాద్యశబ్దమెచ్చ
ప్రమదల గుంపుల రాజమార్గంబులు
కలకల ధ్వనులతో గలగల మన

మేలి వసిఁడి యేన్గులు తోరణాలు తీర్ప
సుర భవనము గంధర్వ మందిరముఁ బోలు
రత్నమయు నాగ జగదాభ భ్రాతృ గృహము
జలదమును సూర్యుడటు విభీషణుఁడు చొచ్చె. 1[illegible]

శ్రుతివేత్తల్ వినిపించు పుణ్యవచనుల్ పుణ్యాహ ఘోషంబులున్
అతితేజం డగు నన్నుఁ గూర్చి జయఘోషారావముల్ విందుగా
అతిగా వించు, సుమాక్షతల్ దధియుతంబౌ నేయి నిండార స
న్మతిఁ బూజించెడి మంత్రవేదవిదులన్ గాంచెన్ సువీరుం డటన్ 1[illegible]

దనుజుల్ మెచ్చ స్వతేజుచే వెలుగుచున్ తమ్ముండు తా, నన్నరా
వణు నూర్ధ్వాసనమందునఁ గన్గొని నమోవాకంబుగావించి, స
న్మనుజాచార విదుండు జై యనుచు సన్మర్యాదగాఁ బల్కి, యా
సనమందుందగఁ గూరుచుండె సముదాచారము పాటించుచున్. 129

విజనంబందు నమాత్యసన్నిధి ఘనున్ విజ్ఞున్ మహాత్మున్ వరా
గ్రజు నారావణు దేశకాల విహితార్థజ్ఞుండు ముత్కృష్ట నీ
చ జగంబెంచు విభీషణుం డపుడు సత్సాన్త్వంతాన నెంతో ప్రస
న్న జనున్ జేయఁ దలంచుచున్ హితములన్ వాక్రుచ్చె సౌరత్వంబుతో. 130

ఎపుడా జానకి నిట్లు నీదు నగరం బీలాగునన్ జేర్చితో
అపుడా రోజున నుండి కన్గె నశుభంబౌ దుర్నిమిత్తాలు, మం
త్రపు సూక్తిన్ గడు వ్రేల్చినన్ నెఱసులన్ వర్తిల్లె జ్యోతిస్సు, లెం
తొ పొగల్ గ్రమ్మగ మండ కుండి సరిగాఁ దూర్ణంబ వర్ధిల్లవున్. 131

వెలిగెడి యజ్ఞశాలల వేదశాలలఁ
బాములు, హవ్యాలఁ జీమ లడరె

గోవుల పాలెండఁ గుంజరమద మేఁగ
సకిలించి జాలి నశ్వములు తినవు

గాడిదల్ కంచర గాడిద లొంటెలు
రాల్చి రోమము లశ్రు లడర నిలవు

కాకులు గుంపులై గట్టిగా నఱచి హ
ర్మ్యాగ్రము లెక్కి గుంపగుచు నిలుచు

గ్రద్దలును పురిన్ గుండ్రముగా భ్రమించు
నక్క లశుభమై రెండు సంధ్యలను కూయు
అశని ధ్వను లట్లు జంతుల యఱుపు లిపుడు
నగరి ద్వారాల దరి వినంగ నయ్యె. 132

అనువై యుండక కార్యమిట్లుచెడఁ బ్రాయశ్చిత్తమే యుక్తమౌ
మనమున్ నీయుడి యొప్పుచో జనకజన్ మర్యాదగా నిచ్చి రా
ముని కర్పింపుము నేను దీని నిటులన్ మోహానవో జీవితా
శవౌ వాక్రుచ్చిన సార్వభౌమ ! దొసగెంచన్ బోకు నాపై నిటన్. 133

అపశకునంబు లివ్వి జనులందఱకుం గనిపించుఁ, బ్రోలి కం
తిపురికి నిందు దైత్యులకు స్త్రీలకుఁ గూడను గానిపించు, నీ
యుపశకునంబులన్ వినువ సందఱు మంత్రులు భీతిగాంత్రు, నే
నిపుడిది చెప్పకుండు టదియెట్టులు ? కన్నది విన్న దానినిన్. 134

ఇది నిర్ధారణచేసి యుక్తముగఁ గావింపంగనౌ నంచు పల్
మృదువౌరీతిగ యుక్తియుక్తముగ నెంతేగొప్ప యుద్ధంబు నీ
హృదికెంతో హితమైన దిప్పటికిఁ గానీ ముందుగానీ మఱీ
యదనంగాని క్షమంబయౌనటు లమాత్యశ్రేణి ముందట్టులన్. 135

దనుజేంద్రుం డగు రావణున్ గుఱిచి యంతన్ యుక్తరీతిన్ విభీ
షణుఁడున్ బల్కంగ రావణుం డలుక హెచ్చన్ బల్కె నేనేమి భీ
తిని నెందుండియుఁ గాంచ, రాఘవుఁడు వైదేహిన్ గొనన్ లేఁడు నిం
ద్రునితో దేవులు సాయమైన, మఱి ముందున్నాకు నిల్వండుగా. 136

అని యిటులు పల్కి వైరినాశనుఁడు బలుఁడు
ఆజిఁ జండవిక్రముఁడు దశాననుండు
నరిగఁ బల్కు విభీషణు స్వానుజన్ము
నతనియింటికిఁ బంపె ననంతరంబ. 137

## —: రావణుడు మంత్రులతో నాలోచించుట :—

జానకీ కామమోహితుండైన పాపి
రావణుఁడు- మంత్రి సఖులు గౌరవము చూప
కుంటఁ జిక్కి కాలము దాట యుద్ధమునకు
మంత్రి సఖులతో మంత్రింప మదిని దలచె. 138

బంగారు జాలముల్ పవడముల్ రత్నాలు
కాంతుల దిక్కులఁ గ్రక్కుచుండ
ఘన మేఘగంభీర నినాదాలు మార్మోయ
ధృతశితాయుధ యోధు లెదుట నడువ
నానా వికృత వేషనైక భూషణ యుతుల్
ప్రక్కల వెన్కల వలగఁజనఁగ
మత్త గజంబులు మహిత రథంబులు
ఘన కేశిరత హయా లనుసరింప

పరిఘశక్తి తోమరగదా పరశుశూల
ధారు లతిరథులెల్లెడఁ దనరియుండ
ప్రథిత హయయుక్త రథమెక్కి రావణుండు
చక్రశంఖ తూర్య ధ్వనిన్ సభకు వచ్చె. 139

సకలేందు బింబము చాడ్పునఁ జక్కని
స్వచ్ఛాత పత్రంబు భటులు పట్టె
ఎడమ కుడిదిశల హేమమంజరు లున్న
వింజామరలు స్త్రీలు వేయుచుండ

ప్రాంజలులై యెల్ల నవనిపై నుండియు
రథమందుఁ గల ప్రభున్ ప్రణతి చేయు

ఆశీస్సులను దైత్యులందఱు నాదృతిమీఱ
నర్పించి నాదాలొనర్పుచుండ

అరిదమనుడు రావణుడును అంత త్వరగ
చక్కదిద్దిన బంగారు స్తంభములను
స్ఫటికములఁ గూర్చి కంబళ్ళు పఱచినట్టి
సభను వెల్గింపఁజేయుచు సరిగవచ్చె. 146

వ. ఆ సభ ఆఱువందల పిశాచములచేత రక్షింపబడియున్నది. అందు వైడూర్యమయమును మృగచర్మతోఁ గప్పఁబడినదియు గొప్ప దిండుగల పరమాసనము నారావణుడు అధిష్ఠించెను. పిదప ఈ సభకు లఘు పరాక్రమము గల రాక్షసులను శీఘ్రముగాఁ దీసికొనిరండని దూతలకాజ్ఞాపించెను. రాక్షసులు వాని వాక్కులు విని లంక యందు తిరిగి గృహములందు విహారశయనము లందు ఉద్యానములందు ఉన్న రాక్షసులను భయము వీడి రమ్మని ప్రోత్సా హించిరి. కొందరు మదించిన గుఱ్ఱములను, కొందఱేనుగులను ఎక్కి, కొందఱు కాల్నడకతో వచ్చిరి. అపుడాపురి ఏనుగులతోను గుఱ్ఱములతోను రథములతోను గరుడులతో నాకాశము వలె ప్రకాశించెను. దైత్యులు వివిధవాహనములను ఆపి కాలినడకనే గుహను సింహములువలె సభను ప్రవేశించిరి. వారు మెల్లగా వచ్చి రాజు కాళ్ళకు నమస్కరించి రాజుచే గౌరవింపఁబడి పీఠములందు కొందఱు దర్భాసనములందు కొందఱు నేలపయిని గూర్చుండిరి. వారందఱు రాజశాసన మునుబట్టి తగురీతిని రాక్షసరాజును సేవించిరి. ముఖ్యమంత్రులు నిశ్చయార్థ నిపుణులు సుగుణులు సర్వజ్ఞులునగు నమాత్యులువచ్చిరి. శూరులు వందలకొలఁది వచ్చిరి. బంగారురంగు గల సభయందు నందఱకు సుఖము గూర్ప గుంపులు కొలది వచ్చి చేరిరి.

మహాత్ముడును యశస్వియునగు విభీషణుడు బంగారు రంగులు గలిగి మంచిగుఱ్ఱములు గట్టిన రథముపై నెక్కి అన్న సభ దరికి వచ్చి అన్నకు తన పేరు చెప్పి కాళ్ళకు నమస్కరింపగా నతనికి రాక్షసులకు ప్రహస్తుడు తగిన ఆసనములు చూపెను. అపుడు బంగారు భూషణములు సువస్త్రములు దాల్చిన రాక్షసుల మేనుల నుండి పువ్వులమాల సుగంధముల వాసనలు గ్రమ్మెను. ఎవ్వరు కిక్కురుమనలేదు. అబద్ధములు నెవరును ఆడరు. మాటాడరు. సిద్ధార్థులు ఉగ్రవీర్యులుగ వారు అందఱు రాజు ముఖముపైకి అతని యాజ్ఞకై చూడసాగిరి. 141

శస్త్రధరులు మనస్వులు శక్తిధరులు
నైన వారల సభలోన నతిమనస్వి
యైన రావణుఁ డెంతయు నలరె నపుడు
వసుల మధ్య నంతట వజ్రపాణి వోలె. 142

వ. అంత రణములందు జయశాలియైన రావణుఁడు అక్కడకు వచ్చిన సమస్త సభను చూచి సేనాపతియగు ప్రహస్తు నిట్లు ప్రేరేపించెను. "ఓ సేనాపతీ ! ఈ రథి హస్తిప కాశ్విక పదాతిరూప చతుర్విధబలముల వారెట్లు విద్యానిపుణు లవుదురో యట్లును ఎక్కువ రక్షణ పొందునట్లును ఆదేశింపుము" అని. అపుడు నేర్పుగల ప్రహస్తుఁడు రాజాజ్ఞను చేయుందలఁచి మందిరమున లోపల బైట సర్వ సైన్యమును నగర రక్షణకై నిలిపి రాజు ముందరఁ గూర్చుండి యిట్లనియె. 143

బలవంతుండ వయిన నీ
బలమిది లోపల వెలుపల బాగుగ నుండెన్
అలయక నొలయక వడి ని
శ్చలమతి నీ యభిమతమును సలుపుము వేగన్. 144

అను ప్రహస్తుని వాక్యము నాలకించి
రాజ్యహితమున రతుఁడౌచు రావణుండు
సుఖము పొందగఁ గోరుచు సఖుల నపుడు
ఇట్లు వాక్రుచ్చె నంద తాలించుచుండ. 145

ధర్మకామార్థ సంకట తరుణమందు
అహిత హితములును మఱి ప్రియా ప్రియములు
లాభము నలాభమునుగాని ప్రకటముగను
మీరు తెల్సికొనం దగువారు గాదె. 146

ఎపుడు మీరు మొదలుపెట్టు నెల్లకర్మ
లెందు మంత్ర నియుక్తమై వృథగఁ గావు
సోమ తారాగ్రహ సురలన్ సురపతి యటు
మిమ్ముఁగని శ్రీనిగాంటిఁ గరమ్ము ఖ్యాతిని. 147

నేనయితె మీకుఁ దెలువ యత్నించినాను
ఒగిని కుంభకర్ణుఁడు నిద్రనుంటఁ దెలుప
బలుఁడు కుంభకర్ణుఁడు శస్త్రవద్వరుండు
ఈ నెలలు నాఱు నిద్రించె- నిపుడె లేచె. 148

రాముని ప్రియఁ బట్ట మహిషి నీమె నిపుడు
దితిజులు చరించువని నుండి తెచ్చినాను
ఈయలసపద నాపొన్పు నెక్కఁ గోర
దీసతీసమనా త్రిలోకిని నెపుడు గనము. 149

ఈవృథుశ్రోణి ఈతన్వి హేమమూర్తి
ఇట్టి శరదిందుముఖి మయుఁ డెట్టిమదిని
మాయువలెఁ జేసె నఱకాళ్ళు మఱి లతాంగి
కెఱుపు నును, పిపిచూడ నన్ స్మరుఁడు కాల్చు. 150

అర్కు ద్యుతివోలెను హుతాగ్ని యర్చి వోలె
నుండి యెత్తుముక్కును బొల్చు నిండు మోము
అలరు కళ్ళు నెట్టినిగోళ్ళు నరసి యామె
వశ మయితిని గామునికిని వశమె యయితి. 151

కోపమును సంతసమును సంతాప మిడుచు
మేను వెలవెల వోవునగ్ని చేయు
శోక సంతాపములతోడఁ జొచ్చి యెపుడు
కలతఁ గూర్చెడి స్మరునిచేఁ గలుష మైతి. 152

ఆవిశాలాక్షి భామిని యనుగు భర్త
రాము రాక కడిగె వత్సరంబు గడువు;
అంటి శుభరమ్యాక్షి కట్లె యనుచు
హాయము వథి నట్లు కోర్కెతో నలసిపోతి. 153

ఎటు క్షోభింపగ రాక సత్త్వబహుళంబేయౌ మహావారిధిన్
పటు సామర్థ్యము లేని దాశరథులున్ తన్మార్గులౌ క్రోతు లిం
తట లంఘింపఁగలారె పోనికపియుద్ధంబెల్లఁ దానొంటి నం
తటఁ జేసెన్ మతికొద్ది చెప్పుడిటఁ దత్కార్యాలుదుర్జ్ఞేయముల్. 154

నే నెఱనన్ మనుష్యునికి నెమ్మది, నైన విమ్మర్శ చేయుడీ
దేవుల నెల్ల గెల్చితిని తిన్నగ మిమ్ముల్లఁ గూడి యాజిలో;
ఈవిధి మీరు గెల్చితిరి యిప్పుడొ జానకి వార్తఁదెల్పి సు
గ్రీవునిఁ గ్రోతులం గొని నరేశసురుల్ వడిఁ జేరి రబ్ధికిన్. 155

ఎటు సీతన్ విడరాదొ దాశరథు లిక్ష్మ్యెట్టులన్ జత్తురో
యటు లాలోచన చేసి మీదృఢములౌ నాలోచనల్ చెప్పఁడీ
ఇటు లీసంగ్రదము క్రోతిసంఘములతో నెవ్వండు గానీ తరిం
చుటకున్ శక్తుఁడుఁ గాఁడు నాకె జయమౌ సూక్ష్మంబ వీక్షింపుఁడీ 156

వ. అని కామాతురుఁడైన రావణుని యా...లాపము విని క్రుద్ధుఁడయి కుంభకర్ణుడిట్లనె. 157

అటులన్ లక్ష్మణు డుండ రాము ప్రియభార్యన్ సీత నీవట్లు తె
చ్చుటకున్ గొంకవు, నీవె చక్కఁగని యచ్చో శ్రద్ధగాఁ జూచితే
* నట నాయామున శైల మాయమున నట్లాత్మంబు నందాపి యు
త్కట కార్యంబును నిశ్చయింతువుగదే కర్తవ్యముం జూడవే. 158

ఇంతకు సీతఁ దేక మునుపే యిటు మమ్ముల సంప్రదించితే
ఎంత సమంజసంబు నొనరించియ యుందువుగా మహాప్రభూ !
ఎంతగ రాజ్యకార్యముల నెంతయు నిశ్చితబుద్ధిఁ జేయు వాఁ
డెంతయుఁ జింతచే గుముల డెప్పుడు కార్యము చేయు మీఁదటన్. 159

క్షితిని నుపాయముం గొనక చేసిన కర్మ విరుద్ధ కర్మయున్.
సతత మపాత్రునం దిడిన సద్ధవి సట్టులు దోషయుక్తమౌ
వితగను ముందు చేయు పని పిమ్మట, పిమ్మట చేయుదానిన్
ధృతి చెడ ముందు చేయు నరుఁడెన్నఁ డెఱుంగడు మంచిచెడ్డలన్. 160

చపలుని కార్యమం దధికశక్తిని గన్గొని శత్రులైన వా
రపుడిక లబ్ధిఁ గాంత్రు విహగాదులు క్రౌంచపు రంధ్రముంబలెన్
ఇపుడిటు చూడకుండఁ బనియింతగఁ జేసితి, నిన్ను రాముఁడున్
అపుడట నీయదృష్టమున నంతు గనండు విషాన్నముంబలెన్. 161

కాన నితరులు గావింప లేని కర్మ
నీవు గావింపగా మొదలిడినావు గాదె
అనఘ ! నీదు శత్రువులను హత మొనర్చి
మేలుగా నెల్ల నేను సమీకరింతు. 162

---

* అవతారవేళ యమున యామునహ్రదమును మొదట పొంది పిదప సముద్రమును పొందినట్లు నీవు కార్యము చేయుమని భావము.

అప్పుడా మెను బల్మి మై ననుభవించి
వస్త్రహీనను గావించి వదలినాను
లలన నలిగి పోయియు వాడు నళినివోలె
ఆ ప్రజాపతి భవనంబు నరిగె నంత. 174

అప్పు డామహాత్మునికది యంతకూడ
తెలిసి పోవ నల్కను బ్రహ్మదేవుఁ డనియె
నేఁడు మొదలేలలన నైన నీవు బల్మిఁ
గలియ నీతల నూఱు ముక్కలగు నిజము. 175

అను ప్రజాపతి యిడు శాపమునకు హడలి
ఆమెను బలాత్కరించి పొందుఁ జేర్ప
నబ్ధిబోలు నావడి గాలి యట్టి గతియు
యెఱుఁగడిది రాముఁడౌట నన్నెదుర వచ్చు. 176

కూర్కుచున్న సింహము నటు క్రుద్ధుఁడైన
కాలు నట్టుల నను లేపఁగడఁగె నతఁడు
రెండు నాల్కల యహి నట్లు మండుచున్న
నా శరముల నాజిఁగనక నన్ను లేపు.

వజ్రములవంటి వందల బాణములును
విసరి యుల్క లేనుగునట్లు వెస దహించు
ప్రథిత మచ్ఛక్తిఁ దచ్ఛక్తి లాగిపైతు
వేకువను తారల ద్యుతి వేవెలుగువోలె. 177

వేల కనులున్న యింద్రుడేన్ వేగ వరుణు
డేని నన్నెదురుకొన లేరిది నిజంబు
మున్ను నా బాహు బలమును ముఖ్యుడైన
వర కుబేరుని పురి నేను పట్టలేదె 178

వ. అలత రాక్షసరాజు పలికిన వలుకులు కుంభకర్ణుని గర్జితములు విని విభీషణుఁడు హితము నర్థయుక్తమునగు వాక్యము రాక్షసరాజుతో నిట్లని పలికె. 179

వక్ష మను పెనుపడగ, తాపంపు విషము
హాస మనియెడి తీక్ష్ణమై యలరు కోఱ
లయిదు వేళ్ళనుశిరసులు నైదుగలరు
సీత యనుపాము నెట్లు తెచ్చితివి రాజ! 18

నగశృంగంబులఁ బోలు వానరులు దంష్ట్రల్ గోళ్ళుశస్త్రంబులై
తగ లంకాపురిపైకి రాకమునుపే త్యాగ్ర్య శీర్షంబులన్
తెగవేయన్ గడు వజ్రతుల్యమగు దీప్తిన్ మించు తుంయ్యూ సమా
శుగముల్ మీదకు రాకముందె యిఁడు మిచ్చి రామునకై జానకిన్. 181

పిడుగువంటి ప్రాణాలు తీసెడి శరాలు
రాముఁ డేయ నీమేను నెల్లను బగుల్చ
లేద యిందొక కాన నీరీతి నీవు
నిను గరంబు శ్లాఘించు కొనుచు నుంటి 18

కుంభకర్ణుఁ డింద్రజి గాని కుంభిపేశఁ
డైనను నికుంభ కుంభాదులైనఁ గాని
ఆమహాపార్శ్వుఁడు మహోదరాతి యయు
లైన నాజి రాముని ముంద నాఁగ లేరు. 18

రవిచే రక్షణ గాంచినన్ సురలు నిన్ రక్షించుచోఁగాని మృ
త్యువు దేవేంద్రుడు స్వాంక మందునిలువన్ వ్యోమానఁ బాతాళ మం
దు వడిన్ జొచ్చినఁ గాని రాఘవుఁడు నిన్నుం దాను ప్రాణాలతో
ఉ విడంబోవఁడు సుమ్ము రావణ సుదార్ఢ్యం బార శోధింపుమీ. 18

అని వా్రకుచ్చెడి యా విభీషణుని వాక్యంబుల్ ప్రహస్తుం డటుల్
విని యప్డిట్లనె మాకు నేమియు భయంబే లేదు, దేవాసురా
ది నికాయంబులవల్లగాని యిఁక నెందేఁగాని, గంధర్వ యు
క్ష నిలింపాదులు భీతి గూరుపర యింకన్ మర్త్యుఁడౌ రాముఁడౌ. 185

అహితవాక్కు లిట్లాడు ప్రహస్తు పలుకు
వినుచు ధర్మార్థకామ నివిష్టబుద్ధి
యగుచు రాజహితంబు నభిలషించు
నావిభీషణుఁడు మహాత్ముడనియె మరల. 186

ఓ ప్రహస్త! దైత్యపతి మహోదరుఁడును
నీవు కుంభకర్ణుఁడును ముందే వచించి
నట్లు కార్యసిద్ధి గన శక్యంబెగాదు
ధర్మహీనుండు స్వర్గమొందని విధాన 287

తరణి లేని జనుఁడు వార్ధిదాటలేని
యట్లు నేనుగాని మఱి నీ వయిన గాని
సర్వదైత్యులు నర్థ విశారదుండె.
యైన రాముని వధను చేయంగలేము. 288

ధర్మమె ప్రధానముగఁగల్గి తాదృశు డయి
అధిక వీరుడై యిక్ష్వాకు నాత్మజుఁడయి
శక్తుడు మహారథుండు నైన యట్టి రాము
కృత్యముల దేవులును మూఢులేగదయ్యు. 2(9

వంగినవి యుగ్రములును దుర్వారములును
గ్రద్ద యీకలు గట్టిన రాము శరము
లిపుడు నీ మేనఁ జొచ్చును నిఁక ప్రహస్త!
కనుకనే యిట్టులఁ బొగడి కొనుచు నుంటి. 290

అట్టి రావణుఁడు త్రిశీర్షుఁడతిబలుండు
కుంభ కర్ణుఁ డితని కొడుకు నికుంభుఁ
డింద్రజిత్తును మఱియును నీవు గాని
శక్ర సము రాముని కనిన్ సాటిరారు 191

అతి రథుడగు దైవాంతకుఁడైనఁ గాని
ఆ యకంపనుఁడతికాయు డానరాంత
కుఁడును నీ వద్రి సములైనఁ గూడ నెపుడు
ఆజి రాముని కెదురుగా నాగలేరు. 192

ఇట్టిరాజు వ్యసనముల యందిట్టె కూలి
పెద్ద రిపులగు మీరు సేవించుచుండ
రాక్షస కృత్యమున కయి ప్రకృతి గానె
సరిగఁ జేయక యిట్టుల సలుపు చుండె. 193

అంతులేని పడగయు సహస్ర శిరసు
ఉగ్రమగు మహాబలమును నున్నగొప్ప
కాము సర్పముచే విసరంగఁ బడిన
రాజు నిఁక మీరు విడిపింప రండు త్వరగ 194

పనులు పూర్ణంబుగాఁ దీర్చుకొనిన సర్వ
సుహృదులును కల్సి తామొక్కచోటఁ గూడి
జుట్టుకొనియె యైన క్షోణిపతిని
బ్రోవవలెఁ బికాచము పట్టు పురుగుఁ బోలె 195

సంహరించెడి యీ కామసాగరమునఁ
గప్పఁబడి రామబడ బాముఖానఁ బడుచు
నున్న దైత్య విభుని బ్రోవనొగిని మీర
లెల్ల స్వయముగ దాటింప నిపుడె కనుడు. 196

ఈ పురికి దైత్యులకు రాక్షసేశ్వరునికి
సుహృదులకు నా మతమును శుభము నైన
సంగతిని జెప్పుచుంటి వినఁగదగును
జనపతి సుతుని కిత్తము జనక సుతను. 197

పరబలము స్వబలంబును సరిగఁ దెలిసి
క్షయము వృద్ధిని యుక్తముగా గ్రహించు
తనదు పక్షమును విమర్శ యొనరఁ జేసె
తగిన యటు స్వామి హిత మాడఁ దగును మంత్రి. 198

ఆబృహస్పతితో సాటియైన బుద్ధి
గల విభీషణు యుక్తవాక్యముల వినియు
గొప్ప మతి గల యోధముఖ్యుండె యైన
యింద్రజి త్తప్పు డిట్లు వచించె మిగుల. 199

నాయన ! యేల యిట్టుల ననర్థక మల్పపు మాట బేలవై
యీయెడఁ బల్కుచుంటి విటు లీకుల మందు జనింపకున్నఁ గా
నీ యిటు పల్కఁ డిట్టు లొనరింపఁడ; వారన నెంత, నీవెగా
కే యిటు శక్తివిక్రమము నేపును తేజును లేక యెవ్వఁడా. 200

మనలోఁ బామరుతోడఁగూడ దనుజా! క్ష్మాధీశు పుత్త్రిల్ రణం
బునఁ బోరంగను శక్తులే ? యిటులు మమ్మున్ వే హడల్ కొట్టు దే
లను ఓభీరు! త్రిలోకనాథుఁడగు స్వర్గాధీశు డైనన్ ధరి
త్రిని గూలెన్ సుర లెల్ల నాభయముచే దిక్కుల్ లేక పర్వెత్తిరే. 201

వ. అని యిట్లు శక్రసముండును దురాసదుండును మహౌజసుఁడు నగు నింద్రజిత్తు పలుకగా విని శస్త్రధారులలో శ్రేష్ఠుడైన విభీషణుఁడు పలికెను. 202

ఇటు లాలోచనలోన నీకు బల మింతేన్ లేద, బాలుండ విం
తట నింకం బరిపక్వబుద్ధివిగ నుండన్ లేద నీవింతయున్
ఇట నిన్నున్ నశియింపఁజేసికొౌన నెంతే నర్థ హీనంపు మి
క్కుటమౌ మాటలు ప్రేలుచుంటివి సభన్ గూర్చుండి యిప్పట్టునన్. 203

రావణసుతుఁగ నింద్రజి! ప్రథితుఁడ వయి
రామువలన నీగతి సకలము నశింప
వినుచు మోహాన సమ్మతిం గనఁబఱచుట
మిత్ర మటు పైకి నటియించు శత్రు వీవు. 204

నీవె వధ్యుఁడవు కుమతి వీవు వట్టి
బాలుఁడవు సాహసికుఁడ వీలీల నిన్ను
మంత్రకర్తల దరికి నీమంత్ర గృహము
నిటుల చేర్చు నితఁడు వధ్యు డెట్టులైన. 205

మూఢుఁడవు ధృష్టుఁడవును నమ్రుఁడవె కావు
అల్పమతివి తీవ్ర స్వభా వాన్వితుఁడవు
దుష్టుఁడవు మూర్ఖుఁడవు కడు దుష్టమతివి
ఇంద్రజిత్తు! బాలుడవౌట నిట్టు లనెదు. 206

బ్రహ్మదండ మట్టుల నిట్లు ప్రబలుచుండి
కాలువలె నిప్పు లుమియు బాణాలు వేగ
యముని దండమువలె మీఁద నడచుచుండి
రాము నెదిరి వడ సయిపఁగలడె యెవఁడు. 207

ధనములు రత్నములు నగల్ దైత్యరాజ!
దివ్యవస్త్రాలు చిత్తమౌ దీప్త మణులు
జానకీదేవితోఁ బాటొసంగి రాము
వీతకోపుఁ జేసి వశితంత మిట్టుఖాన. 208

చక్కఁగ హితంబు నిటు విభీషణుఁడు చెప్ప
వినియుఁ గాలంబు త్రోయు రావణుఁడు పలికె
అరులతో నల్గు పాముతోఁ దిరుగ వచ్చు
అరిఁ గొలుచు మిత్రనామముతోఁ దిరుగరాదు. 2

జ్ఞాతుల శీలంబు సర్వమెఱుంగుదు
జ్ఞాతిపాట్లకు జ్ఞాతిసంతసించు
ముఖ్యసాధకు వైద్యుఁ బుణ్యధార్మికుశూరు
వందితుఁగని జ్ఞాతి పరిభవించు
వహ్నినస్త్రములేని పాశమేన్ భయమిడ
విలస్వార్థపరులు జ్ఞాతులను బోలి
జ్ఞాతులే బంధింప సలహాలనిత్తురు
జ్ఞాతి భయమె సర్వకష్టకరము
ఆవులనగు సంపద, విప్రులందు దమము
సతులఁ జపలత, జాతుల వెతలు గలవు
అనుచుఁ బాశధరులఁగాంచి పద్మవనిని
ఏన్గులనె నేను వాని నాలించితినిట. 210

ఏను లోకాలచే సత్కరింపఁబడుదు
అన్ని యైశ్వర్యముల నేను వందియుంటి
జ్ఞాతులందఱు నను శిరసావహింత్రు
ఇందుచే సౌమ్య! నేనన్ని నిష్టపడవు. 211

అంబుబిందులు తామరాకునఁబడి కలి
యునటు దుష్టుల మైత్రియుంట దెపుడు
మధువులానుచుఁ బూల మధుపముండనటు నీ
వౌదు, దుష్టుల మైత్రియుంట దెపుడు

స్నానమాడి గజంబు చల్లుకొనును దుమ్ము
నట్లె దుష్టుల మైత్రి వ్యర్థమగును
శరదృతువున్ మబ్బు లుఱిమి చిన్కులు రాల్చి
కురియనటు ఖలులన్ గూర్మి పడదు

ఇతరుఁడె గనుక నిట్లు వచించె నేని
రాక్షస ! యిపుడె వాడింక బ్రదికియుండ
డిది నిజంబు సుమీ ఛీ! ఛీ! యాకులాన
కీవు వేరుపురుగ వైతి వెఱుఁగు మిపుడె.

అని యారావణుఁడిట్లు చెప్ప విని న్యాయంబాడు నాయా విభీషణుఁడున్, దైత్యులు నల్వురనుసరించన్ దన్ను శీఘ్రంబుగా తనకేలన్ గదదాల్చి పైకెగిరి జాత క్రోధుఁడై యిట్లు చెప్పెను దైత్యాధిపుఁ డన్న రావణునితో ప్రేమంబ శ్రీమంతుడై.

"నీవో యన్న వెకావు నాకు నధిపా! నీచిత్తమున్ వచ్చి న ట్లీవో నన్ను గుఱించి పల్కెదవిటుల్, జ్యేష్ఠుండవున్ తండ్రి య ట్లీవున్ మాన్యుడ, వైన–ధర్మపథిలో నిష్ఠిగకున్నావ యి ట్లీవున్ పల్కిన యాకఠోర మనృతంబే నింక సైపంజుమీ.

హితముం గోరెడి నే నీ
హిత మాడితి, బుద్ధిలేని యాజను లెపుడున్
మృతికిన్ లొంగినవా రీ
హితమును గ్రహియింప రెప్పు డీలోకములో.

అనయము ప్రియమును పలికెడి
జనులు సులువుగ దొరకుదురు సత మప్రియమై
నను హితమును చెప్పెడి వా
రును వినువారును దొరకరు లోకములోనన్.

లీలగ నెల్లను మ్రింగెడి
కాలపుఁ బాశంబుచేతఁ గట్టంబడియున్
కూలు నిను నుపేక్షింపం
జాలను, కాలెడి యిలు కనఁజాలని యట్టుల్. 217

మండెడి నిప్పులవలె నె
న్నండును వెలుఁగుచుఁ బసిండి నగలుండి కడున్
చెండాడు వాడియమ్ముల
నిండుగఁ జనిపోవుచున్న నిను గనఁజాలన్. 218

శూరులు బలయుతులు ధను
ర్ధారులు నేర్పరులు గాని రణరంగములో
మీఱుచు పైఁబడు కాలపు
బారిని బడుచుందు రిసుక వంతెన లట్టుల్. 221

కనుకన్ సహియింపుము నీ
వును నాకన్న వగుట హితవును గోరెడి నే
నును నిటు వచింతు నీ కయి
నిను, లంక నసురులు బ్రోవు మెల్ల విధాలన్. 222

నీకగు శుభ, మరిగెద, నే
లేకుండగ సుఖివి కమ్ము ప్రియమగు హితమున్
వాకొన నానుడి వినవు
లోకమున గతాయువులు వినరుగద హితోక్తుల్ 219

అటులన్ రావణుతో విభీషణుడు కష్టాలాపముల్ పల్కియున్
త్రుటిలో రాముఁడు లక్ష్మణుండు కల పాథోధి ప్రదేశాన కం
తట రాఁగా, ఘనమేరు శృంగ మటు దీప్తంబైన విద్యుద్గణం
బటు లభ్రస్థితుఁడౌ విభీషణుని ప్రోగై చూచి రావానరుల్ 220

తనతో సైదగు వా విభీషణుని దుర్ధర్షుండు ధీయుక్తి నొ
ప్పిన సుగ్రీవుడు వానరాధిపులతో వీక్షించి ఈ దైత్యు లే
లను నేతెంచుచు నుండి రంచు గడు శీఘ్రంబట్లు లోలోనఁ జి
తన గావించి హనూమదాది కపులన్ రావించి తా నిట్లనెన్. 223

ఇదె సర్వాయుధముల్ ధరించుచు నితండెవ్వండొ దైత్యుండు దు
ర్మదులౌ నర్వురు దైత్యులన్ గలిసి నీలాగే వడిన్ వచ్చెడిన్
ఇదిగో చూడుడు వీడికన్ మనల నిట్టే చంపుఁబో దప్ప కం
చది సుగ్రీవుడు చెప్పఁ బల్కి రిటు చెట్లద్రుల్ కపుల్ పీకుచున్ 224

త్వరగా నానతి యిమ్ము రాజ! ఖలులౌ దైత్యాగ్ర్యులన్ వీరి నం
దర స్వల్పోజులఁ జంపివైచి ధరక్రిందన్ గూల్తు మంచున్ బర
స్పరమున్ బల్కుచు నుండ నుత్తరతట ప్రాంతంబు నంజేరి యం
బరమందుండి విభీషణుఁడు ప్లవగ వ్రాతంబుతో వాకొనెన్. 225

రావణుడున్ దురాత్ముండును రాక్షసరాజును నైన రాక్షసుం
డీ వసుధం గలం డతని కే ననుజుండ విభీషణుండ వాఁ
డీ విధి నాజటాయును వధించియు సీతను దొంగిలించె నా
పై వివశాత్మయౌ జనకు పట్టిని గాయుదు రాసురాంగనల్. 226

చక్కఁగఁ బోయి రామునికి జానకి నల్లప నప్పగింపు మం
చెక్కుడు చూపి యుక్తులను నెంతగ నో బ్రతిమాలి చెప్పినన్
ఇక్కఁడె చావు మూడఁగ గ్రహింపని మూర్ఖుఁడు నౌషధం బటుల్
ఒక్కటిఁ గూడఁ దాఁజెవుల నుంచఁడు రావణుఁ డీహితోక్తులన్. 227

నను బరుషంబులాడుచు క్షణంబున దాసునిబోలెఁ ద్రోసి క్ర
న్నన నవమానముం జలుప నాదు సతీసుతులం ద్యజించి యీ
క్షణమున రామునిన్ శరణుఁ గాంచెద నేను విభీషణుండ వెం
టనె తెలుపుండి లోకశరణంబిడు రాముని కీక్షణంబునన్. 228

అని సుగ్రీవుఁడు నాలకించి లఘువీర్యం బొప్ప వేగంబ ల
క్ష్మణు ముందే యిబు రాముతోడఁ బలికెన్ సంరంభ మేపార రా
వణు తమ్ముండు విభీషణుండు తన క్రేవన్ నల్వురౌ రాక్షసుల్
చనుదేఅన్ శరణొంద నిన్ను దరిసెన్ జక్కంగ యోచింపుమీ. 229

ధృతి నాలోచనలోన వ్యూహము ల నీతిన్ గూఢచర్యావిధిన్
మతిమంతుండవు వానరాధిపుల క్షేమంబున్, రిపుల్ చేయు ప
ద్ధతులన్ దెల్సి చరింపు రాక్షసులో యంతర్ధానముం గాంచ్రటు సం
తతమున్ మా యలం గామరూపముల జాణల్: నమ్మరా దెన్నఁడున్. 230

ఇతఁడో రావణు గూఢ చారి యయి యిక్కేతెంచి యుండుం జుమీ
యితఁ డిట్టుల్ మనలోనఁ జొచ్చి మనకెంతే భేదముం గూర్చు నీ
క్షితి సందేహములేదు, లేక యెదియో ఛిద్రంబు కల్పించి మా
నిత రీతిన్ మతి గల్గి సమ్మునల నొప్పించుఁ జుమ్మెప్పుడున్. 231

అటవీ సైన్యము మిత్రసైన్యమును భృత్యానీకమున్ మౌలమున్
పటురీతిన్ గొనవచ్చు శత్రుబలమున్ దప్పించి; నీశత్రు వు
త్కట సైజం డగురాక్షసేశ్వరుని స్వంశ భ్రాత యేతెంచెఁ జె
ప్పటి పక్షంబున నుండి వచ్చు నను జున్ నమ్మంగ రాదెన్నఁడున్. 232

రావణుఁడే విభీషణు ఛలంబునఁ బంపిన యట్లె యుంగుమీ
యీపటు వాని నిగ్రహము నింక నొనర్చుట యుక్త మంచు నా
భావము, మోక్షమార్గవర! వాఁ డిటు నమ్మిన నిన్ను మాయతో
నే, విధిగా గ్రహించి ప్రహరించును గాకుల గబ్బిలం బటుల్. 233

ఇతనిన్ వాని యమాత్యులన్ త్వరగ నిష్ఠే నీవు శిక్షింపుమీ
యితఁడో క్రూరుఁడు రావణేశు ననుజుండే, యంచు నవ్వాహినీ
పతి సుగ్రీవుఁడు చెప్పి మౌనము వహింపన్ జూచి రాముండు స
న్మతి సత్కీర్తి సమీపమందలి హనూమన్ముఖ్యులన్ వాకొనెన్. 234

వ. రావణుని తమ్మునిగూర్చి కపిరాజు సుగ్రీవుఁ డేమి యుక్తియుక్తముగఁ జెప్పెనో మీరును వింటిరిగదా. కష్ట సమయములందు నాయైశ్వర్యము గోరుచు బుద్ధిమంతుఁడైన స్నేహితుఁడు హితము చెప్పుట యుక్తమో అని రాముఁడు పలుక ఆవానరులును రాముని హితమును గోరువారయి మర్యాదాపూర్వకముగా నిట్లు చెప్పిరి. 235

మూఁడు లోకాలలేదు నీచూడని యది
కాని, మాయందుఁ గలిగిన గౌరవమున
ఇంక మాయెడఁ గలుగు సౌహృదముచేత
అన్నియును దెల్సి యుండియు నడుగు చుంటి. 236

నీవో సత్యవ్రతుఁడవు
నీవే శూరుఁడవు ధర్మనిరతుఁడ వింకన్
నీవే దృఢవిక్రముఁడవు
నీవు పరీక్ష్య కరుఁడవు సుహృద్గతమతివిన్. 237

కనుకన్ మంత్రులొక్కొక్కరే తమదు యోగ్యాశయంబుల్ వడిన్
వినిపింపన్ దొరకొంద్రుగాక యనఁగన్ వేగంబె వారున్ విభీ
షణునింగూర్చి స్వీయభావముల విస్పచ్ సాగి రందాది యం
దునె చెప్పెన్ వడి సంగదుండు స్వమతి యుందున్దోచునుద్దేశముల్ 238

అరిపార్శ్వంబున నుండి వచ్చుటను శంకాత్ముండయౌ సర్వథా
మది విశ్వాసముతో విభీషణుని నమ్మన్రాదు వెన్వెంటనే
చరియింత్రిప్పుడు తమ్ము దాచుకొని మోసంబౌ మదిన్ మీదవా
రరయన్ వారవకాశమెంచుకొని కష్టార్థంబులన్ జేతురే. 239

అనయం బర్థ మనర్థము
గని నిశ్చయమును పొసర్పగాదగుఁ జుమ్మీ
గుణములఁ బట్టియుఁ గొని యవ
గుణములఁ బట్టియుఁ ద్యజింప గుణ మగుఁ బ్రభువా! 240

ఒకవేళ నతని యందు మ
నకు ఘనమగు దోషమే కనంబడు నెడఁ ద
ప్పక విడువందగు, సుగుణము
లె కనుక నెక్కువ కనబడ నృప! గైకొననౌ! 241

వ. అని యనిన పిదప -

గూఢచారులఁ బంపి రూఢంబుగా సూక్ష్మ
మరసి చేయు మటంచు శరభుఁ డనియె

అరి పాపి ఖలునుండి తఱి చోటనక పచ్చె
వర్జ్యుఁడనుచు జాంబవంతుడనియె

అనయు నన్నుజ్ఞుడై యట నవ్యుఁ బ్రశ్నించి
మఱి హితాహితుఁ గన మైందు డనియె.

సంస్కార యుక్తుఁడౌ సచివోత్తముడు హను
మంతుఁడీ విధముగ మఱియుఁ బలికె

తగు సమర్థ నిన్‌గిష్పతి దాటలేఁడు
వాదమునను సంఘర్షచే బలముచేత
చెప్పరాని రాముని బట్టి చెప్పుచుంటి
సచివు లర్థమనర్థ మెంచంగదాసగె. 242

ఇటులన్ సూక్ష్మ పరీక్షయో తగద యా రాజ్యకార్యాలఁ బం
చుట లేకుండ సమర్థతన్ గనుట యిచ్చో శక్యమే కాద యిం
తటిలో వెంటనె కార్యమం దునుచుటే తప్పానుగా చారుఁ బం
పుట యుక్తంబును కాద యిందు కరణంబుల్‌లేమి ష్గ్గాదుగా 243

తఱిఁ జోటెంచక యా విభీషణుఁడు చెంతన్ జేరె నన్మాటయున్.
సరిగా దియ్యదె దేశమున్ తఱియు నెంచన్ యుక్తమౌ నిల్పి యా
పురుషున్ గాదని యన్యుఁ జేరుట గుణంబుల్ దోషముల్ చూచి నీ
దరి శౌర్యంబును భ్రాతయందుఁ జెడుగున్ దర్శించి రానర్హమౌ. 244

వ. మఱియు క్రొత్తవానిని బ్రశ్నించిన చో వెంటనె బుద్ధిమంతుఁడైన యాక్రొత్తవాడు శంకించును అందువల్ల సుఖముగా వచ్చిన వానిని వ్యర్థముగాఁ బ్రశ్నించుటచే మైత్రి పాడగు, అదిగాక యితరుని స్వభావ గుణములను వెంటనే తెలియ శక్యములుగావు. నిపుణముగా నాలోచించినచో ఇతరుడు చెప్పిన దానిలోని స్వభావములు సరిగా దెలియుమలేము. అతఁడెక్కువగాఁ జెప్పు చున్నను వానిలో దుష్టభావము ఏమాత్రము కనుపట్టుట లేదు. వాని మొగము గూడఁ బ్రసన్నముగా నే,యున్నది. ఇందులో సందేహము లేదు శంక లేని మతి గలవాఁడు స్వస్థుఁడై శఠుఁడై యిట్లు రాలేడు. ఇతని మాటకూడ దుష్ట ముగా లేదు. ఆకారము కూడ నెంత దాచెద మన్నను లోపరి భావము వెల్లడి కాక మానదు దాగదు. ఓకార్యవేదులలో శ్రేష్ఠుఁడా! తగినదేశకాలములందు వచ్చిన కార్యము ప్రయోగింపఁ బడినచో శీఘ్రముగా తగినఫలము నిచ్చు! నీప్రయత్నమును రావణుని దుర్వృత్తమును వాలివధను, సుగ్రీవాభిషేక మును జూచి తనకు రాజ్యము కాలయు నని బుద్ధిపూర్వకముగా నీత డిక్కడకు వచ్చె అందుచే నిదియంతయు యోచించి వానిని గ్రహించుయుక్తము ఆరాక్ష సుని ఋజుస్వభావమును గూర్చి నాకుఁ దోచిన యది చెప్పితిని. నీవు బుద్ధి మంతులలో శ్రేష్ఠుఁడవు మిగిలిన యన్నిటికి నీవే ప్రమాణము అని యిట్లు హనుమంతుడనియె. 245

అని యామారుతి చెప్పఁగా విని ప్రసన్నాత్ముండయొ రాముఁడున్
తనలో నున్న దనెన్" విభీషణుని వార్తంగూర్చి నాశ్రేయస్సు లెం
చిన మీకెల్లయుఁ జెప్పెదన్ వినుఁ డిటన్ స్నేహాన నేతెంచు వా
లిని, వాఁ డెడయినన్ త్యజింప, దోషి యగుఁగానీ మెత్తుగాపండితుల్
246

అనసుగ్రీవుడు రాముమాక్కులఁ గరం బాత్మన్ విమర్శించి యి
ట్లనె దుష్టుఁడో యిటుల నత్యంతంబు కష్టాల ము
న్గిన భ్రాతన్ భువి నెవ్వఁడైన విడునా, కీడొందు భ్రాతన్ త్యజిం
చిన వాడిట్టిక నెవ్వని విడ డికన్ స్వీకార్యుఁడే కాఁడికన్. 247

అటు సుగ్రీవుని వాక్యముల్ విని ప్లవంగాళిన్ మొగం బెత్తి యి
ట్లటు పైకిన్ గని పిన్న నవ్వు నగి దీప్యల్లక్షణున్ లక్ష్మణున్
పటుదీక్షన్ గని సత్యవిక్రము డిటుల్ వాక్రుచ్చె రాముం డిటుల్
పటు శాస్త్రార్థవ్యసనంబు లేక గురుసేవల్ లే కితం డెట్లనున్: 248

ఇటఁ బ్రత్యక్షమొ లౌకికంబొ మఱి యెంతే సూక్ష్మమౌ నేదొ యీ
క్కటి సర్వార్థిపుఁ డంచు యున్న దని యాశంకన్ దోఁచుః నీజ్ఞాతి చేరి
గట నున్నట్టి జనంబు కష్టపుతటిన్ గాంక్షించి బాధించు చె
న్నటులున్ మిత్రు లటంచుఁ జెప్పుదురు కానన్ వచ్చె నీతండిటుల్. 249

అనఘుల్ సత్కులజాతులున్ జగతి స్వీయజ్ఞాతులన్ మె...ప
జ్ఞను నీజ్ఞాతిని భావతుల్ తఱచుగా శంకింతు రీశత్రు సే
నను గైకొంటయు దోషమంటి విచటన్ శాస్త్రోక్తమౌ దాని నిం
కను వాక్రుచ్చెద విన్ము, తత్కులమొ కామిత దర్థార్థి యున్. 250

దనుజుల్ విజ్ఞులె కాన సన్నియు మదిన్ దర్కించి యీతండు వ
చ్చెను నీహేతువుచే విభీషణుఁ డికన్ స్వీకార్యుఁడే యౌను, నిం
కను సవ్యగ్రులు సంప్రహృష్టులును నీజ్ఞాతుల్ మఱన్యోన్యమై
త్రిని గాంక్షింపరుగాన జ్ఞాతితతిఁ దద్భేదంబు గావించుఁగా. 251

ఇతడో భీతిని పొంది యుండుటనెగా యివ్వాని కంఠస్వరం
బతిగాఁ గన్పడుఁ గాన వీని గొనుటే యర్హంబు; వీక్షించినన్
క్షితిలో నెల్లరు భ్రాతలున్ భరతులాగే యుందురా, నావలెన్
సుతులుంద్రే, మది నిన్నుఁబోలు సుహృదుల్ శోధింపఁగన్పింతురే. 252

వ. అని యిట్లు సుగ్రీవునితోను లక్ష్మణునితోను రాముండు చెప్పగా విని మహాప్రాజ్ఞుఁడైన సుగ్రీవుండు ప్రణమిల్లి యిట్లనియెను. ఓర్పుగల ఓ శ్రేష్ఠా, ఈ విభీషణుఁడు రావణునిచే పంపబడిన వాడుగనే తలఁపవలయును. అతని నిగ్రహించుటయె తగినది. రాక్షసుఁడు కపటబుద్ధిచేఁ బంపఁబడి యిచ్చటకు

వచ్చెను. నమ్మిన నన్ను నిన్ను లక్ష్మణుని ఇతఁడు బాధింపఁగలడు. ఓ మహా బాహూ ! ఇతనిని సచివులతోపాటు వధింపుము ఇతడు క్రూరుఁడుడైన రావణుని తమ్ముడు. అని వాహినీపతియగు సుగ్రీవుఁడు మౌన మూనెను. అపుడు సుగ్రీవుని వాక్యము విని విమర్శించి మరల రాముఁడనెను. 253

ఇతఁడున్ దుష్టు డదుష్టుడో యవుతఁగానీ సూక్ష్మరీతిం గనన్
క్షితిలో నాకహితంబ యెట్టులయినన్ జేయంగ లేడెప్పుడున్
దితిజాళిన్ దనుజాళి యక్షులను నిందే వ్రేలి యగ్రంబుతో
మృతిఁ బొందించఁగఁ జాలుదున్ క్షణములో వీక్షింపు గీశాధిపా. 254

మును పత్నిన్ వధియించి బోయ శరణం బొందంగఁ బూజించి క్ర
న్నన స్వీయంబగు మాంసమిచ్చి మిగులన్ న్యాయంబ యాబోయఁ గా
చిన యా పావురపుం గథన్ వినమొకో చెన్నార నాపావురం
బును వీక్షిం, పెటు చేసెనో యటులనన్ బోల్ వాడిటుల్ చేయుడే. 255

విను కణ్వనిపుత్త్రిఁడు ఋషి
యు నయిన కండువు పలికిన యొకయుత్తమగా
ధను నాలింపుమి యయ్యది
ఘనసత్యము బోధపఱచుఁ గలకాలంబున్. 256

కరములు మోడ్చిన దీనుని
శరణని యాచించు వాని జాలియుఁ బడి యే
నరినైనఁ బ్రోవఁ దగదే
ధరలో నిది యుత్తమ మగు ధర్మముగాదే. 257

దీనుఁడె గానీ పొగరు గల
మానవుఁడే గాని పరుల మానక శరణున్
తానొంద నరి కృతాత్ముఁడు
ప్రాణాలు విడచి యయినను రక్షింపవలెన్ 258

శరణొంది శరణు నిడమిని
శరణీయనివాఁడు చూడ క్షయ మందెడి యా
నరుఁడు శరణు నీయని యా
నరుని సకల పుణ్యము గొని నయముగ నరుగున్. 259

శరణొందు వారి కెప్పుడు
శర ణిడమిని దోషమెంతొ జనియించును నా
తరి స్వర్గము రా దయశ
స్కర మగు బలవీర్య నాశకర మగుఁ గూడన్. 260

మరి స్వర్గప్రదము యశ
స్కరము ఫలప్రదము ధర్మకరమును నగు నా
వర కండు నుత్తమోక్తిని
నిరతము గావింతుఁ జుమ్మి నెమ్మదితోడన్. 261

ఒకపరె శర ణొందెడి వా
నికి నీవాఁడ నను బ్రోవు నెమ్మది ననుచున్
నికట మగు సకల భూతా
శికి నభయుం బిడుట నాదు ప్రియ మగు వ్రతమౌ. 262

వీనిని గైకొని రమ్మో
వానరవర ! యిడు డతని కభయ మిడినాఁడన్
ఈ నరుఁడు విభీషణుఁ డే
కానీ రావణుడె కాని కను సుగ్రీవా! 263

వ. అని రాముండు పలుక విని వానరేంద్రుడగ్గు సుగ్రీవుండు సౌహార్దముతో ఇట్లనియె. ఓ లోకనాథా! సుఖావహా ! ధర్మజ్ఞ ! నీవు ఇట్లు సమంజసముగా మాటలాడుటలోఁ జిత్రమేమున్నది. సత్యవంతుడవు సన్మార్గమున నుంటివి. నా యంతరాత్మకూడ ఈ విభీషణుని పరిశుద్ధునిగా నెఱుంగును.

అమమానమునుబట్టి నీ భావమును బట్టియు ఇతడు పరీక్షింపబడియె. కాన వేగ
ముగా నీతండు మాతోపాటు సమానుఁడగుఁగాక. మహాప్రాజ్ఞుండయిన విభీష
ణుఁడు మనకు సఖియగుగాక. వానరేశ్వరుఁడగు సుగ్రీవుని వాక్యమును విని
గరుత్మంతునితో నింద్రుడు వలె విభీషణునితో సుగ్రీవుఁడు వెడలి కలిసె. 264

ఇటు రాముం డభయంబు నీయ వినయంబెచ్చన్ భువిం జూచుచున్
పటువిజ్ఞుండు విభీషణుండు ముద మేపారన్ ధరన్ వ్రాలి యు
ద్భట భృత్యుల్ వెను వెంటరా నయముగా ధర్మాత్ముఁడై రాము ముం
దటఁ గాళ్ళంబడి వ్రాలుచున్ శరణమున్ బ్రార్థించి పల్కెన్ దగన్. 265

నేనో రావణభ్రాత నాతఁ డవమానింపంగ భూతాళి ర
క్షానిష్ఠుం డగునిన్నిటుల్ శరణుఁ జొచ్చన్ వచ్చియున్నాడఁ జూ
నేనాలంకను మిత్రులన్ ధనములన్ వేవీడితిన్, రాజ్యమున్
ప్రాణంబుల్ సుఖభోగముల్ భవ దధీనం బంచు వాక్రువ్వఁగన్. 266

విని సాంత్వోక్తుల నావిభీషణుని యుద్వేగంబుపోఁ గొట్టుచున్
కనులన్ గ్రోలెడునట్లు చూచి "మఱి యింకన్ నాకుఁ దత్త్వంబుగన్
దనుజానీక బలాబలంబులను యుక్తంబౌ గతిన్ జెప్పు" మం
చును సెవ్వారిని కష్టపెట్టని మహాశూరుండు రాముం డనన్. 267

మఱి యోచించి విభీషణుం డపుడు యిట్లెంచఁ జెప్పె నింకన్ ప్రజా
పతి తా నిడ్డవరంబుఁబట్టి యసుర వ్రాతాఖిలప్రాణికిన్
క్షితి గంధర్వసురాళి కెప్పుడుదశగ్రీవుం డవధ్యుండ యా
దితిజ భ్రాతయె కుంభకర్ణుఁ డిక మద్జ్యేష్ఠుండు నింద్రౌజుడున్. 26

తచ్చైన్యపతి ప్రహస్తాఖ్యుఁడు కైలాస
గిరి మాణిభద్రునిఁ దఱిమి పైచె
దత్పుతుం డింద్రజి ధనుసూనియు నభేద్య
కవచుఁడై మాయమై యవియు నరుల

అమహాపార్శ్వుఁడు నామహోదరుఁ డకం
పనుఁ డాజిలో లోకపాలసములు
కామరూపు లగు లంకాపురవాస దై
త్యులు పదికోట్ల వేల్ యోధవరులు

ప్రథిత దైత్యులను మహాత్మ రావణుండు
కలిసి లోకపాలుర గెల్చెఁ గదనమందు
అని విభీషణుఁడు వచింప నాలకించి
దృఢ పరాక్రముఁ డగు రాముఁ డిట్టులనియె. 269

"రావణు నేపరాక్రమములన్ వచియించితొ వాని బాగుగా
నీవిధి వింటి నీవలన నిప్డె సబాంధవు సప్రహస్తునిన్
రావణుఁ జంపి నిన్ను నీఁక రాజు నొనర్చెద సత్యమే సుమీ
రావణుఁడో రసాతలమొ బ్రహ్మజగంబునొ చొచ్చినన్ విడన్. 270

రావణు మిత్ర బాంధవ బలాన్వితునాజిని జంపకుండ నేఁ
బోవ నయోధ్యకున్ వినుము ముగ్గురు తమ్ములతోడ నొట్టె" యం
చీవిధి రాముఁడున్ బలుక నెవ్వరిఁ గష్టము పెట్టనట్టి యా
భూవరు పుత్రు ధార్మికుని మ్రొక్కి విభీషణుఁ డిట్లు వాకొనెన్. 271

ఇక నీరాక్షసులన్ వధించుకొఱకైయీలంకపై నెత్తి పో
నిక నా శక్తి కొలంది సాయపడెద న్సేనన్ బ్రవేశింతు నం
చున్ లంకేచ్ఛ విభీషణుం డనఁగ నప్డారాముఁడున్ మెచ్చి బి
గ్గ కవుంగింటను గ్రుచ్చి లక్ష్మణుని వక్కాణించె నీరీతిగన్. 272

ఇపుడే నేను ప్రసన్నుఁ డైతిఁ గనుకన్ స్వేష్టంబు తీర్పన్ సము
ద్రపు నీరంబుల నీవిభీషణుని శీఘ్రంబె స్వరాజ్యాభిషే
కపుఁ గార్యం బొనరింపు మంచనఁగ వేగంబోయి సౌమిత్రి సం
ద్రపునీటన్ స్వభిషేకమున్ జలుప హర్షంబొంది రావానరుల్. 273

అటుల హర్షించి రాముని నతిగఁ బొగడి
ధ్వనులు చేయు సుగ్రీవుఁడు హనుమ పిదప
ఆ విభీషణుఁ గని క్షోభ నందరాని
యంబుధిని దాటు టెట్లొకో యడిగి రపుడు. 274

ఆసముద్రము నఖిలసైన్యములతోడ
దాటు టదియెట్లొ యిప్పుడు తగు నుపాయ
మింక వచియింపు మనుచుఁ బ్రశ్నింపఁ జూచి
యా విభీషణుఁడెంతొ ధర్మాత్ముఁ డనియె. 275

"రాజు రాముఁ డిపుడు సముద్రమును జేరి
శరణుఁ జొచ్చుత మును నప్రతరముసైన *
వార్ధి సగరుచేఁ ద్రవ్వింపఁ బడియె, వార్ధి
ఘన మతియు రాము కార్యంబు గని యొనర్చు. 276

ఆవిభీషణుఁ డిందు సుగ్రీవుఁ డపుడు
రాము లక్ష్మణుఁ గాంచి యీలాగు పలుక
ధర్మశీలుఁడౌ రాముండు దాని మెచ్చి
నగుచు లక్ష్మణు సుగ్రీవు నయతఁ బలికె. 277

ఈవిభీషణు నాశయ మెంతొ నాకు
నిష్టమగు నీఁక సుగ్రీవు డెంతొ బుధుడు
ఈవొ మంత్రనిపుణుఁడవ యిపుడు మీకు
నేది రుచియించు నది వచియింపు డిపుడు. 278

* ప్రతరము = సులభముగా దాటరానిది; దీనికి భిన్నము అప్రతరము.

అనుచు రాముఁ డనఁగ వార లాత్మ నెంచి
ఈవిధిని సముదాచార మెనన్ఁ బలికి
రిపుకు నరవర ! రాఘవ ! యీవిభీష
ణోక్తి యేల నచ్చెను మాకు యుక్త మదియె. 279

ఇట్టి ఘోరసముద్రమం దెట్లొ సేతు
వమర బంధింపకుండ నీయుందఱమును
దాటు టెటు, శక్రుతో దేవతలును గూడ
లంకఁ జేరుట శక్య మేలాగుఁ గాదు. 280

శూరుఁ డగు విభీషణుఁడు నేపొరఁ జెప్పు
వాక్యము ప్రకార మొనరింప ఫలము గలుగు
బలముతోడను రావణపాలిత మగు
లంకఁ జొత్త మంబుధిని బ్రార్థనము చేయు" 281

అనుచు సుగ్రీవ హనుమంతు లనఁగ నపుడు
ఆలకించి రాముండు దర్భాసనమున
కూర్చుండి సంవేశనమే రచించె
వేదిపయి హుతాశనుఁ డట్లు విధివిధాన. 282

వ. అనంతరము సుగ్రీవునిచే నేర్పరఁచఁబడి సముద్రతీరమున విడిసి యున్న కపిసేనను జూచి శార్దూలుడను వీరుఁడు వెళ్లి యంతట వ్యాపించి యున్న గపిసేనలను గూర్చి రావణుని కిట్లు చెప్పె. 283

ఇదిగో ఋక్ష కపిప్రవాహ మిపుడే యీలంకగా వచ్చుచు
న్నది వీక్షింపు మగాధమై యమితమై నాకున్ ద్వితీయంపు వా
రిధియట్టుల్ గనిపించె నస్త్రవరము ల్చేఁదాల్చి యీజానకీ
పదమున్ జేరిరి రామలక్ష్మణు లిటన్ భ్రాతల్ మహాసేనతో. 284

జలధిన్ జేరియు రామలక్ష్మణులు తేజశ్శాలులై వచ్చి రీ
బలమెల్లన్ పదియోజనంబు లగు సర్వాకాశముం జుట్టి ది
క్కుల వ్యాపించెను దానినిన్ సరిగఁ గన్గో దూతలం బంపి వా
రలతో సామము దానభేదములు శీఘ్రంబే ప్రయోగింపుమీ.

అను శార్దూలుని వాక్యముల్ వినియు దైత్యాధీశుఁడై నట్టి రా
వణుఁడున్ గార్యము నిశ్చయించుకొని సువ్యగ్రుండయై యర్థవి
ద్ధునుఁడౌ నాశుకుతో వచించె నిక శీఘ్రం బేగి సుగ్రీవుతో
డను నీరీతిగ నామమాటలను పైశం బిట్ల వాక్రువ్వుమీ.

బలివిన్ ఋక్షరజస్సుతుండవు మహావంశ ప్రసూతుండ వె
ట్టులు నీకర్థ మనర్థముం గలుగ విట్టుల్ రాముకై రాఁగ, గ్రో
తులరాజా! మఱి నీవొ సోదరునితో తుల్యుండవున్ వేత్త వి
ట్టుల రాట్పుత్రుని భార్య గొంటి విట నెట్లున్ హాని నీకున్నదే.

ఇఁక సుగ్రీవ! మదీయ వాక్కు విని యిష్టే పొమ్ము కిష్కింధకున్
సకలాదిత్యులు నింద్రుఁజేరిన జయించన్ లేరు లంకాపురిన్
ఇఁక నీవానరు లా జయింతురని నీవేయేగి చెప్పంచనన్
శుకుఁ డంతన్ జని పక్షియై తెలిపె నచ్చో నెల్ల సుగ్రీవుతో.

అటులన్ రావణు వాక్కులం దెలుపఁగా నాదూత నావానరుల్
అటకాయించి గ్రహించి వేగ దునుమన్ యత్నించి గుప్పిళ్ళతో
నిటులట్టుల్ ప్రహరింప దైత్యుఁ డిలయందే కూలి వాక్రుచ్చె నిం
దిటు దూతన్ బ్రహరించు వానరుల వారింపందగున్ రాఘవా!

ఎవ డీస్వామి వచింప కున్న మతమేమీ చెప్పకుండన్ స్వకీ
య వచస్సుల్ వినిపించి స్వీయమతమే వ్యాఖ్యానముం జేయుచు
ని, వధింపందగు నంచనన్ శక్రుని వీనిన్ గొట్టకుం డంచు రా
ఘవుఁ డాడన్ విని వాడు పైకెగిరి వక్కాణించె సుగ్రీవుతో.

వ. "ఓసుగ్రీవా! సత్త్వసంపన్నా: మహాబలపరాక్రమా! నేను లోక రావణుఁ డగు రావణుతో నేమి చెప్ప ముందువు" అనఁగా వానరశ్రేష్ఠుం డగు నాసుగ్రీవుఁడు మహాసత్త్వముతో నిట్లు వచియించె నీవు నాకు స్నేహితుఁడవు కావు దయనీయుఁడవును గావు. ఉపకర్తవును గావు. నాకు నీవు అప్రియుఁడవు రామునికి శత్రుఁడవు. బంధుమిత్ర సహితముగా వాలివలె వధార్హుడవు. నిన్ను సుతబంధు జ్ఞాతి సహితముగా వధించి లంక నంతను సైన్యములతోపాటుశీఘ్ర ముగా బూడిద చేసి పైచెద. 291

అమరుల్ శక్రునితోడ వచ్చి కడు హెచ్చుమ్మైన నాదిత్యలో
కముఁ బాతాళముఁ జొచ్చినప్పటికి లోకాల్ మూట గంధర్వ భూ
తములన్ దైత్యుల నీమరక్షకుని జెంతంగాన; నావృద్ధున
క్షముఁడౌ వాని జటాయువున్ దునుమి మూర్ఖా! శక్తి జాటించితే. 292

రాము నెదుటఁగాని మఱి
సౌమిత్రి దరిఁ జనకజ విశాలాక్షిని నీ
వేమి యపహరించితివే
యీమెను గొన నేది యగునో యీ వెఱుఁగుదువే. 293

సురలకు నైనను నెమరిం
పరాని ఘనబలు మహాత్ముఁ ద్వత్ప్రాణములన్
హరించు రఘుకుల పుంగవు
సురుభిరు రాముని నెఱుఁగవని సుగ్రీవుఁడనన్ 294

అంగదుఁడు వాలి తనయుఁడు
చెంగట నిలిచి యనెఁ బరిశీలించిన నా
కుం గన్పడండు దూతగ
రంగు తిరుగఁ గూఢచారి రకముగఁ దోఁచున్. 295

ఇటనే యుండి యితండును
పటు వగు మనసేనఁ గూర్చి బాగుగ నెఱిఁగెన్
చటకున నితని గ్రహియించియు
నిటనుండి యు లంక కేగ నీకుఁడు వినుండీ. 296

అని రాజు నాజ్ఞ యీయఁగఁ
కని పై కెగిరి కపులతో నిగ్రహించిరి చే
కొని కట్టి యేడ్చుచున్నను
అనాథువలెఁ గనియుఁ గొట్టి రంతట శుకునిన్. 297

శుకుఁ డై తే చండులగు కపు
లిఁకఁబీ డింపంగ రాము వీక్షించి కడున్
వికలుఁ డయి యేడ్చెను నా
సకలాంగము తెక్కలు మరి చక్షులు వగులున్. 298

ఏ రాత్రిఁ జత్తునో మఱి
యీరాత్రిని జన్మఁగాంతు నీలోఁగా నేఁ
గూర్చిన పాప మంతయు
జారియు నిన్నొందు నేను చనిపోయినచో 299

ఆ యేడ్పు నెల్ల తా విని
యాయెడ రాముండు వాని నాప్లవగులతో
పోయి విడుఁడి యీ దూతను
ఈయెద మభమవుత మని వచించెను నపుడే. 300

వ. పిదప సముద్ర తీరముఁన దర్భలు పఱచి కొని ప్రాంజలి యయి
తూర్పు మొగమై రాముండు అంతట 301

మును పైడి భూషల భూషితంబయి యుండి
పాము పడగను బోలివఱలు చుండి

వర హైమ కేయూర సరస ముక్తాంచిత
* స్త్రీ భుజాల్ బహుధా స్పృశింపఁ దనరి

బాల సూర్యుల వంటి వరచంద నాగురుల్
మును పూయ దాపీనఁ బొలుపు మీరి

మును సెజ్జ జానకి తనశిర సిడ మీఱి
తక్షకు పడగటుల్ తనరు చుండి

గాంగ జలములు తడువ సఖాళి మెచ్చ
రణముల గదఁబోలి రిపుల వనటఁ గూర్చి
అఖిల జగములూను జ్యాకిణాఢ్య మగుచు
గ్రాలు కుడి బాహువు తలాడగాఁ బరుండె. 202

అటులన్ గోవులు వేలొసంగు కుడిదౌ హస్తంబుపైఁ బండి యొ
ప్పుట నాకున్మరణంబొ యబ్ధితరణంబో సిద్ధమౌ నంచు న
చ్చట రాముండు ప్రతిజ్ఞబట్టి యుపవాసంబుల్ త్రిరాత్రంబులన్
బటు దీక్షన్ ప్రతిరై పరుండి గడపెన్ వార్ధి న్నుపాసించుచున్. 203

ఇటులైనన్ జడుఁడైన సాగరుఁడు సెంతే దీక్షలన్ బూని య
చ్చట రాముండు యథావ్రతన్ గొలిచినన్ స్వాకారముంజూపఁ డం
తటఁ గ్రుద్ధుండయి భద్రలక్షణము లందాలీను నాలక్ష్మణున్
త్రుటిలోఁ బిల్చియు రాముఁడిట్లు పలికెన్ దూర్ణంబ రక్తాక్షుఁడై. 204

---

* స్త్రీభుజాలు = కౌసల్య, సీత ద్దాసీజన భుజాలు.

వ. ఇట్లు మన ముపాసించినను జూడు సముద్రుని గర్వము ఇతఁడుతన స్వరూపమింకను చూపకున్నాఁడు. 205

గుణముల గుర్తించని యవ
గుణులంద క్రోధ మోర్పు గురుతా ఋజుతల్
అనయము ప్రియ వాదిత్వము
నను నీసుజనుల గణముల నసమర్థములౌ. 206

తనుదాఁ బొగడు కొనెడు వా
నిని నిర్దయునిని దుష్టునికను నిరతమ్ము పలా
యన మొనరించు జను విచ
క్షణ విడి శిక్షించువాని జగమిది మెచ్చున్. 207

సామమునఁ గీర్తి కలుగదు
సామమునఁ బ్రసిద్ధికాదు సంగ్రామములో
సౌమిత్రి ! విజయంబది
సామమున లభింపదు సుమి జగతీ తలిలో 208

నా యంపతతిఁ జిచ్చి తోయాలఁదేలిన
మొసళులతో వార్ధి ముంచివైతు
ఘన కాయములు గల్గు గజరూప మత్స్యాల
సర్పాల వధియించి జలధిఁ బఱతు
శంఖాల శుక్తుల సర్పాల మొసళుల
నిండిన సంద్ర మెండించి వైతు
ఇటువంటి వారిపై నెంతొ యోర్పును దాల్చ
నను నసమర్థుఁగా నబ్ధి తలచు

వనధి సామచేఁ దనరూపు గనఁ బఱచదు
లక్ష్మణ ! ధనుస్సు నహిసమాస్త్రములఁ దెమ్ము
జలధి నెండింతుఁ గాళ్ళఁ జనుతఁ గపులు
క్షోభ యిడరాని జలధికి క్షోభ యిడుదు. 309

వ. అని పలికి రాముండు

తట మర్యాదను మీఱకున్న విచల త్కల్లోల పాథోధి నిం
తట మర్యాదను మీఱఁ జేతు శరముల్ గట్టించి యంచున్ హుటా
హుటివింటిన్ ధరియించి క్రోధమున నెంతో కన్ను లుగ్రంబ యు
ద్భటతన్ విప్పి యుగాంత వహ్నియటు దుర్ధర్షుండయై మండెడిన్ 310

ఘన ఘోరంబగు విల్లు గుప్పిటను వేగం బట్టి బాణాల ధా
త్రిని గంపింపఁగఁ జేసివజ్రములతో దేవేంద్రుఁడుం బోలెఁ గ్ర
న్నన నుగ్రంబగు నస్త్రముల్ వఱపి సంద్రం బెల్లెడన్ మీఱి యుం
డును సత్త్వంబులు భీతి చెందు నటులన్ దూర్ణంబ చేసెన్ గడున్. 311

కెరటంబుల్ కడు హెచ్చె సర్పములు సల్లోవన్ వెతన్బాఱె భీ
కర నక్రంబులు భీతిచెందెఁ గడు శంఖశ్రేణి శుక్తుల్ పయిన్
దిరిగెన్, ధూమము గ్రమ్మె వాతములు వ్యాప్తింజెందెఁ బాతాళ సం
చర దుర్గాసురు లెల్ల నోర్లు కను లెచ్చన్ జూచి రత్యంతమున్. 312

తరగల్ మందర వింధ్య శైలములటుల్ తద్వార్ధి మధ్యంబునన్
పెరుగన్ ఘూర్ణిలె దద్దరిల్లు నహులున్ విభ్రాంతిచే నెల్లెడన్
చరియింపన్ మొసళుల్ భ్రమియింపఁ గని యాసౌమిత్రి గర్జించు భీ
కరు రామున్ వలదింక వల్దనుచు వేగంబట్టెఁ దచ్చాపమున్. 313

వ. తరువాత రఘువంశ శ్రేష్ఠుడగు రాముఁడు సముద్రునితో దారుణ ముగా నిట్లనియె. ఓసముద్రా ! నిన్నిదే ఎండింప జేయుదును. సాగరా !

నాబాణములు నీనీరముల నెండింప నీలోని సత్త్వములు శోషింపఎండిపోయిన నీలోనుండి ధూళిపైకెగురు నట్లు చేయఁగలను. చూడుము. ఇదిగో ఇపు డీవానరులు నాధనుస్సు నుండి విడిన బాణవర్షముతో కాలినడకతోనే వెళ్ళెదరు. నాపౌరుషముగాని నావిక్రమమునుగాని అవి ఎట్టిదో ఆలోచించి యైనఁ దెలిసికొన లేవు. నావలనఁ గలుగు భావి సంతాపమునుగాని ఎఱుగవు. అనిరాముఁడు పలికి బ్రహ్మాస్త్రముతోడ బ్రహ్మాండ సమమైన శరము తొడిగి శ్రేష్ఠమగు ధనుస్సును సారించె అప్పుడు. 314

పృధివియు దివియును వ్రీలిన ట్లయ్యెను
నెల్ల శైలములు కంపించిపోయె
తమసు లోకముఁ గప్పెఁ దనరవు దిక్కులు
వేగఁ జెర్వులు నదుల్ వెసఁ గలంగె
చంద్రసూర్యులను నక్షత్రములడ్డెను
తిరుగు సూర్యాంశుల నిరులు గప్పె
వంద లుల్కలు పడె పడి మింటఁ బిడుగులు
మబ్బులు స్ఫురియించె మరుతు లడరె.

గిరిశిఖరముల వ్రీల్చుచుఁ దిరిగెగాలి
అతిగ మబ్బులు విద్యుదగ్ను లడరె
దృశ్యము లదృశ్యభూతము లెంతొ మొరసె
భూతములు భీతి వడఁగుచు భువిఁ జరించె. 315

పెనుకల్లోలములన్ భుజంగములతోఁ బెన్దైత్య సంఘాలతో
ఘనవేగంబున నబ్ధి కూడి లయపుం గాలంబు కాకుండ వే
లను నొక్కామడ దాటె రాముఁడు శరాలన్ వీడెఁదో
యనిధిన్ మధ్య సముద్రుఁడున్ వెడలె మేర్వద్రిన్ మహార్కుం డటుల్. 316

నునుపు వైఢూర్యమోయన నొప్పి పైడి భూ
షలు రక్తమాల్య వస్త్రములు దాల్చి
పద్మ పత్రంబులవంటి కన్నులు మీఱ
సర్వ పుష్పమయ స్రజము ధరించి
తనయందె పుట్టిన మణులెన్నొ పొదిగిన
పసిఁడి భూషణములు దిశలు వెలుఁగ
మహిత ధాతుల వెల్గు మంచుకొండను బోలి
తరఁగ లడర మబ్బు మరుతు లడర

పెడఁదఱొమ్మునఁ గౌస్తుభ విశదమైన
* తరళ మేకావళీ మధ్యఁ దనరుచుండ
గ్రాహములు పాఱ నురగ రాక్షసులు వెఱవ
రామ! యని సముద్రుఁడు మ్రొక్కి రయమ పలికె. 317

జలము భూమి వాయువు నాకసంబు జ్యోతి
శాశ్వతముగ స్వభావాన సౌమ్య! నిలుచు
ఈ యగాధత యలంఘనీయ గుణము
నా స్వభావము, గాధత నాకు వికృతి 318

కామమును లోభమును భీతిగనియు నేను
గ్రాహ మకరాకుల జలంబుఁ గట్టివేయ
నెట్టులైన సేతున సేన లేగవలయు
కపులు నేగుటకు సేతుఁ గట్టు మయ్య. 319

---

* తరళము=హారము మధ్య మణి. ఏకావళి=ఒంటి పేట ముత్యాలహారము.

అపుడు రాముఁడనె సముద్ర ! యస్త్రమీది అ
మోఘ మందుచే దీని నే భువిని విడుదు
అన నుదీచిగ ద్రుమకుల్య మనెడి పుణ్య
భూమిగల దందు నుగ్రకర్ములు గలారు. 320

వారు దొంగలాభీరాది పాపమతులు
వారి సంస్పర్శ సహియింప. వారి పైని
నీ యమోఘాస్త్రము నిపుడు వేయు మనుచు
నా సముద్రుఁడనఁగ రాము డట్లవేసె. 321

శరమున్ వజ్రమువోలె నుండిపడు దేశంబద్ది లోకంబు లో
నురు కాంతార మనన్ ప్రసిద్ధి గనియెం బాణంబు పడ్డట్టి యా
ధర శల్యంబునఁ బీడిత వ్రణత రంధ్రం బేర్పడంగాఁ దద్వ్రిణో
పరి దేశంబునఁ బైడి నీరు వెడలెం బాతాళ మందుండియున్. 322

వ్రణకూపం బను పేర నానది కడుం బ్రఖ్యాతమై యుండి పై
కిని నీళ్ళంబుధి నుండి లేచె నటఁ గుక్షిన్ నీటి నెండింపఁ జే
సెను నాబాణము, నట్లుచేసి వరమిచ్చెన్ దుష్టులే లేనటుల్
ఘనమై జంతుల కిష్టమై యటు లరోగం బయ్యె నాదేశమున్ 323

రాముని వరాన నా మరుభూమి మిగుల
అధిక సుక్షీరమై వివిధౌషధంబు
లయి సుగంధియై బహుగుణాఢ్యము శుభంబు
సుపథమై యయ్యె; నిక వార్ధి యపుడు పలికె. 324

నలు డన్వీడిటు విశ్వకర్మకొడుకెన్నండైన శ్రీమంతుడై
యిల నాతండ్రి వరంబు నీయనిఁక నెందే విశ్వకర్మాభుఁడై
పెలసెన్ వీడిపుడిందు సేతువు నిఁకన్ వేగట్టు సోత్సాహుడై.
యెలమిన్ దానిని నేను దాల్తు నిత డెంతేఁ దండ్రినిన్ బోలుఁగా. 325

అని యా సాగరు డిట్లు చెప్పి స్రుతి మాయుం బయ్యె నింకన్ లఃం
డనఘుం డుద్భటుఁ డిట్లు రాముఁగని మాటాడెన్; మహావార్ధి సే
తును బంధించెద నాదుతండ్రి జలిమిన్, ముఖ్యంబుగా వార్ధి చె
ప్పెను సత్యంబె; జగాన దండ మొకటీ వేగన్ ఫలించున్ గదా. 326

సుమతుల్ కాని జనంబులందు క్షమ యెచ్చో వ్యర్థమే, దానసా
మము లేవీ పనిచేయు, వీజలధి భీమం బయ్యు నివ్వేళ దం
డమువల్లన్ భయ మొంది రామునికి స్థానంబిచ్చె, పుత్రుండు మ
త్సముఁడౌ నీకని విశ్వకర్మ యనె మాతన్ మందరాద్రిన్ దమిన్. 327

నేను విశ్వకర్మగనిన సూనుఁడవుదు
నేను విశ్వకర్మసముఁడ నీపయోధి
పలుకుచే గుర్తువచ్చె నీజలధి సత్య
మనియె నడుగక నాగుణాలను వచింప. 328

వనధిన్ సేతువు గట్టజాలుదును క్షిప్రంబె కపుల్ వార్ధిసే
తును బంధింతురు గాకయంచు నలుఁడున్ తూర్ణంబు వాక్రువ్వ రా
ముని యాజ్ఞన్ గపియూధపుల్ ఘనవనంబుల్‌చేరి వేల్వేలుగా
మనసానందముపొంద పల్‌తరువులం భగ్నంబు గావింతురున్. 329

అటులాసంభ్రమము చెంతకున్ కపులు సాలాశోక చూతార్జునో
త్కట వంశాదుల సశ్వకర్ణ విలసత్ ఖర్జూర సంపుష్పితో
త్కట బిల్వంబులఁ గర్ణికారములఁ దత్తద్వృక్ష వారంబులన్
పటుశక్తిన్ వడిఁదెచ్చి నింపిరి కడున్ బాధోధియందంతటన్. 330

మొదలులతోఁగొన్ని మొదలులేనివి కొన్ని
యింద్రకేతుల నటులెత్తినారు

తాళవిభీతక దాడిమ గుల్మాలు
నారికేళ వరకుళాల్ పడనయిచిరి

జలముపై కెగురంగఁ జదలు తాకెడునట్లు
వేగఁ గొండలనెత్తి విసరినారు

పటుబలు లేన్గులంతటి లాతిబండల
శైలాలు పీకి యంత్రాలనిడిరి.

సంభ్రమముఁ గలంచి వానరుల్ సకలగతుల
వందయామడ పొడుగౌచు వరలియున్న
త్రాళ్ళఁ గొందఱు పట్టిలాగి రపుడు
కపులు సాయపడగ సేతుఁగట్ట నలుడు.

కొందరు దండాలఁగూడఁ బట్టుకొనిరి
మరికొందఱు పల్ఱాళ్ళఁ బఱచినారు

కొందఱు మబ్బుఁబోల్ కొండల శిఖరముల్
తృణకాష్ఠ సుమతరుల్ తీర్చినారు

కొందఱు గిరిఁబోలు కొండఱాళ్ళను దెచ్చి
కరులట్లు నరువెత్తి పఱచినారు

కొందఱుద్రుమల ఱాళ్ళను గూర్చి విసరనంత
వార్ధిన్ మహాఘోష వఱలఁగట్టి

రాది దినమునఁ బదునాలు గామడలను
అటు ద్వితీయాహ్నమున నిర్వదామడలను
ఇర్వదొకటె మూడవ దినాన; నిరునిరువదియు
నాల్గవ దినాన; నైదవనాడు కడమ.

నలుఁ డానేర్పరి విశ్వకర్మ సుతుఁడంతన్ దంర్డియుం బోలెఁ బెన్
జలరాశిన్ పడిఁగట్ట సేతువు దివిన్ స్వాతీపథం బట్లు మం
గళమై శ్రీయుతమై వెలుంగగ ఋషుల్ గంధర్వులున్ సిద్ధ దే
వులు నాయద్భుత కార్యమున్ గన దివంబున్ జేరి రీక్షింపగా.

వడి గంధర్వులు దేవులున్ నలుడటుల్ బంధింప నూఱామడల్
పొడుగౌ మన్ బదియామడల్ వెడలుపై పొల్పారు నా సేతునన్
కడుఁబల్ దుష్కర కర్మఁ జూచిరవలన్ గన్గొంచు కేరింతలన్
ఒడుచున్ లేచుచు గంతులేసి కపులున్ గర్జించి రుప్పొంగుచున్. 324

సయిపన్ రాక యచింత్య మద్భుతముపై ఝల్లంచు మైఁబొంగ న
ట్టి యెడన్ భూతములెల్ల సేతువును నట్లే చూచుచున్ నిల్వ నెం
తయొ ప్రీతింగని వేలుకోట్లు కపులుత్సాహానఁ దేజస్వులై
ర సుమున్ మీఱఁగ సేతుఁ గట్టుచునె పారం బేగిరాయబ్ధికిన్ 325

అట శ్రీమంతముగా విశాలముగఁ బెంపారంగ నంతన్ హుటా
హుటి నిర్మించిన సేతు వొప్పె జలధిన్ యోగ్యంపు సీమంత మ
ట్లటు, లంతన్ గదతో విభీషణుఁడు నత్యంతంబు జాగ్రత్తగా
నటు శత్రూద్ధతిఁ గూల్ప నిల్చెను నమాత్య శ్రేణితో పాటుగన్. 326

ఇటు సుగ్రీవుడు సత్య విక్రముఁడై యై యేపారు నారాముతో
నట వాక్రుచ్చెను నీవు వాయుసుతు మే, నాలక్ష్మణుం డంగదున్
ఎటుమౌ రీతిగ నెక్కుఁ డీజలధికిన్ పారంబు గన్పింప దిం
కిటు మింటన్ జనుఁడిప్డు మిమ్ములను వీరే వేగ దాటింత్తు సూ. 327

ఇక ధర్మాత్ముఁడ యైన రాముఁ డనుజుం డేతేర సుగ్రీవుతో
సకలానీకము ముందుపైపు నడచెన్ జాపంబు చేఁబూనుచున్
ఇక వేరొక్కరు మధ్యఁబ్రక్కఁ జనినారింకొక్క రానీళ్ళ లో
నికి వేదూకిరి కొంద ఱన్యపథులందే యేగి నారత్తతిన్ 328

కొండఱు మింటి మార్గములఁ గొంకక దూకిరి పక్షిరాజటుల్
అందరుపెట్టు ఘోషముల నంబుధి ఘోషమె యంతరించె వా
రందఱు నేగుచుండ నిఖిలాంబుధి కన్పడకుండ మాయు మ
య్యెం దుద కానమస్త బలమిట్టె చనెన్ నలు సేతు మీదుగా. 329

విమలంబౌ రవియందు నీలిమయుఁ గన్పించెన్ లక్ష్మణా ! చూడు మం
దె మహాధూళియు తారకావళులు నెంతేఁ గ్రమ్మె, నందే యుగాం
తము నందట్లుల చిహ్నముల్ వఱలె గ్రద్దలున్ కాకులున్ డేగలున్
క్షమ గ్రిందన్ భ్రమియించె నక్కలరిచెన్ సర్వం బభద్రంబయో. 245

కపులున్ దైత్యులు చిమ్మినట్టి గిరులన్ ఖడ్గాల శూలంబులన్
విపులంబౌ భువి యెల్ల నావృతమయై భీతి ప్రదం బౌచు ర
క్తపు మాంసంబుల తోడుతన్ బురదయై కన్పించు దుర్ధర్షయై
యిపుడే రావణు డేలు లంక కెదురై యీసేనతోఁ బోదమా

అని ధర్మాత్ముఁడు ధన్వి రాముఁడని యుద్ధావిష్టుడై పోయి వెం
టనె లంకాభిముఖంబుగా నరుగుచుండన్ జూచి వేగన్ విభీ
షణ సుగ్రీవులు వానరేంద్రులు జయస్వానాల గర్జించుచున్
ఘనులౌ శత్రుల జంప బైల్వెడల హర్షంబొందె రాముండెదన్. 346

అపుడు రాముఁడు తీర్చిన యఖిల బలము
శరదృతువున నక్షత్ర సుందరమ యైన
రాత్రి పూర్ణేందుచే బలె రమ్యమగుచు
సకల కళల తోడను నిండి చాల నొప్పె. 347

జలధింబోలె నపారమై తగిన యాసైన్యాలఁ బీడింపఁగా
బడి విశ్వంభర భీతి నెంతయును గంపంబొందె నంతం గపుల్
కడు లంకాపురిఁజేరి భేరి నాదము మృదంగాల శబ్దంబు ల
ప్పుడె యాలించి శరీరముల్ పులకరింపుల్ పొంద గర్జింత్రటన్. 348

కపి యూథంబుల గర్జనల్ విని కడున్ గాత్రంబు లుప్పొంగ వా
రపు డవ్వానిని మించయున్ నయిప కత్యంతంబు గర్జించి యు
గ్రపు ఘోషల్ పొనరింప రాక్షసులు గర్జారావముల్ మింటి యం
దపురూపం బగు మేఘ ఘోషములయు ట్లాలించి రత్యంతమున్. 349

విమలంబౌ రవియందు నీలిమయుఁ గన్పించెన్ లక్ష్మణా! చూడు మం
దె మహాధూళియు తారకావళులు నెంతేఁ గ్రమ్మె, సందే యుగాం
తము నందట్టులు చిహ్నముల్ వఱలె గ్రద్దలున్ కాకులున్ డేగలున్
క్షమ క్రిందన్ భ్రమియించె నక్కలరిచెన్ సర్వం బభద్రంబెయా. 345

కపులున్ దైత్యులు చిమ్మినట్టి గిరులన్ ఖడ్గాల శూలంబులన్
విపులంబౌ భువి యెల్ల నావృతమయై భీతి ప్రదం బౌచు ర
క్తపు మాంసంబుల తోడుతన్ బురదయై కన్పించు దుర్ధర్షయై
యిపుడే రావణు డేలు లంక కెదురై యీసేనతోఁ బోదమా

అని ధర్మాత్ముఁడు ధన్వి రాముఁడని యుద్ధావిష్టుడై పోయి వెం
టనె లంకాభిముఖంబుగా నరుగుచుండన్ జూచి వేగన్ విభీ
షణ సుగ్రీవులు వానరేంద్రులు జయస్వానాల గర్జించుచున్
ఘనులౌ శత్రుల జంప బైల్వెడల హర్షంబొందె రాముండెదన్. 346

అపుడు రాముఁడు తీర్చిన యఖిల బలము
శరదృతువున నక్షత్ర సుందరమ యైన
రాత్రి పూర్ణేందుచే బలె రమ్యమగుచు
సకల కళల తోడను నిండి చాల నొప్పె. 347

జడధింబోలె నపారమై తగిన యాసైన్యాలఁ బీడింపఁగా
బడి విశ్వంభర భీతి నెంతయును గంపంబొందె సంతం గపుల్
కడు లంకాపురిఁజేరి భేరి నాదము మృదంగాల శబ్దంబు ల
ప్పుడె యాలించి శరీరముల్ పులకరింపుల్ పొంద గర్జింత్రటన్. 348

కపి యూథంబుల గర్జనల్ విని కడున్ గాత్రంబు లుప్పొంగ వా
రపు దవ్వానిని సుంతయున్ సయిప కత్యంతంబు గర్జించి యు
గ్రపు ఘోషల్ పొనరింప రాక్షసులు గర్జారావముల్ మింటి యం
దపురూపం బగు మేఘ ఘోషములను ట్లాలించి రత్యంతమున్. 349

రకరకమౌ పతాకముల లంకను రాముఁడు చూచి లోన జా
నకిఁ దలపోసి పల్కె" హరిణార్భక నేత్ర కుజగ్రహంబుచే
నకలుష రోహిణింబలె దురాత్ముఁడు రావణుచే నిరుద్ధయౌ
నకట ! యటంచు నున్న దని యిప్పుడ యూరిచి భ్రాతతో నసెన్. ౨౬౦

విశ్వకర్మ మదిచేఁ బృథ్వీధ రాగ్రాన
నమరిచి నటు మింట నంటె లంక

శ్వేతాభ్రము లలము విష్ణుపదము మిన్ను
వలె బహుసౌధాల వెలిగె లంక

చైత్రరథమువంటి స్వచ్ఛ పుల్లవనాల
వివిధ పక్షిరుతాల వెలసె లంక

మత్త విహంగాల మధులుబ్ధ మధుపాలఁ
గోకిలకులములఁ గొలిచె లంక

అన్నిటిని గాలి కదపుచు నలరె లంక
అనుచు రాముఁడు లక్ష్మణు నరసి పలికి
నీతి శాస్త్ర విజ్ఞానపు నియతి చేత
సేనలను పన్ని రాముండు శాసించె నిట్లు. ౬౫

దుర్జయుఁ డగునంగదుఁడు నీలుతోఁ గూడి
సేనమధ్యగ నుండి పూనుఁ గాక

ఋషభుండు సోదరఋషభుండు కపిసేనఁ
గలిసి దక్షిణముగఁ గాచుఁగాక

గంధ గజమువోలె గంధమాదనుఁడు దు
ర్ధరుఁడు సెడమ పార్శ్వముగఁ జనుత

వేగదర్శి సుషేణ ప్రభు జాంబవంతులు
దక్షులై కుక్షిసంరక్షు లవుత

కపుల సేనకు వెనుకగఁ గపి విభుండు
నరుణుఁ డటు తేజమున రక్ష వరలి గనుత
నేను లక్ష్మణుతోఁ గూడి సేనయందు
శిరసు భాగాన నిలిచి రక్షించుచుందు. 352

వ. అని పలికి రాముండు సేనను మహావ్యూహములుగా నేర్పరుప అది వానరవరులచే రక్షితమై మేఘ సంచారములు గల యాకాశమువలెఁ బ్రకాశించె. అంత వానరులు గిరిశృంగములను మహావృక్షములను గ్రహించి లంకను మర్దించు కోరికతో నుండిరి. శిఖరములచేత గుప్పిళ్ళచేతను ఈ లంకనుగొట్టెద మని యావానరులు మనస్సున నిశ్చయించుకొనిరి. అపుడు మహాతేజుఁడగు రాముఁడు సైన్యములు సరిగ వ్యూహములుగఁ దీర్చబడినవి ఇంక ఈ శుకుని విడిచిపెట్టుడు అని యాసుగ్రీవునితోఁ జెప్పఁగా నపుడు ఆ మహాబలుడగు సుగ్రీవుడు దూతయగు నాశుకుని విడిచిపెట్టెను. అంత నాశుకుడు రాము మాటలకు సంతోషించి వానరులచే బీడింపఁబడినవాడైఁ యెక్కువగాభయపడి రాక్షస రాజుదరికేగ అపుడు రావణుఁడు ప్రహసించువాడువలెనయి శుకునితో నిట్లనె.3 3

నినుబంధించిర యేమి ఱెక్కలివి ఛిన్నీభూతమైనట్టులన్
గనిపించున్ చపల స్వభావులకుఁ జిక్కన్ లేదుగా నీవటన్
అని యా రావణుడాడ భీతిలుచు నత్యంతంబు సంభ్రాంతుడై
యనె నీరీతి శుకుండు రావణునితో నాత్మీయ వృత్తాంతమున్. ;54

ఏ నాసంద్రము నుత్తరంపుఁదటి కక్షే పోయి సుగ్రీవుతో
న్వోనిన్ కష్టము పెట్ట నట్టిదగు సందేశంబు నీమాట సాం
త్వానన్ మెత్తగ బోధచే ననునయింపన్ జేసితింగాని వా
రో నన్నున్ గనినంతనే యెగిరి సంక్రుద్ధాత్ములై రంతటన్. 353

నను బంధించియుఁ గొట్టిసాగిరి కడున్ వైళంబు గుప్పిళ్ళతో
దునుమం జొచ్చిరి నేనుచెప్పుటకె యెందున్ సావకాశంబుఁ గో
పనులౌ వానరు లీయరైరి, యెటు సంప్రశ్నానికిన్ వీలగున్
మును వేగంబ విరాధునిన్ ఖరుఁ గబంధున్ జంపు రాముడో. [illegible]

సీత పదంబు చేరె నిఁక శీఘ్రమె యబ్ధిని సేతుఁ గట్టి వా
డీతరి వార్ధి దాటి దనుజేంద్రుల మూలకుఁ ద్రోచివైచుచు
న్జైత ధనుస్సు దాల్చి గిరినీర్దద తుల్య కపీంద్ర ఋక్ష సే
నాతతి వేనవేల్ గొని యనంతముగా భువిఁ గప్పివైచెఁగా. [illegible]

దైత్య దేవులకువలె నీదైత్యులకును
కపి బలంబులకును సంధి కాద యెపుడు
వారు ప్రాకారమును జేరు వార లింక
కనుక సీత నిచ్చుటొ లేక రణమొ చేయు. [illegible]

శుకు నుడులు విని రావణాసురుఁడు మండి
యెఱ్ఱవడు కండ్ల దహియింప నిట్లు పలికె
దేవ గంధర్వ దైత్యు లెదిర్చి నవ్వ
టికిని నేకష్టమైన జానకిని విడువ. [illegible]

విడుచు చెట్టున భ్రమరాలు పడెడునట్లు
ఎపుడు నాబాణములు రాముని పయి పడునొ
అపుడె వింట వెల్వడి వెలుగు నమ్ములేసి
కరిని నుల్కలచేఁ బోలె నరిని గాల్చు. [illegible]

గొప్ప వైన బలంబులఁ గూడి నేను
వానిబలము తిరస్కరింపంగఁ గలను
ఉదిత సూర్యుఁడు సకలమౌ జ్యోతిసులను
క్రమ్మి వాని వెలుంగులఁ గ్రమ్మునటులు.

మెండు విషమున్న యహినట్లు మండుచున్న
నాశరముల నాజి గనక నన్ను లేపు
వజ్రములవంటి పందల బాణములను
విసరి యుల్కలన్ గరినట్లు వెస దహించు. 363

అబ్ధిఁ బోలు నాపడి గాలి యట్టి గతియు
యెఱుఁగఁ డిది రాము, డాట నన్నెదుర వచ్చు
మెండు విషమున్న యహులట్లు మండుచున్న
నాశరముల నాజిఁ గవక నచ్చు నెదురు. 364

* శర సుకోణాల వాయించి జ్యాస్వనంబు
గలుగ శత్రువాహినుల రంగంబు జొచ్చి
శరలము ధ్వనిగలుగ త్రస్త జన నాద
ముగు ధనుర్వీణ వాయింతు నసిని మిగుల. 365

వేల కనులున్న యింద్రుడేన్ వేగ వరుణుఁ
డేని నన్నెదురు కొనలే రిది నిజంబు
పోర నా బలమును ముఖ్యులైన
యమ కుబేరులు నెదిరించి యమరఁ గలరె. 366

దశరథ సుత రాముఁడు సముద్రమును దాటె
ననుచు శ్రీమంతుఁడైన రావణుఁడు శ్రద్ధ
నాలకించి యంతట నమాత్యాగ్ర్యులైన
* శుకుని సారణుఁ డిన్నగాఁ జూచి యనియె. 367

---

* కోణము = వీణ పలె నుండు గోటును వాయించు దండము. రంగము = యుద్ధరంగము, నృత్యరంగము.

* ఈ శుకుడు వెనుకఁ బంపఁబడిన శుకునికంటె వేరుఅని వ్యాఖ్య.

దుస్తర సమస్త వార్ధిని తొరగ నిపుడె
కపి బలము దాటె ననువార్త కంటిరి గద
వనధి రాముఁడు సేతు బంధనము చేయు
టిది యభూతపూర్వం బైన కృత్యము సుడి. 368

వనధిన్ సేతువు గట్టుటెట్లును తలంపన్ నమ్మఁగాలేను నెం
దును నీవానరసేన తప్పకయె ముందున్ దెల్సికోఁ దగ్గదే
యని మీరల్ కపిసేనఁ జొచ్చి కడు నజ్ఞాతంబుగాఁ గాంచు డా
యనికిన్ తత్ప్రమాణమున్ బలము ముఖ్యుల్ వానరుల్ వేరలో. 369

ఈ విధిఁ బోయి రాముదరి నెవ్వరు మంత్రులో యెట్టివారు సు
గ్రీవుని కిష్టులో యెవరు కేవల మాజికి ముందు నిల్తురో
యేవిధి నబ్ధిసేతు వొనరించిరో యాకపివర్యు లూను సే
నా వివరంబు లెట్టివో కనందగు రాముని పూన్కి యెట్టిదో 370

రాముని వీర్యమాతని శరంబులు నెట్టివొ చూడఁగాదగున్
రాముని భ్రాత లక్ష్మణు బలంబును బాగుగఁ దెల్సికో వలెన్
ఆ మహాత్ము లైన ప్లవగాగ్ర్యుల సేన లెవండు నడ్పునో
ఈ మొదలైన సంగతి గ్రహించి యదార్థత, రండు వేగమే. 371

అని దైత్యేశ్వరుఁ డానతీయఁ ద్వరగా నావానరాకారమున్
గని దైత్యుల్ శుకసారణుల్ కపుల సైన్యంబున్ ప్రవేశించి యూ
హను గావింపఁగరాక పుల్కలిడు సైన్యంబున్ గణింపంగ లే
కను నట్లే గనుచుండి రాతఱిని వ్యగ్రంబైన భావంబుతో. 372

గిరిశృంగంబుల నిర్ఝరాల గుహలన్ క్రీడించుచున్ వేగ సా
గర తీరంబులఁ గాననో పవనులన్ గ్రావంబులన్ దాటి క్రు
మ్మరుచున్ దాటుచు దాటఁగోరుచును బల్మారెట్లొ నిల్పుండుచున్
స్థిరమక్షోభ్యమయై ధ్వనించు బలవార్ధిం గాంచి రాక్షసుల్. 373

వ. అంత మహాతేజుండయిన విభీషణుఁడు ప్రచ్ఛన్నులై యున్న యా శుక సారణులను పట్టుకొని రామునితో నిట్లనె "ఓ శత్రుపుర దమనా! వీరు రాక్షసేంద్రుని మంత్రులగు శుకసారణులు. గూఢచారులై లంకనుండి యిటకు వచ్చిరి" అని విభీషణుడు చెప్పగాఁ మిగులవ్యథతో రామునిజూచి తమ జీవితములమీఁది ఆశ వదలుకొని దోసిలొగ్గి భీతితో వారిట్లనిరి. ఓ రఘునందనా! సౌమ్య! మేమిద్దరము రావణుఁడు పంపఁగా నీ సర్వబల మెఱుఁగుటకై యిటకు వచ్చితిమి". 374

అని యిట్లు శుకసారణుల్ తెలుపగా నాలించి హాస్యంబు మె
ల్లనఁ గావించుచు సర్వభూతహితుఁ డారాముండు వాక్రుచ్చె సే
నను సర్వం బిటఁ జూచి నారలె మమున్ జక్కగ నీక్షించు ట
య్యెనె, మీరాజు వచించి నట్టి పని యయ్యెంగాదె పొందిచ్ఛమై. 375

ఎది యేన్ జూడని దున్నచో నదియు మీరీక్షింపఁగా వచ్చు నే
అదియుంగాక విభీషణుండు సకలం బందందుఁ జూపించు నీ
యదనన్ బద్ధుల నైతి మంచును భవత్ప్రాణాలకై కుందకుం
డెదలో! దూత లవధ్యు లస్త్రములవెన్నే నున్న, లేకుండినన్. 376

అడుగుచు శత్రులన్ దుమమనట్టిటు చూచెడి దైత్యచారులన్
వడిగ విభీషణా! వదలివైచు మటంచును జెప్పి వారితో
నుడివెను మీరు లంకకుఁ జనుండు వెసన్ జని దైత్యరాజు కి
ప్పుడిటుల నాకుమారుగఁ గ్రమోచిత వాక్కులఁ జెప్పు డిట్టులన్. 377

ఏబలమాశ్రయించి మదభీష్టను సీతను దొంగిలించితో
ఆ బలమున్ గనంబరపు మట్టులు కాద బలాప్త భృత్యులున్
రాఁ, బడు నాదుకాళ్ళపయి! రావణ! లేద సదుర్గ లంక నా
నీ బలమెల్లఁగూలిపడ నిప్పుడె జొంచెదు సుమ్మి శీఘ్రమే. 378

సురపతి రాక్షసావళులఁ జొచ్చియు వజ్రము వేసినట్టు లి
త్తరి వడి నీ బలంబువయి దారుణ కోపము రేవ ప్రొద్దుటన్
గరముగ జూపువాఁడ నిదె గాంచుడి యంచును రాముఁ డాడగం
ద్వరగ జయంబటంచు పభినందన చేసియుఁ బోయి యంతటన్. 379

రావణుతో వచించిరిటు రాక్షసరాజ ! విభీషణుండు నం
దే వధియింపఁ దగ్గమము నిట్టి గ్రహింపగఁ జూచి ధార్మికుం
డావర తేజు రామవిభుఁ డచ్చట నే విడిపించి పంపె వా
రావిధి నల్వురొక్క నుడె యాడుచు నుండిరి గొప్పవీరులై. 380

రావణ! విన్ము దాశరథి రాముడు భ్రాత, విభీషణుండు సు
గ్రీవుడు లోకపాలసములే యయి గొప్ప పరాక్రమంబుతో
నావిధి వచ్చి తోరణము లీపురి లంకను కోట గోడలన్
నేవిధి బీకి చిమ్మెదరు వీరులు వానరు లెల్ల తోడుగా. 381

వ. ఆ రాముని రూపము వంటివే యాతని యాయుధములును. అత డొక్కడే ఈ లంకను గూల్చగలడు. మిగిలిన ముగ్గురితోఁ బనిలేదు. రామలక్ష్మ ణులచేతను సుగ్రీవుని చేతను రక్షింప బడిన యా సేనను ఇంద్రునితో గూడిన దేవదానవులును ఎదుర్కొనలేరు. ఆ సైన్యమునూఱామడలు గల సాగరము నంతను నిండి దక్షిణ తీరము నాశ్రయించియున్నది. సముద్రమును దాటిన యాసేనకు అంతే కనిపించదు. యుద్ధము చేయగోరు నా మహాత్ము లగు వానరుల సేన సంతోషముతో పొంగి యురకలు వేయుచున్నది. రాము నితో విరోధము వలదు. శాంతమె యిప్పుడు కర్తవ్యము. రామునికి సీత నిచ్చుటయె మంచిది.

అను నా పథ్యము యుక్తమైన వచనం బాలించుచున్ రావణుం
డనె నా సారణుతోడ సౌమ్య! నను దైత్యాదిత్య గంధర్వు లె
ల్లను మీదన్‌బడి ముట్టడించినను సర్వంబౌ భయంబే జనిం
చినఁగానీ జనకాత్మజన్ విడువ జింతింప నేమాత్రమున్ 382

కరమున్ వానరసేనఁ గొల్వగ భయుగ్రస్తుండవై సీత ని
త్తరి నర్పించుటె మంచిదంచును భవత్స్వాంతంబు నందెంతు వా
యరి యెవ్వాడుర యాజి నగ్గెలువగా నర్హుండె యౌసంచుఁ బెన్
పరుషం బొప్పగఁ బల్కి హైమసితమౌప్రాసాద మెక్కెన్ వెసన్ 383

అటు శ్రీమంతుఁడు రావణుండు బహుతాళౌన్నత్యముం బొందు నం
తటి ప్రాసాదము నెక్కి తచ్చరయుతుండై యుగ్రకోపాన ను
ద్భటుడై సంద్రము సద్రులన్ వనములన్ వ్యాపింప నీక్షించుచున్
పటుపై లెక్కిడరాని సైన్యగతులన్ ప్రశ్నించె నా సారణున్. 384

ఎవ రీవానరసేనలోఁ బ్రముఖులిందెవ్వారు శూరుల్ ఘనుల్
ఎవ రుత్సాహముతోడ ముందురుకు వా రెవ్వారి నాలించు వా
డవు సుగ్రీవుడు, యూథపాధిపులు వేరై యుంద్రు వ్యాకువ్యు వా
స్తవముల్ సారణ ! యుంచుఁ బల్కనెనె నిచ్చన్ సారణుం డంతయున్.
385

—: సారణుఁడు కపివీరులఁ జూపుట :—

ఎవఁడైతే నట లక్షవానరులతో నీలంక కేతెంచెనో
ఎవఁడైతే ఘనఘోష గర్జనలతో నీకోటగోడల్ గృహా
లు వనుల్ తోరణముల్ గిరుల్ వణఁకఁ బర్వుల్ తీసి సుగ్రీవు సై
న్య విహారంబులుచేసి ముందుఉకు వాఁ,డానీలుఁ డే చూడుమీ. 386

ఎవఁ డాబాహుల నెత్తి వీర్యయుతుఁడై యాభూమిఁ గాల్లానుచున్
దివిపై నుండియు లంకపై పరుగు నెంతెంతో విజృంభించుచున్
తావ కింజల్కము లట్టి మేన గిరితో తుల్యుండెయై తోక న
ట్లు విదల్చున్ జిటుకల్ ధ్వనింప నడుదేఱు న్నంగదుం డాతఁడే. 387

వడి సుగ్రీవుఁడు యౌవరాజ్య పదవిం బట్టాభిషిక[illegible] స
ప్పుడు గావింపఁగ వాలిపుత్త్రుఁడనగా భూమిన్ బ్రసిద్ధుండయై
కడు సుగ్రీవునికిం బ్రియుండగుచు శక్రార్థంబు ప్రాచేతునా
కడిమిన్ రామునికై పరాక్రమ మవక్రం బొప్పఁ జూపుంగదా. 388

హనుమంతుం డిటు వేగవంతుఁడయి యట్లారాముకై జానకిన్
గనినాఁ డీతని బుద్ధి నైపుణమునం గాదే, కపీంద్రావళిన్.
గొని నిన్నిందె యజేయుఁడై వడి నెదుర్కోవచ్చెఁగా చూడుమీ
యనిలో నీతనితోడ సంగరము చేయున్ శక్యమే గాదుసూ. 389

ఇల నావాలికుమారు ప్రక్కఁగనె యెంతే సేనతో మీరె నా
నలు డీతం డిటు సేతుగట్టిన ! యనంతఖ్యాతి యవ్వానిదే
అల లక్షల్ పది, కోట్ల నూర్లపదులే పై చందనారణ్యవా
సులునౌ నీకపు లెల్ల లంక కెదురన్ సూక్ష్మంబ యేతెంచిరే. 390

కర చాపల్యము గల్గి వెండిగుటులన్ రంగారు శ్వేతుం డితం
డనయంబున్ భయదాయి విక్రముఁడు ప్రఖ్యాతుండు లోకత్రయిన్
ఘన ధీమంతుఁడు వానరోగ్ర బల మింకన్ దీర్చి సుగ్రీవు చెం
తను వేచేరియుఁ గ్రమ్మఱన్ జనును సేనన్ సంతసం పెట్టుచున్. 391

మును పా గోమతియొడ్డునన్ బలు నగంబుల్ కూడు సంకోచనా
ఖ్య నగానన్ గల రాజ్య మేలుచును లక్షల్ వేలు పల్ క్రోతులం
గొని, దీర్ఘంబయి బారెఁడేసి తెలిరంగున్ పచ్చ యెఱ్ఱనౌ
ఘనరోమాల్గల తోకతోఁ గుముదుఁడున్ గాఢ్రివ్వఁగయ్యానకున్. 392

అతఁడే యాకుముదుండు చండుఁడయి లంకాంతంబు గాంక్షించి రో
షితుఁడై ధీరుఁడునై కరంబుఱకఁ జొచ్చెన్ జుమ్మీ లంకాపురిన్
అతఁడో శంభుఁడు సింహసన్నిభుఁడు దీర్ఘాక్షుండు లంకాపురం
బతిగా దగ్ధము చేయువాఁడువలె రక్తాక్షి ద్వయిన్ జిమ్మెడిన్. 393

ఇట నావింధ్యము సహ్యకృష్ణగిరులన్ బృథ్వీధరశ్రేష్ఠమై
పటువైనట్టి సుదర్శనాఖ్య గిరిపై వాఁ డేలుచున్ నిల్చువాఁ
డిటు నూర్మువ్వధి లక్షలైన కపు లెంతేఁ జండులై శూరులై
యిటకున్ రాఁగను లంకఁ గూల్చుకొఱకై యేపారి యుండెన్‌గదా. 394

మఱివీనుల్ నిగుడించి వేగముగఁ బల్మై తావులించున్ మహో
గ్ర రణోర్విన్ వెనుచూపకుండి మృతికిన్‌గానీ భయుం బొందఁడీ
శరభుం, డీతఁడు రోషరూక్షుడయి స్వేచ్ఛన్ మీఱి కంపించుఁగా
వరవాలంబున సింహనాదము నొనర్పం జొచ్చె వీక్షింపుమీ. 395

ఘన సాల్వేయము గిరిన్ వసించి భయమే గానీ యెఱుంగండ యీ
తనికిన్ నల్వదిలక్షమంది కపు లత్యంతోగ్రులున్నారు వీ
రిని లోకంబు విహారులంచుఁ బిలుచున్ లీలన్ రణాలందు చా
వునె లెక్కింపక పల్విహారములు నెప్డున్ జేయుచున్ మీఱుటన్. 396

ఎవడైతే దివి నాసరించి సురలం డింద్రుండటుల్ మించుచున్
ప్లవగాళిన్ గిరివోలె నుండెనొ మఱెవ్వాఁ డిందు గర్జింప భే
రి విశేషధ్వని మీఱు నావనసు క్ష్వేల్కిం దేబదౌ లక్షమం
ది విజృంభింతురు, పారియాత్ర గిరియందే నిల్చి వాడుండెఁజూ. 397

ఎవడంభోధి తటాన రెండవ పయోధే యున్నటుల్ భీతి గొ
ల్పి వడిన్ దూకెడి సైన్యమున్ నడపి మీఱెన్ వాఁడు శైలాభుఁడై
ఘనమౌ నర్వది లక్షమంది కపు లుగ్రాకారులై రాఁగఁ బో
రున మించున్ వినతుండు నెల్లపుడు వీరుల్ యూథపుల్ చేరఁగా 398

మఱియు క్రోధనుం డనువాఁడు వైరమునకు నిన్నుఁ బిల్చుచున్న
వాఁడు అతనిని విక్రాంతులైన వీరు లనుసరింతురు. 399

బల దర్పాంధత మించు వీరులును డెబ్బై లక్షలై రాఁగఁ గ
ట్టలుకన్ లంకను గూల్చద్రోయుటకు నత్యాజన్ముతో గైరికో
జ్జ్వలుఁడౌ సైపఁగ శక్యమౌనె యూథాధ్యక్షు లివ్వాని ప్ర
క్కల సేవింతురొ వారినిన్, గవయునిన్ గన్గొమ్మ దైత్యాధిపా! 400

మఱియుఁ దమ జీవితంబులనైనను లెక్కగొనక రామునికై పోరు మహా
పరాక్రమవంతులగు వానరులను జెప్పెద నాలింపుము. 401

తెలుపు పచ్చన యెర్పు పలురంగు వెంద్రుక
లరుణరశ్మిలఁ బోలు నతఁడు హరుఁడు
ఇతని ప్రక్కనె నూర్లు వెన్నొవేల్ చెట్టులు
పట్టి లంకను నెక్కువారు కపులు
కాఱు మబ్బుల నల్ల కాటుకఁ బోలి
కొలకు గిరులఁ బోలు నెలుగుబంట్లు
వానిలో నర్మద వారి త్రాగెడి జాంబ
వంతుఁడు త్ద్రా జనంతబలుఁడు

ఇతఁడె దైవాసుర రణాన నింద్రునికిని
సాయపడి చాలవరములు సరిగఁ బొందె
ఇతని యెలుగుబంటులు కొండలెక్కి ఱాళ్ళు
పడ వయిచు దైత్య పిశాచ వహ్ని బలులు. 402

అలిగి యెగురు నట్టు లలర క్రోతులు గాంచు
నితఁ డింద్రు సేవించు నితఁడె దంభుఁ
ఇతఁ డడుగున నామ దేగి మేనున నామ
డరుగును సన్నాదుఁ డందు రితని

ఇతఁ డింద్రుతోఁ బోరి పరాజయము
మొందని తేమ సుమ్మొందుఁ గాని
ఇతని రూపమ నాలుగేని కాళులున్న
జంతుల తోఁషుత సాటియగును

ఇతఁడు సర్వాదుఁడు కపులకితఁడె తాత
ఈతఁ డింద్రుని కసురాజి హిత మొనర్చె
ఇతఁడు గంధర్వకన్యకు కృష్ణవర్మ
ముండి పుట్టినవాఁడు ఘనుండు సుమ్మి. 403

ఎవనికి రాజౌచు వైశ్రవుఁడుండె, నేరెఁడు
చెట్టును గొలిచి వసించు నెవఁడు
ఎవఁడు కిన్నరు లుండు పృథ్వీ ధరముల రా
జయి నీదు భ్రాత పచార్లు చేయు
ఎవఁడందె స్త్రీలతో నెసఁగి వసించునో
బలవంతుఁ డయి కపివరుఁడు నగునో
ఎవ దకర్థనుడని యెంచు విఖ్యాతుఁడో
యెవఁడు యూథంబుల కీశ్వరుఁడో

అతఁడు వేయికోటులమంది హితులతోడ
వచ్చి యున్నాఁడు రాముని భద్రమునకు
వీఁడె నీలంకలో నున్న వీరవరుల
మొత్తఁ గలడయ్య రాక్షసభూప! వినుము. 414

* ఇతఁడె హస్తి కపులనెసగు తొల్లిటివగఁ
దలఁచి గంగదరి యూథపులనొంచు
ఇతఁడె గుహలనుండి యేగుచు నప్పుడె
గిరుల వన్యకరులఁ దరులఁ గూల్చు
ఇతఁడె నదిని హైమవతి దరి నుండెడి
వాహినులకునెల్లఁ బ్రముఖుఁ డయ్యె
ఇతఁడె మందరమట్టు లెసఁగు ఉశీరబీ
జమను శైలమున నాశ్రయము వొందె.

స్వర్గమున నింద్రుఁడటు స్వదేశమునఁ దిరుగు
అతని వేయి లక్షలమంది యనుసరింత్రు
వీర్య విక్రమ దృప్తులై వెలయు చుండు
ఘనులు వానరుల కితండ యనుగు నేత. 4(5

ఈ ప్రమాథి కపియె యిటఁ దుపా నగుచు సె
టుపు దుమ్ము లేపు నీకపుల నడుపు
ఇదిగొ తెల్లని మోము లెసఁగు గోలాంగూల
ములు ప్రభుని గవాక్షుఁ గలిసి యుఱుకు

* పూర్వము శంబసాదనుఁడను రాక్షసుఁడు గజరూపముతో మునులబాధించెను. వానిని మునిప్రేరణచే హనుమంతుని తండ్రి కేసరి చంపెను. దానికి సంతోషించి మునులు నీకు మహాపరాక్రముఁడగు కొడుకు హనుమంతుడు పుట్టునని వరమిచ్చిరి. అది మొదలుకొని గజములకు కపులకు వైరము కలిగెనని కథ.

ఇదె సదా ఫలదాయి వృక్షాలఁ దీంట్లొప్పు
    నతులాఢ్య మేరుఁ గేసరి భ్రమించు
ఇదె జయకాంక్షియై యెపుడు సూర్యుని గొల్చి
    శతవలి యను కపీశ్వరుఁడు మించు.

అతఁడు దైత్యుల మధ్య నీవటుల వేలు
కనగిరుల మధ్య పెనునగంబు గలదు
అచట శ్వేతకపిలులు తామ్రాస్యులైన
కపులు గలరు వారికి నేత యీఘనుఁడె సుమ్ము. 406

ఘన సింహాలటు నాల్గుకోర్లఁ దగి యుగ్రవ్యాఘ్రముల్ వోలె దా
రుణులై యగ్ని సమాన తేజులయి ఘోరోరగ క్రూరులై
ఘన దీర్ఘాంచిత వాలులౌచు విచలద్గంధ ద్విపాలట్లు భీ
షణులై శైలసమానులై జలదఘుంఘూ తుల్యులేయెల్లరున్. 407

అట నొక్కొక్కఁడు రాముప్రీతికొఱకై యత్యంతమున్ స్వస్వస
త్వపు శౌర్యంబున నిల్చి ప్రాణములు సుంతన్ లెక్కిడఁబోవ రు
ద్భట నీలుండు గవాక్షుఁడున్ గవయుడున్ భ్రాజన్నలుండున్ హుటా
హుటి మీఱన్ బదికోట్లమంది కపులెంతో చుట్టియుం డెప్పుడున్. 408

మఱి యావింధ్య నివాసులున్ పరుల నేమాత్రంబు లక్ష్యంబు చే
యరు సుమ్మీ దనుజేంద్ర! యందఱు మహీధ్రాఢ్యాంగులౌచున్ మహ
త్తర శక్తుల్ మహితానుభావులు త్రుటిన్ ధాత్రీతలంబంతయున్
విరత ధ్వస్త వికీర్ణ శైలముగఁ గావింపన్ సమర్థుల్ గడున్. 409

వ. ఇట్లు రావణునితో సారణుడు చెప్పగా విని శుకుడు వానరబలమును జూపుచు నిట్లనియె. ఓ రాజా ఎవరయితే మదించిన మహాగజంబుల వలెను, హిమాలయమునఁ బెరిగిన సాలవృక్షంబుల వోలెను గనిపించు చున్నారో సహింపరాక కామరూపులయి దైత్యదానవదేహ పరాక్రమము కలిగియున్నారో

వారు ఇరువదియొకకోటి మంది గలరు. మఱియు వేయిశంఖ సంఖ్య గలిగి వేయి బృందసంఖ్యగలిగి యుండిరి. ఇదిగో కిష్కింధా నిలయులైన సుగ్రీవ మంత్రులయిన వానరులు దేవ గంధర్వులవలనఁ గామరూపులయి జన్మించిరి. దేవరూపులయి కనిపించెడి యీ కుమారులతో మైందుఁడు ద్వివిదుఁడును అను వారితో సములయిన వారెవ్వరునులేరు. వారు బ్రహ్మ యనుజ్ఞపొంది యమృతము భుజించి యుండిరి. వారు తేజస్సుతో లంకను బడఁగొట్ట సిద్ధముగా నుండిరి. 410

ఎవని మత్త గజంబును వలె వీక్షింతువో
ఎవడు సంద్రమును క్షోభింపఁ జేయు
ఎవఁడు లంకకుఁ జేరి యిటు సీతఁ జూచెనో
ఎవఁడు కేసరికిని జ్యేష్ఠ సుతుడో
ఎవఁడు వాయుజుడని యెంతొ ఖ్యాతిని పొందె
ఎవఁడు సులువుగా తరించె జలధి
ఎవడు కపివరుం డెవఁడు మారుత మట్లు
క్రూరగతియొ కామరూపి యగునొ

వేఁడు నున్నత మేరువున్ మూఁడు యోజ
నము లెదిగి సూర్యుఁగని వీని నమరఁ దిందు
నని సురలకుఁ బొందగరాని యున్కపై పె
యొగిరిపడ దవడ విఱిగె నితడె హనుమ. 411

ఇది యాప్తులనగ వింటిని
నెద నీతని బలము రూపము నెరుగంగా రా
నిదియతని ప్రభావము తెలి
యు దితండొక్కండె లంక నణచఁగఁ జాలున్. 412

ఎవడిటు తర్వాత నెసఁగు శూరుడొ యంబు
జ సమాన నేత్రుడొ శ్యామతనువొ
ఎవ్వ డిక్ష్వాకుల నెల్ల నతిరథుండొ
వర లోకమున ఖ్యాత పౌరుషుండొ
ఎవని యందును ధర్మమింతయుఁ గవలదో
యెవడు ధర్మమతిక్రమింప కుండు
ఎవడు బ్రహ్మాస్త్రము నెఱుగు వేద విదుడొ
యెవడు వేదవిదుల నెంతొ ఘనుడొ

ఎవడు బాణాల మిన్నె భేదింప గలడొ
ఎవడు పర్వతముల విదారింప జాలు
ఎవరి యల్క మృత్యువొ బల్మి నింద్ర సముడొ
ఎవరి సతిలాగి, తా రాము డెదురు నిన్న 413

రాముని కుడిప్రక్క రంగారు
ఛాయ విశాల వక్షంబు గలిగి
ఎఱ్ఱని కన్నులు నీలపు వక్ర
కేశాల నందాల రాశి నమరి
రాము ప్రాణసముఁడై నీతిని
యుద్ధానఁ జాతుర్య మొప్పియుండి
సర్వ శాస్త్ర సువిశారదుడై యమర్షిస్మై
జయ విక్రమ మతుల జాణయె యయి

రాముకుడి భుజమై బహిః ప్రాణ మగుచు
రాముకోసము ప్రాణము ల్పౌ రకు గొనక
సర్వ రాక్షసుల రణోర్విఁ జంపమిగుల
నుత్సహించు లక్ష్మణుఁ డందె యుండెఁజూడు. 414

దాముని కెడమగ రాక్షసుల్ నల్వురు
తను గొల్వ రాము రక్షణము కోరి
శ్రీమంతుడౌ రాముచే లంక కభిషేక
మును బొంది తగు విభీషణుఁ డితండె

మధ్యగా గిరివోలె మనకుఁ గన్పించియు
వానరేంద్రులకును ప్రభువె యగుచు
స్వమతి వంశాలఁ దేజమున హిమాద్రి య
ట్లె కపుల మించు సుగ్రీవుడితఁడె

గిరి గహన తరు దుర్గఁ గిష్కింధ నిలిచి
వాలిఁ జంపి రాముఁడిడు రాజ్యాలు పొందు
సురనర శ్రీలిడెడి స్వర్ణసరము దాల్చి
తారతో నమాత్యులతోడ మీఱు నితఁడు. 415

"వ. నూఱులక్షలుకోటి నూఱువేల కోట్లు ఒక శంఖము నూఱు వేల శంఖములు ఒక మహాశంఖము, నూఱువేల శంఖములు ఒక బృందమునూఱు వేల బృందములు ఒక మహాబృందము నూఱువేల మహాబృందములు ఒక పద్మము నూఱు వేల పద్మములు ఒక మహాపద్మము నూఱు వేల మహాపద్మములు ఒక ఖర్వము. నూఱు వేల ఖర్వములు ఒక మహాఖర్వము. నూఱువేలమహాఖర్వ ములు ఒక సముద్రము నూఱువేల సముద్రములు ఒక మహాసముద్రమునూఱు మహాసముద్రములు ఒకమోఘము. నూఱు వేలమోఘములు ఒకమహామోఘము నూరువేల కోట్ల శంఖములు వందబృందములు వేయి మహాబృందములువందపద్మ ములుసహస్రమహా పద్మములునూఱుఖర్వములునూఱుసముద్రములు అట్లే నూరు మహామోఘములు కోటిమహామోఘములు, సముద్రమువలెనుండికొలవరాని కపుల తోనువిభీషణునితోను సచివులతోను,నల్వురురాక్షసులతోను చుట్టుకొనబడినవాఁడై

సుగ్రీవుడు మహాబలపరివృతుడై మహాబలపరాక్రమములు గలిగి నీ యుద్ధము నకై వేచి చూచుచున్నాడు. ఓ మహారాజా మంత్యుగ్రహములవంటి సేన వచ్చి యున్నది. దానిని పరిశీలించి మనము జయించునట్లు పరులు పరాజయము పొందునట్లు ప్రయత్నింపుము. 416

ఈటు లా రావణుఁ డెల్ల సేన నికటంబందున్న సౌమిత్రి నం
శట సుగ్రీవు విభీషణున్ గనుచు భీతస్వాంతుడై క్రుద్ధుడై
అట శీర్షంబును వంచుకొన్న శుకు దైన్యావిష్టుఁడౌ సారణున్
పటు రోషంబున గద్గదోచ్ఛలిత వాక్పారుష్యుడై యిట్లనెన్ 417

ఇలలో రాజుల గొల్చు నీ ప్రకృతు లెంతే నిగ్రహానుగ్రహం
బుల యందెంతొ సమర్థుండైన నతి కెప్డున్ ప్రియంబౌ నుడుల్
పలుకన్‌రాదు విరుద్ధుడై యని యెనప్పన్ పైకి నేతెంచు శ
త్రుల సందర్భము లేకయే పొగడ నెంపున్ యుక్తమే గాదుగా 418

అల యాచార్యుల వృద్ధులన్ గురువులన్ వ్యర్థంబు సేవింతు ర
వ్వల రాజ్యోచిత నీతి సారమగు భృత్యార్థంపు ధర్మంబు నిం
దులఁ గైకో రొకవేళ గైకొనిన నిందున్ దానినిన్ దెల్సికోఁ
దెలివే లేమిని వట్టిగాడ్దె బరువెంతే నౌను, గాదేమియున్. 419

ఇటువంటి మూర్ఖమంత్రుల
నిటఁ బెట్టుకొనుచునె నా యదృష్టవశానన్
ఇటు బ్రదికి యుంటి ధాత్రిని
నటు కాకిప్పటికే నాదు నంతమయ్యెడిదే. 420

ఇటు నన్నే పరుషంబులన్ పలుకు మీకి మృత్యు భీతేమియున్
ఇట లేదే, యిటు లేలు నాపయిన మాటే మీకు క్షేమంబా తే
కిటు నాశంబునొ గూర్చుఁగాదె, వని నిష్ఠే యంటుకొన్నన్ తరుల్
త్రుటిలోఁ గాలకె యుండు, మంద్రె యెటులేన్ దోషంబుగావించియున్

రిపుపక్షానఁ బ్రశంసలన్ జలుపు వీరిన్ జంపియే యుండు ము
న్నెపుడో వీరొనరించు మంచిపనులే యీనాదు క్రోధంబు చ
ల్లపడం జేయుపయేని; యుంచును విమర్శంజేసి వార్కుచ్చె "పొం
డిపుడే నాదరినుండి, చంప మిము మున్నో చేయు మీమంచిచే. 422

ఇటులన్ వీరి కృతఘ్న భావమును నిక్లే నామ స్నేహంబుఁ బో
యుటయున్ వీరికి చావెగా యనెడి రాజోక్తుల్ చెవిన్ సోకి నం
తట లజ్జన్ శుకసారణుల్ జయజయ ధ్వానంబుతో మెచ్చి పో
వుటయున్ రావణుఁ డామహోదరు సమీపోద్యుక్తు నీలాగనెన్. 423

త్వరగా చారుల నీతివేత్తల నిటుల్ వంపించు నున్నన్ మహో
దరుఁ డట్లే యొనరింప చారులు జయధ్వానాల నాశీస్సు లీ
య రయంబే దనుజాధిపుం డనియె మీరా రాము కర్తవ్యమున్
సరిగా రాముని యాంతరంగికుల నిష్ఠామాత్యులన్ గాంచుఁడీ. 424

ఎటు రాముండు వరుండు, మేలుకొను నె ట్లేమేమి గావించు న
న్నిటి జాగ్రత్త పరీక్ష చేసి యిటులన్ మీరేగుదెంచుండి యం
తట నాచారులు తెల్సికొన్న రిపు యుద్ధంబందు భూమీపతుల్
పటు ధీశాలులు స్వల్ప యత్న వరులై పైశంబ బంధింపనౌ. 425

అని యారావణుఁ డట్లు చెప్ప విని యత్యంత ప్రహృష్టాత్ములై
దనుజాధీశునితోడ నట్లె యని దైత్యాగ్ర్య శార్దూలు నం
దునె తాముంచి ప్రదక్షిణంబ చని వేదో సిళ్ళతో మ్రొక్కి ల
క్ష్మణుఁడున్ రాముఁడు నున్నచోటికిని శీఘ్రం బేగి రంతన్ చరుల్. 426

చని వారంత సువేల శైలముపఁ బ్రచ్ఛన్నాత్ములై రాము ల
క్ష్మణు సుగ్రీవు విభీషణున్ బలములన్ గన్గొంచుఁ బైకొన్న భీ
తిని కంగారయి యావిభీషణుని వే హృష్టాత్ములై శీఘ్రమే
యనుకోకుండనె పట్టుకోఁబడిరి యొప్పన్ జిక్కె శార్దూలుఁడున్. 427

వడిఁ బాపాత్ముఁడు వీఁడటంచుఁ గరమున్ బద్ధుండునై వధ్యమా
నుఁడునై శ్రుకుక్కు దయాళు రాముడు నటం దోడ్తోడ వారింపగన్
విడిపింపం జని లంక చారులు కడున్ వ్రాక్రుచ్చి నిట్టూర్చి ర
ప్పుడ రాముండ యాసువేలపుఁ నగంబున్ జేరి యుండుండుటన్. 428

* అటు క్షోభం బిడరాని సైన్యములతో నారాము డత్యంతమున్
పటు శౌర్యాన సువేలశైలమున దుర్వారంబ యున్నట్టు లం
తట చారుల్ వచియింప శ్రద్ధ విని యాదైత్యేశుఁడౌ రావణుం
డట నుద్వేగముతో మంత్రితతితోడ నావేళ నీలాగనెన్. 429

సచివుల్ మీరలు రండు శీఘ్రముగనే జాగ్రత్త నాలోచనల్
వచరింపందగు వేళ వచ్చె ననఁగా శైళంబ దైత్యాళితో
సచివుల్ రాఁగని వారితోఁ దగ విమర్శల్ చేసి పంపించి య
ద్దైచనెన్ రావణుఁ డాస్వకీయ గృహ ముద్విగ్నంబ యౌనెమ్మదిన్. 430

ఒగి నిల్సేరియు మాయులం దెలియు విద్యుజ్జిహ్వుతో సీతయు
న్న గృహం బేగి నిశాటుతోఁ బలికె నింతన్ మాయఁ గావించి చ
క్కఁగ నీసీతను మోహపెట్టగమ యింకన్ నీవు మా యామయం
బగు నారాము శిరస్సు తీసికొని విల్లమ్ముల్ వడిం దెమ్మిటుల్. 431

అనఁగ నంత విద్యుజ్జిహ్వుఁ డగ్గె యనఁగ
రావణుఁడు మోద మొంది యారాక్షసునికి
హారసూను కొన్కయిడి సీత నరయఁగోరి
యాయశోక వనికి రావణుఁ డపుడ యరిగి. 432

---

* 30 ఈ సర్గము కల్పిత మందురు అని వ్యాఖ్య. అందుచే తెనిగింపఁబడ లేదు. 24 సర్గలో శుకుడు రావణునితో చెప్పిన వాక్యము లిందున్నవి.

అటు దైన్యాన కనర్థయయ్యు గడు దైన్యానన్‌దలన్ వంచి యుం
తటి యార్తిన్ భువిఁ గూరుచుండి పతినే ధ్యానించు నాసీత ముం
దట దైత్యాంగన నిట్టుల్ గొలువ నంతంజేరి దైత్యుండు స్వో
ద్భటనామంబును జెప్పుచున్ జనకజన్ బల్కెన్ దమిన్ ధృష్టతన్. 423

కర మిట్టుల్ బ్రతిమాలుచున్నను కడున్ కల్యాణి! నన్ బ్రేలుదే
ఖరునిన్ జంపిన భర్త రాముఁడిటు సంగ్రామాన జావొందె నీ
తఱి నీమూలము కూలిపోయెఁ జుమి నీగర్వంబు నేఁగూల్చితిన్
త్వరగా నీవు వ్యథార్తవై యువుమలే నాకింక నర్ధాంగివై. 424

ఇఁక నిద్దైనను మూఢురాల! విడుమీ యూహెంకి పట్టిల్లు పో
యి కడున్ ధారుణి పాలెయౌ శవముతో నీవేమి కావింతు నే
సకలంబై తగు నాదు భార్యలకు శీర్షం బెక్కి కూర్చుండు మిం
తకు మూఢాత్మవ యల్పపుణ్య క్షపితార్థా! పండితంమన్యరో. 425

విను ఘోరంబగు నీదుభర్త వధ యావృత్తాసురాంతం బటుల్;
నను జంపన్ వడిఁ బాపమాతఁడటు సంద్రంబున్ సమీపించియున్
ఘనమౌ వానరసేన చుట్టుకొని రాఁగా సూర్యుఁ డస్తంబు కాఁ
గను నంభోనిధి తీరమందు విడిసెన్ గట్టాయుతంబై యటన్. 436

పథి శ్రాంతంబయి యర్ధరాత్రి బలముల్ పాథోధి తీరంబునన్
నిదురన్ హాయిగఁ జెంది పండినతఱిన్ నేర్పారగాఁ జారులీ
యది తెల్పంగఁ బ్రహస్తుఁ డంపిన ఘనంబౌ సైన్య మారాము బ్రా
త దరిన్ జేరియు వారి సైన్యమును విధ్వస్తంబు గావించెఁగా. 427

పరిఘల్ చక్రములున్ మహాయసములున్ బాణంబులున్ శూలముల్
శరముల్ పట్టసఖండదండగద లస్త్రంబులన్ గూట ము
ద్గరముల్ యటి తోమరాల్ ముసలముల్ దారుల్ పడిన్‌దాల్చి వా
నరసేనల్‌పడ సుప్తశిరసున్ రాల్చెన్ బ్రహస్తుండటన్. 438

వడిగానంత విభీషణుం డెగిరిపోవన్ మాభటుల్ నిగ్రహిం
చుడు నాకాళ్ళకు బుద్ధిచెప్పి చనెసచ్చో వానరుల్ వెంట వ
చ్చుడు నాలక్ష్మణు; డింక గ్రీనపిఱుగన్ సుగ్రీవుఁడున్ గూలె న
ప్పుడు వేగన్ హనుమంతుఁడంత హనుమన్ పోవన్ హతుండై పడెన్. 439

మతిశీఘ్రుంబుగ జాంబవంతుఁ డెగురన్ మామాభటుల్ వేగ ప
ట్టిరి నంతన్ పెనుగొడ్డలిన్ నఱకుచెట్టి చుట్టులన్ గూలె, వా
నరముఖ్యుల్ ద్వివిదుండు మైందుఁడును నంతన్ నెత్తుటందోగి కూ
లిరి రోదించుచు మధ్యలన్ నఱక నేలిన్ యుద్ధరంగంబులో. 440

వివిధశరంబుల భేదింపఁగాఁబడి
పనసుండు వనసపండనఁగఁ బడియె
పలుబాణములచేత వధియింపఁగాఁబడి
పృథ్విపైఁ గూలె, దరీముఖుండు
అమితతేజము గల్గుకుముదుండు స్మృతిపోవ
నిశ్శబ్దముగఁ బడె నేలపయిని
హేమాంగదము లు సపనిరాలఁగ నెత్తురి
గ్రక్కుచుఁబడియె నంగదుఁడు కూలి

కరులు రథమ్ములును త్రొక్కంగఁ గపులు
గాలివడికి మబ్బులవోలె కూలిపడిరి
సింహములచేత నేన్గుల చెలువుమీఱ
భటులుచే కొట్టఁబడి వేగ బఱచినారు. 441

కొందరు జలధిని దూకిరి
కొందరు నాకాశమం దగోచరమయిరే
కొందరు బుక్షులు చెట్లను
కొందరు మఱి యాశ్రయించిరి త్రోత్తుల వృత్తిన్. 442

కొందరు దూకిరంబుధిని కొందరు మింటిని నాశ్రయించిరే
కొందరు ఋక్షులోతరులఁ గొందరు వానరవృత్తిఁ గాంత్రిఁకన్
కొందరు వార్ధితీరములఁ గొందరు చేరిరి కానసాద్రులన్
కొందరు వానరుల్ గవులఁగూర్చిరి చచ్చిరి పల్విధంబులన్. 443

ఇదిగో నీపతిచచ్చె నాబలముచే సెంతేనిస్ స్వసైన్యంబులతోన్
ఇదె రక్తంబునఁ దడ్సిపోయి కడుదుమ్మైయా శిరం, బంచు దు
ర్మదుఁడా రావణుఁ డుగ్రకర్ముడును దుర్మార్గుండు నాసీత నె
మ్మది నాలించుచు నుండ రాక్షసికి నిమ్మాడ్కిన్ వచించెన్ గడున్. 444

తొరగాబోయి కఠోరకర్ముడగు విద్యుజ్జిహ్వు రప్పింపుమీ
తటి వాఁడేగద తెచ్చెరాము శిరసున్ తద్యుద్ధమందుండి, నాఁ
దొరగా రాక్షసిపోయి పిల్వనల విద్యుజ్జిహ్వుఁ డారాము త
చ్ఛిరమున్ చాపముతోడ రావణునిముందే పెట్టెఁ జేమోడ్చుచున్. 445

ఒగి నారావణుఁ డందెనిల్చు నల విద్యుజ్జిహ్వు నుజ్జిహ్వుఁ ది
న్నగ వీక్షించి వచించె "రాముశిరముం దత్సీత ముందుంచు చ
క్కఁగ నీదినస్వభర్త దుర్దశను నిక్కాలాన వీక్షించు" నా
దగ నాదైత్యుఁడు సీతముందునిచె దైత్యప్రీతిదంబౌ తలన్. 446

అటులారాము శిరస్సు సీతనికటంబందుంచి దైత్యుండు నం
తట మాయంబయిపోవ రావణుఁడు తద్బాహ్యస్వంతమై యెందు ప్ర
స్ఫుటమౌ కీర్తినిగన్న చాపమును నచ్చోబట్టి వాక్రుచ్చె ముం
దటు వీక్షింపుము నీదురాముని ఘనంబై నట్టి యీ చాపమున్. 447

ఇదిగో ఏని ప్రహస్తుఁడే యిటకు నిష్టే యానరుం జంపియు
న్మదుఁడై తెచ్చెనటంచు రాముశిరమున్ దచ్చాపమున్ నేలపై
ముదమారన్ బడపైచి నాకికవశంబున్ గమ్ము నీవంచు నా
ముదితన్ సీత యశస్వినిన్ జనక రాట్పుత్రిన్ దమిన్ వాకొనెన్. 448

అపుడాసీతయు వేగతాదృశశిరంబా పెద్ద విల్లూచి స
త్కపియౌ మారుతి నాయశోకవని వక్కాణించు సుగ్రీవు స
ఖ్యపు వార్తల్ దలపోసి భర్తనయనా లామోముదం గాసమా
నపుమో మాకురు లట్టినెత్తిఁగనె వందంబైన చూడామణిన్. 449

ఇటు సర్వం బగు గుర్తులన్ దలచి లోనెంతో మదింగుంది యం
తట కైకేయినిదూఱె లేడిపలె నత్యంతంబు రోదించుచున్
కటః కైకేయిరొ నీయభీష్టములు నింకన్ పూర్తిగా దీఱె ను
త్కటుఁడౌ ఈకులనందనుం డిదిగొ కట్టా! హతుండయ్యెఁ జూ 450

కలహశీలవౌ నీవ యీకులము నెల్ల
వ్రేళ్ళతోఁబీకి, తార్యుఁడై వెలయు రాము
డే యప్రియమును నీకుఁ గావించెఁ గైక!
నారలిచ్చి నాతోనంపినావు వనికి. 451

అనిపలికి దీనయౌ సీత వణకుచుండి
నఱికిన యరంటివలె వేగ ధరనుకూలి
ఇఁక విశాలాక్షి త్రుటినూరడిల్లి స్మృతిని
పొంది యాతలన్ మూర్కొని కుందియేడ్చె. 452

"అయ్యో చచ్చితి వీరవ్రతానుపాల!
ఓ మహాబాహు! యిటుల నయోగ్యదశను
పొంది యుంటివికట! నీయయోగ్యదశను
నేను విధవరాలఁగ నయిపోయినాను నకట! 453

భార్యకంటెను ముందుగ భర్త మృతిని
కనిన యెడనది సతియవగుణమె యంద్రు
ఓసుచరిత! సత్ప్రవర్తన నున్నవాడు
ముందె నీవిటు మరణంబు పొందినావు. 454

దాశరథీ! నన్ను వంశ పాతకిని మోహ
మునను బెండ్లాడి యాయార్య పుత్త్రుఁ డైన
రామునికి భార్య ననియెడి నామ మొంది
రాముపాలిటి మృత్యువై ప్రబలినాను. 463

ఎప్పు డేకన్య పెండ్లి వారించి యుందు
కాన సర్వరక్షకు భార్యనైన నిట్లు
వ్యథల పాలైతి రామునిపైని నన్ను
త్వరగఁ బడవేయు రావణ! సరిగ నిపుడె. 464

పతిని పత్నితోఁ గలిపి శుభంబుఁ జేయు
నాశిరసుతోడ రాముని యాశిరస్సు
నామెయిని గలుపు మిపుడు రాముమేన
ఆయునఘు రావణ! యనుగమింతు. 465

పతి శిరస్సు ధనుసుఁ బడే పదిగఁ జూచి
యాయతేక్షణ విలపించె నార్త యగుచు
ఉవిద ఇట్టుల విలపించుచుండ నపుడె
ద్వారపాలుఁడు దైత్యుఁడు దరికి వచ్చి. 466

జయము జయము మహారాజ! జయముటంచు
చేతు లొగ్గి ప్రసాదింపఁ జేసికొంచు
అటకు సేనాపతి ప్రహస్తుఁ డరుగుదెంచె
నంచు రావణునికి నివేదించి మఱియు నపుడు. 467

అఖిలమంత్రులతోడఁ బ్రహస్తుఁ డిపుడు
నిన్ను గనఁ గోరి ప్రభు! వచ్చె నీదు దరికె
ఏదొ నిజముగఁ గార్యంబ యిపుడె వచ్చె
చాల యవసర, మీవు దర్శనము నిమ్ము. 468

వ. అని ద్వారపాలకుండు నివేదింపఁగా విని దశగ్రీవుండు అశోకవన మును విడిచి మంత్రులకు దర్శన మిచ్చి అట తనకార్య మెల్లనుమంత్రులతో జెప్పి సమర్థించి రాముని పరాక్రమమును దెలిసికొని సభను ప్రవేశించెను. అంత ఆరాముని శిరమును, ఆధనుస్సును రావణు డట నుండి వెడలినంతనే మాయ మయ్యె. అంత రాక్షసేంద్రుండు భీమవిక్రమ మగు మంత్రులతో రామ విషయక మైన కార్యమును నిశ్చయించి హితైషులగు సైన్యాధ్యక్షులతో నాకాలముకుఁ దగినట్లు చెప్పె. "శీఘ్రముగా గట్టిగా వాదన దండముచేఁ గొట్టి భేరులను ప్రయోగించి సైన్యములను రప్పింపుఁడు ఇప్పుడు దానికారణము చెప్పఁ బనిలేదు" అని రావణుఁ డానతీయ అట్లే యని యాసైన్యాధిపులు తమ గొప్ప బలమును రప్పించి యుద్ధము చేయఁగోరు ప్రభువుతో సైన్యములు వచ్చి నట్లు నివేదించిరి. 469

—: సరమ సీతనూరడించుట :—

ఇటుల మోహితురాలైన యిష్టసఖిని
పరమ దుఃఖితురా లయి ప్రణయిని యగు
* జానకిని సరమ యను రాక్షసియు నపుడె
కని సమీపించెను మృదుభాషిణియె యగుచు. 470

అదివఱకె సీతఁ గాచుట కప్పు డపుడు
రావణుఁడె యాజ్ఞ యిడ నుండి రయముతోడ
స్మృతియె చెడి యాడుగుఱ్ఱము గతిని-దొర్లి
ధూళి యంట లేచిన సీత జాలిఁ గాంచి. 471

* సరమ=విభీషణుని భార్యయని కొందఱు వ్యాఖ్యాతలు. ఇతర రాక్షస స్త్రీ యని కొందఱు.

ఆసరమ సఖీ స్స్నిహిత నటకు వచ్చి
సువ్రతయయి యోదార్చె నచ్చోట నిటుల
ఓసి వైదేహి! భీరు! ఊరడిలుము
భావమున నీకు వ్యధ కాక పోవుఁ గాక. 472

ఎది యారావణుఁ డాడెనో యపుడు నీవేమంటివో సర్వమే
నిది శూన్యస్థలి దాగి రావణునియందే భీతియున్ లేకయున్
మదివింటిన్ విను నీదు జీవితముకన్నన్ నాకు నీ జీవితం
బది యేమంత ప్రియంబు కాదుగ విశాలాక్షీ! నిరీక్షింపుమా. 473

అదె కంగారుగ నాతఁ డెందులకు నట్లా వర్త్పలం దీసెనో
యున్ నేనటు పోయి యంతయు స్ఫుటంబౌ నట్లుగాఁ దెల్సితిన్
విదితాత్ముం డగు రాముఁ- బండిన తఱి- వేచంప శక్యంబె త
ద్వ్యథయున్ బూరుష వర్యునందెటులు యుక్తం బేమియున్ గాదుగా.
474

తరులతో పోరు చేయు వానరుల నింక
చంపుటకు నెటులైనను శక్య మగునె
సురల నింద్రుఁడు రక్షించుకరణి నెపుడు
రాముఁడే కడు వారల రక్ష సేయు. 475

సరిగాఁ దిర్గిన బాహువుల్ గల మహాశౌర్యుండు శ్రీమంతుఁడున్
వర ధర్మాత్ముఁడు సీత! తన్నుఁ బరులన్ వైళంబ రక్షించువాఁ
డురువక్షుండును విశ్రుతుండును సచింత్యోగ్రోరు వీరుండు నై
యరి విధ్వంసకుఁడైన రాముఁడు సుఖుండై యుండె స్వభ్రాతతో
47

ఇది యుక్తం బగు బుద్ధిలేక, ఖలుఁడౌ నీమాయకాఁ డుగ్రుఁడీ
యదనన్ జేసిన మాయయే, యిపుడు కల్యాణంబె ప్రాప్తించె నీ
వ్యథ సర్వంబును పోయె వాస్తవముగా నీలక్ష్మి నిన్బొందె ని
య్యది ప్రీతిన్ విను, రాముఁ డంబుధిని నొయ్యన్ దాటె సైన్యాలతో

సరిగా రాముఁడు వార్ధి దాటి తటిన్ సైన్యంబులన్ నిల్పియున్
పరిపూర్ణార్థుఁడ యౌచు లక్ష్మణునితో భద్రంబు సైన్యాలు తన్
పరిరక్షింపఁగ నుండె రావణుఁ డికన్ పంపించి యున్నట్టి యా
చరుతో రాముఁడు వార్ధిదాటిన సమాచారంబె యందించెనే. 478

స. మఱియు నో విశాలాక్షీ! యీ రాక్షసరాజు రావణుఁడు రాముని ప్రవృత్తిని గూర్చి వరులై నమంత్రులతో సంప్రదించుచుండె నని సరమ సీతతో చెప్పుచు సర్వ ప్రయత్నముతోల నిండిన సైన్యముల భయంకర శబ్దమును దండములచేఁ గొట్టి వాయింపఁబడిన భేరుల ధ్వనిని విని మధుర భాషిణియై సీతతో మరల నిట్లనియె. 479

అదె యుద్ధసన్నాహ మంబుద ధ్వనిఁబోలు
భేరీనినాదంబు భీరు! వినుము
ఇవిగొ దీర్చిన యేన్గు లివిగొ పూన్చిన హయా
లదె హయా లెక్కు ప్రాసధరులు
ఆ రాజ పథముల నరుగు కాల్బలములు
సుఖము తరంగాల నుదధిఁబోలు
అస్త్రాల ధాలుల హయములఁ గవచాల
నసుర వారణరుచు లగ్నిఁ బోలు
ఇవిగొ ఘంటల రథముల రవము లెన్నొ
అవిగొ గుఱ్ఱాల సకిలింపు లివిగొ ధ్వనులు
శస్త్ర పాణులౌ దైత్యుల సంభ్రమములు
నలరె విను సీత! యిదె యొళ్ళు పులకరించు. 480

ఇఁక నీదు వ్యథ పోవ నిదె శ్రీయు నినుజేరు
నసుర సంతతికి భయంబు పట్టు
శక్రుడ ట్లసురుల జలజాక్షుఁడగు రాముఁ
డణచి రావణుఁజంపి గొనును నిన్ను

హరి- హరితోనట్టు లరులఁ జంపుచు రాముఁ
డనుజుతో లంక నాక్రమించు
అరి చావ సిద్ధార్థ వయి రాము నొడిలోనఁ
దనరిన నినువేగ కనులఁజూతు

ప్రియుని గౌఁగిటఁ జేర్చియు ప్రియుని ఁోమ్ము
తడియ నానంద బాష్పాలు విడుతు వింక
నెలలకొలఁదిఁ దాలిచి పిఱుందులను తాకు
వేణి నిఁక దేవి విప్పెదుగాని సీత ! 481

ప్రియుమో ముద్గత పూర్ణచంద్రునిబలెన్ వీక్షించి- సర్వంబు తా
మెయిఁ గూసంబునుబోలె శోకజ జలంబే వేగ వర్షింతులే
రయమున్ రావణు నాజిలోఁ దునిమి శ్రీరాముండు సౌఖ్యార్థమై
ప్రియవౌ నీదరిఁ జేరి సౌఖ్యములఁ దేలించున్ నిమన్ మైథిలీ ! 482

అనఘుండౌ వరవీరుతోఁ గలిసి- వరార్ద్రింపు సస్యంబుతో
ఘన హర్షంబును గాంచు ధారుణి వలెన్- గన్గొందు వానందమున్
ఘనమేరున్ వలగొంచు గుఱ్ఱములు- వేగం బొచ్చు నాదిత్య దే
వుని నీవున్ శరణంబు పొందు, మతఁడే భూమీ ప్రజా హేతువున్. 483

రావణు నుడులన్ మోహితురాలై యగుచు
ఎంతొ తాప మొందెడి జనకేశు సుతను
సరమ మిగుల సంతన పెట్టి సరిగ నపుడె
కరము వర్షించి పృథివి నాకాశ మట్లు. 484

అపుడు సఖురా లయిన సీత కధిక హితము
వలువఁ గోరుచునుండి మాటలకు నుండె
చిఱునగవు నవ్వ నునుపల్కు సరమ సకియు
తఱికె తగునటు వలుక నాతఱిని ననియె. 485

ఓసి యసితాక్షి ! నేనిదె పోయి నీవు
నిపుడ కుశలమ యని నివేదించి రాము
నికిని, తిరుగ దాగియు రాఁగ నేను దలతు
నను గరుడియు గాలియు దాటి చనర మింటి. 486



ఇటు లను సరమతో నపు డిదివఱకునె
వ్యథఁ గనిన సీత యనె మృదు మధురముగను
మిన్నొ పాతాళమో వడిన్ మించగలవు
ఎవరు చేయులేనిదిఁ జేతు వీవు నాకు. 487

నాకుఁ బ్రియుంబు చేయవలెనా యటు సుస్థిరబుద్ధి యుండెనా
ఈకడ రావణుం డెదొనరించునొ వాని నెఱుంగఁ జెప్పుమీ
ఆకడు మాయశక్తి గల యారిపు రావణరావణుండు న
న్నా కడు మోహపెట్టె ఖలుఁ డానిననే భ్రమపెట్టుఁ గల్లటుల్. 488



రూక్షలై కఠో రాక్షులౌ రాక్షస సతు
లీక్షణమునఁ దర్జించి భర్జించి నన్ను
రక్ష చేయు రాక్షసపతి దీక్ష పూనె
రాక్షసుఁ డన నుద్విగ్ననౌ పక్షి నైతి. 489



ఈయశోకవనిని వాని నెంచి మిగుల
భయము చెందెద నవ్వాని వార్త గాని
వాని నిశ్చయం బేని సర్వంబు నీవు
కడు నివేదించుచో ననుగ్రహమె నాకు. 490

సరసముగ మాట లాడెడి సరమ యపుడు
అటులఁ బల్కు జానకి బాష్పాకులాస్య
మాదృతిని నోక నిటు చెప్పె నీది యిట్టి
యాశయుం బేని యటె వాని నరసి వత్తు. 491

వ. అని పలికి యాసరమ యారావణాసురుని దరికిబోయి మంత్రులతోఁ గూడిన యారావణుని మాటలు విని యాదురాత్ముని నిశ్చయమెఱిఁగి శీఘ్రముగ నాయశోకవనికివచ్చె. అంత వచ్చినంతనె ప్రియముగమాటాడు సరమను చూచి సీత స్నేహముతోఁగౌఁగిలించుకొని స్వయముగా ఆసనమిడి యిట్లనియె. ఇటు సుఖముగఁ గూర్చుండి యాదురాత్ముఁడైన క్రూర రావణుని నిశ్చయము సరిగాఁజెప్పుము" అని వణకుఁచు సీత యడుగ విని మంత్రులతోఁగూడియున్న రావణుని మాటలన్నియు నిట్లు చెప్పెను. 492

నీను నర్పించు మటంచుఁ దల్లియనె మంత్రీంద్రుం డవిద్ధుండు తె
ల్పెను మర్త్యేంద్రుని మెచ్చి సీత నిడు మారీతిన్ జనస్థాన మం
దును నేయద్భుత మైనదో యదియె యెందున్ జాలు దృష్టాంత మ
బ్ధిని దాటెన్ గనె సీత, నొక్కడటు చంపెన్ రాక్షసానీకమున్. 493

మనుజుం డెవ్వఁ డిటుల్ పొనర్చు నని, ప్రేమన్ మంత్రి వృద్ధాళి బో
ధను గావించినఁగాని యర్థపరుఁ డర్థంబున్ విడన్ జాల న
ట్లనె నిన్నాతఁడు వీడఁ గోరఁ డిఁకఁ బోరన్ జావకుండంగ నె
ట్లును నిన్వీడ డిదే యమాత్యయుతుఁడౌ క్రూరాత్ము నుద్దేశమున్. 494

ఇదె యాబుద్ధియుఁ జావునూడుటనె యయ్యెన్ దాను దైత్యావళుల్
కదనంబుందు వధింపఁగాఁ బడక యింకన్ నిన్ను వీడండ యి
య్యది ఖాయం బసితాక్షి! రావణుని నుగ్రాస్త్రాళిచేఁ జంపియే
విధిగా రాముఁ డయోధ్య కింక నిను వేవేకొంచుఁ బోవుం జుమీ. 495

అని వాక్రుచ్చెడి యంతలోనె కపిసైన్యంబుల్ ధరిత్రీతలిన్
వణఁకం జేసెడి భేరి శంఖతుముల ధ్వానంబు లత్యంతమున్.
వినవయ్యెన్ గపి సైన్య ఘోషణములన్ వీనొగ్గి యాలంకలో
దనుజుల్ తేజము వోవ దీనులయి భద్రం బెంచ రాదుష్టచే. 496

## —: రావణునికి మాల్యవంతుడు హితము చెప్పుట :—

భేరీశంఖ నినాదముల్ దిశల వ్యాపింపంగ నాలించుచున్
వైరిధ్వంసకుఁ డైన రాముఁడు మహాబాహుండు నేతెంచె నం
చా రక్షో విభుఁ డుగ్రరావణుఁడెవన్ ధ్యానించి పశ్చాన్ క్షణం
బారామున్ దలపోసి మంత్రితతితో నాస్థాని మార్గోన్ముఁగన్. 497

వనధిన్ రాముఁడు దాటుటన్ బలమహా వ్యాపార శౌర్యంబు తే
మని వాక్రుచ్చిరొ వింటి సర్వమును మీయాసత్యశౌర్యాలు గం
టిని నన్యోన్యపు శౌర్యమున్ దెలిసికొంటిన్, మీరు మౌనంబు తో
డను నున్నప్పటికిన్ గ్రహించతనితోడన్ దైత్యనాథుం డనెన్ 498

వ. అపుడు మహాప్రాజ్ఞుండును తల్లికిఁ బినతండ్రియు నగు మాల్య
వంతుం డను రాక్షసుండు రావణుని మాటలు విని యిట్లనియె. 499

విద్యల నేర్పొంది నీతిగాఁ
జని యరిఁ గెల్వ నైశ్వర్య మొందు
తటి చూచి శత్రులఁ దటిమి స్వపక్షము
వర్ధిలఁ జేయు నైశ్వర్య మెనయు
క్షీణస్థితిని పొందు క్షోణీశుఁడు సముని
గూడి సంధిని జేసికొనఁగ వలయు
వరుఁడైన భూపతి యరి నుపేక్షింపక
యెంతొ దానికి నిగ్రహింపవలయు

కనుక రావణ! రామునితోఁ గలిసిసంధి
చేసికొని సీత నిడుట రుచించు నాకు
ఎల్ల దేవర్షి గంధర్వు లెవని జయము
కోరుదురొ వాని వగ వీడికూడ దగును. 500

భగవంతుఁ డైన బ్రహ్మయె
జగమున సురల కసురులకు సరియగు నటు రెం
డగు పక్షములె సృజించెను
తగు ధర్మాధర్మములు త దాధారములౌ. 501

ధర్మంబగు పక్షంబును
నిర్మించె మహాత్ము లైన నిజదేవులకున్
ర్మించెను రాక్షసుల క
ధర్మపు పక్షమసురలకు తగినదె పుత్త్రా! 502

ధర్మంబు క్రుంగుచుండె న
ధర్మంబును నందువల్ల తగెఁ గృతయుగమై
ధర్మంబును మఱి క్రుంగె న
ధర్మం బీ కారణమునఁ దగె గలియుగమున్. 503

ఈలోకములఁ జరించెడి
నీలో ఘనధర్మ మెపుడొ నిహతంబయ్యెన్
ఈలాగె యధర్మ మొదవె
నీలీలనె మనకంటె హెచ్చిరి వైరుల్. 503

ఇటుల నధర్మము నీ చె
న్నఁటి తనమునఁ బెరిగి మనల నష్టులఁ జేయున్
అట సురపక్షము నను వై
యిటులన్ వర్ధిల్లఁ జేయు నెపుడున్ సురలన్. 504

విషయములఁ బ్రవర్తిలి యే
విషయమునో మిగులఁ జేసి వెలిఁగెడి నీచే
ఋషులకును నగ్నిసములకు
విషమ మగు మహావ్యథ లిడివేధించితివే. 505

భగభగ మండు నిప్పులుల వారిప్రభావ మెసుర్కొనంగ రా
దు గద తపస్సుచే విగతదోషులు ధర్మ మనుగ్రహింపఁ జే
యుఁగ రతులౌ ద్విజాళి వరయజ్ఞములన్ బొనరించి శుద్ధులై
తగు విధి నగ్ని వేల్తురు యథావిధి వేదములం బఠింత్రుగా.    506

వారలు వేదఘోషలఁ దపస్సుల రాక్షసులన్ గడున్ దిర
స్కారము చేయుచుండియు దిగంతములన్ బరుపెత్తఁ జేయురే
వారలో యగ్నికల్పులయి వ్రేల్వగ నగ్నుల బ్రాకు నాపొగల్
వీర నిశాట తేజముల వ్రీల్చు వ్రతాలను నొంచు దైత్యులన్.    507

సుర యక్షాసుర రాజినుండి మృతి నెవ్వోఁ బొందరాకున్నటుల్
త్వంమే పొందితి వీవు గాని యిటు గోలాంగూల మర్త్యక్ష వా
నరు లుగ్రుల్ ఘనవిక్రముల్ బలయుతుల్ నైపుణ్య మేపార వ
చ్చిరి గర్జించుచు నుండి రిచ్చట నెటన్ జింతించి గావింపుమీ.    508

వివిధోత్పాతము లుగ్రమై కరము గన్పించెన్ సమస్తాసురుల్
సవిధం బందె నశించి పోదు రని త్రాసం బొందుచుంటిన్ గడున్
భువిఁ బారుష్యయుత ధ్వనుల్ వినఁబడున్ వ్యోమంబునన్ మేఘముల్
వివిధోష్ణంబగు నెత్తురుల్ గురిసెగా భీమ ప్రజం బయ్యెడిన్.    519

కరులు నశ్వంబులు గన్నీళ్ళు కార్చును,
పడు ధ్వజంబులు వెల్లఁబారి కూలె
చెడు నక్కలును గ్రద్ద లవరి బిట్టుఱచుచు
గుంపులై లంకలోఁ గూడుచుండె
నలుపు భూతాంగనల్ తెలుపు పండ్లను నగి
వస్తులు గొని దూఱ వత్తు రి కలల
బలి హవిస్సులను కుక్కలు తిను నాలు గా
డిదలఁగనును ముంగు కెలుక లడరె

పులులు పిల్లులు పంది కుక్కలును గలియు
కిన్నరులు దైత్య నరులతో గెళి నుంద్రు
తెలు పెఱుపు గాళ్ళ బక్షులు కపోత
ములును రాక్షసక్షితి కయి కలిసి తిరుగు. 510

అల గోరింకలు కీచికూచి యని బిట్టార్చున్ గృహాలందు పెన్
కలహంబుల్ గొనిగెల్చి కూడియు విహంగాల్ జంతులున్ జాటీ ది
క్కుల సూర్యున్ వలగొంచు నార్చుమిగులన్, క్రూరుండు పెన్ కృష్ణపిం
గళుఁడై ముండుఁడు కాలుఁడున్ దిరిగెడిన్ జాలాల్ ప్రతీక్షించెడిన్. 511

యిటులే యింకను నన్య దుష్టశకునా లిట్లట్టున్ గడుం దోఁచెడిన్
ఇటకున్ విష్ణువె మానవాకృతిని నిట్లీతెంచె నంచెంతు ని
చ్చటె రాముండొ మనుష్యమాత్రుఁడుగ దోచం డేమి యాతండెగా
వటుసేతున్ జలధిన్ రచించెను తలంపం దోచె నాశ్చర్యమై. 512

నగరాజై తగు రాముతోడ నిపుడున్ సంధిం దగం జేయు ము
త్తరకాలార్హము లైన శౌర్యములు నిర్ధారించి గావింపు మి
త్తఱి నేరావణ! యంచు బల్కులటుల్ దన్మాల్యవంతుండు తా
పసమశ్రేష్ఠుఁడు చెప్పి యూరుకొనెఁ గ్రీవన్ రావణుం జూచుచున్. 513

అటు పథ్యంబుగ మాల్యవంతు డనువాక్యంబుల్ మదిన్ సైపకే
యిటు దుష్టాత్ముఁడు కాలపాశ వశుఁడై యెంతో మదిన్ హెచ్చి భ్రూ
కుటి నెమ్మోమునఁ గూర్చి గుండ్రముగఁ గన్గ్రుడ్డుల్ వడిన్ దిప్పి యం
తట వాక్రుచ్చెను మాల్యవంతుఁడు వినం దద్రావణుం డల్కతో. 514

హిత మన్బుద్ధిని, శత్రుపక్షమున నీవిట్టుః ప్రవేశించియున్
హితమే కానిది చెప్పుచుంటె పరుషం బేపార; నావీనులే
గతి సైసం జొర దిద్ది వానరుల ప్రక్కం జేరు నీనీచునిం
బితచే గెంటఁగఁబడ్డ వాని నెటు లీవిట్టుల్ సమర్థింతువే. 515

ఇఁక నేనో సకలాసురేశ్వరుఁడనే యీసర్వ దేవాళి భీ
తి కరుండంగన, సర్వ విక్రముల నెంతేఁ బూర్ణుఁడన్ విక్రమా
లకు హీనుంగఁదలంతు, విట్లనుట వీరద్వేషమా శత్రులం
దె కడుం ప్రేమను, దూతఁ విట్లు పరులంటే నీకు ప్రోత్సాహమా ! 516

పరుల ప్రోత్సాహమే లేక పండితుండు
శాస్త్రతత్త్వజ్ఞుడును ప్రభుశక్తి గలుగు
పురుషు డున్నత పదమందు వఱలువాని
పరుషముగ నిట్లు నిందించి పలుకఁగలఁడె. 517

పద్మ మది లేని శ్రీవలెఁ బరఁగి యున్న
సీత నిటు వని నుండి తీసికొని వచ్చి
రామునం దలి భయముచే నేమి నేను
ఏల సీతను నిపు డప్పగింపఁ గలను. 518

ఆ వానర కోటులచే
నావృతుఁడై లక్ష్మణుండు నాకపిపతి సు
గ్రీవుఁడు కలిగిన రాముని
నీవె గనెదు త్వరలోనె నిహతుం డగుటన్. 519

ఏ వీరుని కెదుటనె వడి
దేవతలును ద్వంద్వ రణముదెస నిలలేరో
ఆ వీరుఁడు రామునితో
నేవిధి యుద్ధంబు చేయు నిఁక భయమొందున్. 520

నను రెండుగఁ జీల్చుచు ను
న్నను నెన్నండు నెవనికిని నాతల వంచన్
కను మిది నా నిజ దోషము
తనదు స్వభావమును నెపుడు దాటగఁ దరమే. 521

ఏదొ రాముఁడు సేతువును ను
దధిలోఁ గట్టినది కాకతాళీయంబే
ఇదె గద నీకున్ విస్మయ
మొదవించెను నందునఁ గద యొదవెను భయమున్. 522

వానర సైన్యంబులతో
నా నీరధిని సరె రాముఁ డటు దాటెనులే
నే నీకు నొట్టిడి ప్రతిన
నేనొనరుతును బ్రదికి చన డితఁడు ధ్రువంబే. 523

ఇటు సంరంభమున హుటా
హుటి నను రావణుఁ డలిగియె యుండెనటంచున్
తటుకున సిగ్గిలి యుత్తర
మెటులు నిడక మాల్యవంతుఁ డిక నూరుకొనెన్. 524

అవలన్ జయజయమని భూ
మివిభుని కభినందన మిడి మెల్లఁగ తగ భూ
మి విభుని వీడ్కొని యట మా
ల్యవంతుడు స్వభవన మరిగె నధిపు ననుజ్ఞన్. 525

ఇఁక రావణుఁడు సచివుల ని
డికొని మంత్రించి యతివడిగ నాలంకన్
ప్రకటముగ రక్ష కేర్పా
టు కరము కావించె నపు డిటుల గాఢముగా. 526

తూర్పు ద్వారంబునఁ దొరగఁ బ్రహస్తుని
రక్షణ కెంతొ యేర్పాటు చేసె
దక్షిణ ద్వారాన తగు మహావీరుల
వరు మహోదరు మహాపార్శ్వు నుంచె

పశ్చిమ ద్వారాన బహురాక్షసావృతు
సతి మాయు ఘను నింద్రజితుని నునిచె
ఉత్తర ద్వారాన నుంచి సారణు శుకు
నొగిఁ దాను నచ్చట నుండఁ దలఁచె

పెస విరూపాక్షు ఘను మహావీర్య ధుర్యు
పురము మధ్య నుంచెను దైత్యవరులతోడ
ఇటులఁ గాలంబు ప్రేరేప నేర్పఱచియు
దనును కృతకృత్యుఁ దనుచెంచె రావణుండు. 527

అటుల నేర్పాటు గావించి యఖిల గతుల
సచివులకుఁ బుష్కలముగ నాజ్ఞల నొసంగె
జయము జయ మని మంత్రు లర్చనలు చేయ
భాగ్యకరిని నంతిపురి రావణుఁడు చొచ్చె. 528

అవల రామలక్ష్మణులు నంగదుఁడున్ హనుమంతుం డింక సు
గ్రీవుఁడు జాంబవంతుఁడుఁ గపీంద్రులు మైంద సుషేణులున్ నలుం
డావల నావిభీషణ గవాక్షులు నా కుముదుండు నాగజుం
డావిధి వీరుఁడా వనసుఁ డాశరభ ద్వివిదాదు లయ్యెడన్. 529

త్వరగా లంకను జూడఁబోయి యిటులన్ వారెంచి రన్యోన్యమున్
సురగంధర్వ నిశాచరోరగుల కిచ్చో గెల్వగారాక దు
ష్కరమై రావణ పాలితం బయిన లంకాపట్న మారావణా
సురుఁ డెప్డుండును కార్యసిద్ధికయి యిచ్చో నేమి చేయుందగున్. 530

అని వారందఱు నొండొరుల్ పలుకగా నాలించి యంతన్ విభీ
షణుఁ డగ్రామ్య పదాన్వితం బయి సమగ్రార్థంబయౌ వాక్కసెన్
“అనలుం డీశరభుండు నీ ప్రఘసుఁ డత్యాప్తుండు సంపాతియున్
అను నామంత్రులు చూచి తెల్పి రరిసైన్యంబుల్ ప్రవేశించియే. 531

ఇపు డాదుష్ట దశాస్య వ్యాహరచనం బేఁజెప్పెదన్ రామ ! తూ
రుపు ద్వారానఁ బ్రహస్తుఁడే బలము తీర్చున్, దక్షిణ ద్వారపా
ర్శ్వపు భూమిన్ ఘనులౌ మహోదర మహాపార్శ్వుల్ సదానిల్తురి శౌ
ర్యపరుం డింద్రజితుండు పశ్చిమపు ద్వారంబెల్ల రక్షించెడిన్. 532

అతనిన్ పట్టస ఖడ్గచాపధరు లుగ్రాత్ముల్ మహాశూరు లా
తత నానాయుధపంక్తి శూలములు చేతంబట్టి జాగ్రత్త సం
తతమున్ రక్షణచేయుచుందురు, మహాదైత్యుల్ సహస్రాలుగా
ప్రతి కాలంబును వానిచుట్టుకొనియే శ్రద్ధన్ నిరీక్షింత్రు సూ. 533

సరె యాయుత్తరదిక్కు ద్వారముననే జాగ్రత్తగా రావణా
సురుఁడే యుండియు సైన్యముల్ నడపుగా, శూలాసి చాపంబులన్
పరమ శ్రద్ధ ధరించి యుండిన విరూపాక్షుండు తత్సేన కం
తరమం దుండి సదా నిశాచరుల బృందంబుల్ పసింపన్ నిలున్. 534

వ. ఇట్లు నా మంత్రులు లంకలోఁ గల సైన్య నివహంబులు చూచి వచ్చిరి. అందు వేలు గజములు పదివేల రథంబులు ఇరువదివేల గుఱ్ఱంబులు
ట్లు పూర్తిగా కోటిమంది గలరు. వీరందఱు విక్రాంతులు బలవంతులు యుద్ధమునందు ఆతతాయులై రాక్షసరాజున కిష్టులై యుందురు. యుద్ధమునకై ఒక్కొక్క రాక్షసునకు పది లక్షలమంది పరివారము గలదు. అని మంత్రులు చెప్పిన లంకా ప్రవృత్తిని సచివులను గూర్చి నివేదించి వారిని చూచి రామునికిఁ బ్రియంబు చేయు కోరికతో శ్రీమంతుడును మహాబాహువునైన విభీషణుఁడు పద్మపత్రనేత్రుఁడైన రామునితో నిట్లనియె. 535

ఎపుడు రావణుఁడు కుబేరు నెదురుకొనియె
అప్పు డరువది లక్షల యసురు లుంద్రు
వీరు దర్ప విక్రమముల వీర్య గరిమఁ
దేజమున రావణునికిని దీటు వత్తురి. 536

ఇటులు చెప్పినందులకు కోపింపవలదు
రోష పెట్టుదు భీతి కూర్చుటయె లేదు
నీవు సురలను గూడను నిగ్రహింప
తగు సమర్థుఁడవును వీరుడగుదు సుమ్మి. 537

నీవు చతురంగ బలముతో నేర్పు గలిగి
ఈ కపి బల వ్యూహములై కడంక
నడవ రావణు మథియింప నడరుదువులె"
అని విభీషణుఁ డన రాముఁ డనియె నిట్లు. 538

తూరుపు ద్వారాన వీరుఁడు నీలుండు
కపులఁ గూడి ప్రహస్తు నిపుడ వోరు
దక్షిణ ద్వారానఁ దగు నంగదుఁడు మహో
దరు మహాపార్శ్వుని దఱుముఁ గాక
పశ్చిమ ద్వారానఁ బవన సూనుం డప్ర
మేయుఁడై శత్రుల మించుఁగాక
ఉత్తర ద్వారాన నుండి లక్ష్మణుఁ డేను
ననఘు ఋషిరిపు వరాంధుఁ గూల్తు

మఱి కపిరాజు జాంబవంతుఁడును నింక
నిపుణుఁడు విభీషణుడు మధ్య నిల్తురి గాక
ఇటులు నర రూపమునఁ గపు లెనఁగరాదు
ఈకపి బలంబు కపిరూపె యొఱుఁగఁజేయు 539

వ. మే మేడుగురము రామలక్ష్మణులు నీలుఁడు అంగదుఁడు హనుమంతుఁడు జాంబవంతుడు విభీషణుఁడును మానవ రూపముతోనే యుద్ధముచే యుదము అని నంతట రాముఁడు సరే యని విభీషణునితో పలికి సువేల పర్వతము నెక్కుట కయి తలఁచి మిక్కిలి రమణీయ మగు సువేలగిరి తట

మును జూచి సమస్త భూతలమును మహాబలముతోఁ గప్పి కైచి సంతోష
ముతో శత్రువును జంప ముందుకేగ నిశ్చయ మతి యయ్యె. 540

ధ్రువుఁడై రాముఁ డికన్ సువేలగిరి న్నారోహింప లోనెంచి శ్రీ
రవు సుగ్రీవు విభీషణున్ సుగుణు మంత్రజ్ఞున్ నిరీక్షించి వా
రి విధానంబును రాగభావమును నేర్మిన్ మెచ్చి శ్లక్ష్ణంపు వా
క్య విభుత్వం బది యేర్పడంగ నిటు వక్కాణించె స్నేహంబుతో. 541

ద్రుతి వేగాన సువేల శైలమును నారోహింత, మీరాత్రి ను
న్నత ధాతూ జ్జ్వల శైలశృంగములపై వాసంబు గావింత ము
ద్వృతియై చావున కింతి లాగు ఖలునా లంకన్ నిరీక్షింత మే
వ్రతులౌ మౌనులఁ జంపు రాక్షస తతిస్ ధ్వసంబు గావింతమే. 542

ఏజనుఁడు ధర్మ మెఱుఁగఁడో
యాజనుని నడత కులము క్షయంబగుఁజుమ్మీ
ఆజను రాక్షస నీచపు
పైజంబే నింద్యమయ్యె నాసతిఁ గొనుటన్. 543

అటువంటి రాక్షసాధము
కటు వర్తనమొందె నాకుఁ గడు రోషంబౌ
అటువంటి నీచు నేరమె
యిటు రాక్షస నాశమునకు హేతువ యయ్యెన్. 544

ఇఁకఁ గాల పాశ వశుఁ డయి
యొకఁడే పాపంబు చేయు చుండును నెపుడా
యొక నీచుని చెడు నడతన్
సకల కులంబును నశించి క్షయమయి పోవున్. 545

ఇటు లాలోచించుచునే
పటుకోపము రావణు పయిఁ గలుగఁగఁ జిత్రో
త్కట తట సువేల శైలము
నటు లారాముఁడు తటుకున నారోహించెన్. 546

అటు పిమ్మట లక్ష్మణుఁడును
పటు ధనువు శరములును గొని యారోహించెన్
అటె సుగ్రీవ విభీషణు
లట నధిరోహించిరి తనయామంత్రులతో. 547

ఆవల గంధమాదనుఁడు నంగదుఁడున్ హరరంభు లింక నా
పావని జాంబవంతుఁడు గవాక్షుఁడు మైంద సుషేణులున్ నలుం
డావల దుర్ముఖుండు బుషభాదులు నా కుముదుండు నాగజుం
డావిధి వీరుఁడౌ పవనసుఁ డాశరభ ద్వివిదాదు లిట్టులే. 548

గవయ శతవలు లాదిగాఁ గపులు మిగుల
వాయు వేగులై యాగిరివరము నెక్కి
అచిర కాలములో మింట నంటు నట్లు
తనరు లంక రాక్షస పూర్ణఁ గనిరి యపుడు. 549

అటఁ బ్రాకారములందు నెంతయును నీలాకార దైత్యావళుల్
పటువౌ రీతిని నిల్చి రెండవదియౌ ప్రాకార మట్టుల్ హుటా
హుటి నుండం గని వానరుల్ రణముకై యుత్సాహముం జూప ను
ద్భటులన్ గాంచుచు గర్జనల్ సలిపి రంతన్ రాముఁ డీక్షింపగన్. 550

రయము సూర్యుఁడు సంధ్యచే రంజితుఁడయి
యస్తమింపఁ బూర్ణేందు దీప్తాంగి యైన
రాత్రియు ప్రవర్తిలఁగ సైన్యరాజు రాముఁ
డా విభీషణాదులు కొల్వ నటు వసించె. 551

అచటఁ గపులు రాతిరి సువేలాద్రి నిలిచి
లంకలోని వనంబులు రమ్యమైన
పుష్ప సౌమ్యమై సువిశాలములును నైన
యుపవనులు చూచి యాశ్చర్య మొందినారు. 552

అలరుల్ నిండిన కర్ణికార ధవ నీపాశోక హింతాల పా
టల పున్నాగ తమాల సాల తిల కాఢ్యం బౌచు బంధూక వం
జుల ఖర్జూరక సప్త వర్ణ వకుళ స్ఫూర్జార్జు నామ్రాది మం
జుల మౌచున్ వరనాగ మూలములతో శోభించె నుద్యానముల్. 553

అల పుష్పాంచిత రక్తకోమల లతాఢ్యం బౌచు, సుశ్యామ శా
ద్వలముల్ రాజిలఁ జిత్రమై సురభులన్ వాసించి నానావిధం
బులు పూలన్ తరులెప్డు భూషణములన్ మోదించు వల్మానవు
ల్వాలెనే యుండు వరామరావతివలెన్ లంకాపురం బొప్పెడిన్. 554

వనముల్, చైత్రరథంబొ నందనమొ యన్ భాతిన్ విరాజిల్లి శో
భన సర్వర్తుల పూలతోఁ దనరఁ బైపైఁ బ్రావాల్ ద్విరేఫాలు మో
హన మొప్పన్ శ్రుతివేయఁ గొక్కిరలు నొయ్యన్ నిరుకోళ్ళున్ చరిం
ప నెమళ్ళుల్ నటియింపఁ గోయిల లికన్ పాడన్ మనోజ్ఞంబులౌ. 555

ఇటు శ్రోత్రాలకు గాత్రనేత్రముల కెందే విందు లీయన్ హుటా
హుటినించున్ గనుచున్ మెయిల్మఱచి యాయుద్యానముల్ చొచ్చి యా
ఘట్టు వీరుల్ కపు లిష్టరూపులయి పుష్పామోదముల్ గొంచు న
చ్చట సంచారము చేయ హాయిగను వీచన్ సాగె గాలుల్ గడున్. 556

వరులౌ కొందఱు వానరేంద్రులును స్వవ్రాతంబునందుండి శ్రీ
కర సుగ్రీవుని యాజ్ఞచే వెడలి లంకం జొచ్చి గర్జించి యే
డ్తెఱ మత్త ద్విప పక్షి జంతులకు భీతిన్ గూర్చుచున్ లంక ద
ద్దరిలన్ జేయుచు భూమి యుద్ధభయ భూతన్ జేసినారార్చుచున్. 557

కరి సింహాలు వరాహముల్ మహిష ఋక్షంబుల్ మృగంబుల్ భయుం
కర నాదంబులకున్ భయంబు గని వేగన్ దిక్కులం బాఱె; నం
బరమున్ దాకెడి యా త్రికూటగిరి పుష్పాలంకృతం బౌచు బం
గరురంగుల్ తగ నూఱుయామడల దీర్ఘంబై మహారోహమౌ. 558

ఏది నూఱామడ లిలఁ బొడవగచు ము
ప్పది యామడలు వెడల్పయి తనర్చె
ఎది సితాభ్రా భమై యెత్తు గోపురములఁ
బసిఁడీ ప్రహరితోడ వఱలి యుండె.
ఎది వాన కాలాన నెన్నొ మబ్బుల మిన్ను
పోలెఁ బ్రాసాదాలఁ బొలుపు నింపె
ఎన్నెది కైలాస శృంగా భమగు వేయి
స్తంభాల మేడతోఁ జదలు దాకె

ఎదియుఁ జైత్యాల దనుజేంద్రు హృదికి నగయొ
ఏది సేనల నెపుడు రక్షింపఁ బడెనొ
అట్టి వనగిరి ధాతు చిత్రమైన లంకఁ
జంతు విహగాంక నారాముఁ డంతఁగనియె. 559

అమర విభుఁడు రత్నపూర్ణముగ నొప్పి
ఘన మహాయంత్ర సకవాట గాఢమైన
లంక నాకపిబలముతో నింకఁ జూచి
ఎంతొ యాశ్చర్యమును పొందె హృదయమందు. 560

అట సుగ్రీవునితోడ నామడలు రెండౌ నాసువేలాద్రి నం
తట నారోహణ చేసి రాముఁ డచటన్ నల్దెవపు వీక్షించుచు
న్నటువౌ రీతిని నా త్రికూట శిఖరానన్ విశ్వకర్మొండె యు
త్కట చిత్రంబులఁ గూర్చి యున్నదగు లంకన్ గోపురం బారసెన్. 561

అచటఁ గపులు రాతిరి సువేలాద్రి నిలిచి
లంకలోని వనంబులు రమ్యమైన
పుష్ప సౌమ్యమై సువిశాలములును సైన
యుపవనులు చూచి యాశ్చర్య మొందినారు. 552

అలరుల్ నిండిన కర్ణికార ధవ నీపాశోక హింతాల పా
టల పున్నాగ తమాల సాల తిల కాఢ్యం బౌచు బంధూక వం
జుల ఖర్జూరక సప్త వర్ణ వకుళ సూ్ఫర్జార్జు నామ్రాది మం
జుల మౌచున్ వరనాగ మూలములతో శోభించె నుద్యానముల్. 553

అల పుష్పాంచిత రక్తకోమల లతాఢ్యం బౌచు, నుశ్యామ శా
ద్వలముల్ రాజిలఁ జిత్రమై సురభులన్ వాసించి నానావిధం
బులు పూలన్ తరులెప్డు భూషణములన్ మోదించు వల్మానవు
ల్వలెనే యుండు వరామరావతివలెన్ లంకాపురం బొప్పెడిన్. 554

వనముల్, చైత్రరథంబొ నందనమొ యన్ భాతిన్ విరాజిల్లి శో
భన సర్వర్తుల పూలతోఁ దనరఁ బైపైభ్రావాల్ ద్విరేఫాలు మో
హన మొప్పన్ శ్రుతివేయఁ గొక్కెరలు నొయ్యన్ నీరుకోళ్ళున్ చరిం
ప నెమళ్ళుల్ నటియింపఁ గోయిల లికన్ పాడన్ మనోజ్ఞంబులౌ. 555

ఇటు శ్రోత్రాలకు గాత్రనేత్రముల కెందే విందు లీయన్ హుటా
హుటిని నించున్ గనుచున్ మెయిల్ మఱచి యాయుద్యానముల్ చొచ్చి యా
ప్లగ్లు వీరుల్ కపు లిష్టరూపులయి పుష్పామోదముల్ గొంచు న
చ్చట సంచారము చేయ హాయిగను వీచన్ సాగె గాలుల్ గడున్. 556

వరులౌ కొందఱు వానరేంద్రులును స్వాతంబునందుండి శ్రీ
కర సుగ్రీవుని యాజ్ఞచే వెడలి లంకం జొచ్చి గర్జించి యే
డ్తెఱ మత్త ద్విప పక్షి జంతులకు భీతిన్ గూర్చుచున్ లంక ద
ద్దరిలన్ జేయుచు భూమి యుద్ధభయ భూతన్ జేసినారార్చుచున్. 557

కరి సింహాలు వరాహముల్ మహిష ఋక్షంబుల్ మృగంబుల్ భయం
కర నాదంబులకున్ భయంబు గని వేగన్ దిక్కులం బాఱె; నం
బరమున్ దాకెడి యా త్రికూటగిరి పుష్పాలంకృతం బౌచు బం
గరురంగుల్ తగ నూఱుయామడల దీర్ఘంబై మహారోహమై. 558

ఏది నూఱామడ లిలఁ బొడవగుచు ము
ప్పది యామడలు వెడల్పయి తనర్చె
ఏది సితాభ్రా భమై యెత్తు గోపురములఁ
బసిఁడి ప్రహరితోడ వఱలి యుండె.
ఏది వాన కాలాన నెన్నొ మబ్బుల మిన్ను
పోలెఁ బ్రాసాదాలఁ బొలుపు నింపె
ఎయ్యది కైలాస శృంగా భమగు వేయి
స్తంభాల మేడతోఁ జదలు దాకె

ఎదియుఁ జైత్యాల దనుజేంద్రు హృదికి నగయొ
ఏది సేనల నెపుడు రక్షింపఁ బడెనొ
అట్టి వనగిరి ధాతు చిత్రమైన లంకఁ
జంతు విహగాంక నారామ్ముఁ డంతఁగనియె. 559

అమర విభుఁడు రత్నపూర్ణముగ నొప్పి
ఘన మహాయంత్ర సకవాట గాఢమైన
లంక నాకపిబలముతో నింకఁ జూచి
ఎంతొ యాశ్చర్యమును పొందె హృదయమందు. 560

అట సుగ్రీవునితోడ నామడలు రెండౌ నాసువేలాద్రి నం
తట నారోహణ చేసి రాముఁ డచటన్ నల్దెసఁపు వీక్షించుచు
స్ఫుటమౌ రీతిని నా త్రికూట శిఖరానన్ విశ్వకర్మొండె యు
త్కట చిత్రంబులఁ గూర్చి యున్నదగు లంకన్ గోపురం బారసెన్. 561

అచటన్ గోపుర శృంగమధ్యను సితంబౌచామరల్ వేయు ము
చ్చటగా ఛత్రము క్రిందరత్నములు భూషల్ దాల్చి నెమ్మేని సం
తటఁ దావీనెడు రక్తచందనపుఁ బూతల్ మీఱ, బంగారు ము
చ్చటిదౌ చాందిని నొప్పు నీలజలచ్ఛాయున్ గనెన్ రావణున్. 562

ప్రథితైరావత దంతపున్ శిఖల దెబ్బన్ గాయలుం గాచు నా
హృదియున్ కుందెలు నెత్తువంటి వసనం బేపార సంధ్యా తపో
న్మద మేఘంబటులున్న రావణు నదేధ్యానంబుగాఁ జూచి నె
మ్మది, సుగ్రీవుఁడు వెంటనే యెగిరె రామామ్యద్భుతుల్ చూడఁగా. 563

అటు వేగంబున క్రోధ సత్త్వముల సామర్థ్యంబుచే నప్డె యు
త్కట శైలంబున నుండి గోపుర తలిన్ ధైర్యాన సుగ్రీవుఁ డు
ద్భట శౌర్యంబున నిర్భయుం డయి మహార్తంబటన్ చూచి యు
ద్భట నారావణు ధిక్కరించి పరుషత్వం బొప్పఁగా నిట్లనెన్. 564

"జగతీ నాథుఁడ యైన రాముసఖుఁడన్ స్వైరంబు దాసుండనై
తిఁ గదా యామనుజేంద్రు తేజమున ముక్తిన్ నీవు నన్నుండి పోం
దఁగ లేవంచును బల్కి వేయెగిరి యాదైత్యేశు వేపట్టి వే
గఁ గిరీటంబును లాగి క్రిందను బడంగా వైచి దూకెన్ భువిన్. 565

ఇఁక నట్టుల్ పయిఁబడ్డ వానరపతిన్ వీక్షించి యారావణుం
డు కడున్ గోపముతోడఁ బల్కె నిట నెట్లో దాగి సుగ్రీవుఁడా
దు, కనుం గొన్మిదె నీవు గ్రీవ పడనిందున్ గాంతు వట్లంచు న
ట్టికపీశున్ భుజశక్తిఁ గూల్పఁగపి యుటే బంతి లాగున్వపై. 566

వడిగా దూకి భుజాల రావణుఁడిలన్ వ్రాలన్ పడన్ లాగె న
ప్పుడు వారొండొరు చెమ్మటన్ దడియుచుం బోరాడి రక్తంబులన్
దడియౌ మేనుల తోడఁ గొట్టుకొనుచుండన్ బూరుగున్ మోదుగున్
విడుపూలన్ దగినట్టు లొప్పి రట వేవేపోరి నిశ్చేష్టులై. 567

అటు లారాక్షస వానరాధిపతు లన్యోన్యంబు గుప్పిళ్ళతో
నటనే గ్రుద్దుచుఁ గేల గొట్టుచును నిట్టల్లెంతొ మోచేతులన్
పటుతన్ బొడ్చుచు గోళ్ళగీఱుచుఁ గడున్ బై పైపడం ద్రోసి యె
క్కటి యుద్ధంబున వేదిగోపురత లాగ్రాంతస్థు లై రయ్యెడన్. 568

ఒక రొక్కం డ్రుడు పరస్పరంబు పృథుబాహుల్ చుట్టి పై కెత్తి వం
చి కడున్ మేనులు పట్టి కొట్టుకొని చెంజేలాగుచున్ కోటగో
డకు నాక్రిందియగడ్తకున్ నడుమ నేలం గూలియున్ లేచి, నే
లకు నేమంటక యూర్చి గ్రుచ్చి చెయిత్రాళ్ళం గట్టుకొం ద్రొండొరుల్. 569

పులి సింహా లటు నేస్తు గున్నలటులన్ బోరాడుచున్ పెక్కు భం
గుల సంరంభముతోడ శిక్ష బల వేగోత్సాహముల్ పొంది మి
క్కిలి వక్షంబుల గ్రుమ్మి నేల పడుచున్ క్రేళ్ళుబ్బి యొక్కుమ్మడిన్
పలుమార్గంబులఁ గొట్టుకొంచుఁ బడుచున్ బల్ తిట్టుకొం ద్రొంటొరుల్. 570

వ్యాయామ శిక్ష బలముల
నాయత్తు లగుచు మదద్విపాభులునై మ
త్తాయత గజబాహుల వా
రాయెడ శ్రమలేకపోరి లఖిలవిధాలన్. 571

అటు లన్యోన్యము పోరు సల్పుచును నన్యోన్యంబు బాధించుచున్
అట మార్జారము లట్లు మాటికిని సందుం దప్పుడే నిల్చి యు
త్కట చిత్రంబుగ మండలంబున వేగ గోమూత్రికాకారులై
పటు శౌర్యంబున పోరు సల్పిరట లావంతేనియున్ తగ్గకే. 572

అడ్డముగ వంకరగను పోరాడుచుండి
పట్టు విడుపులతోడ దెబ్బలను బాది
ఎదురుకొని వంగి దరిగ్రుచ్చి యొడమకేగె.
తిరిగి తప్పించి గుప్పించి తిరిగి రనిని. 573

క్రమత సంచారము విహార సంరంభములను
యుద్ధ మార్గ వైశారద్య మొప్పవారు
చేతులను జాపి యొండొరు చేరిపోరి
రావిధముగను సుగ్రీవుండు రావణుండు. 574

ఇంతలో రావణుఁడు సోలి యంత మాయ
బలము చూప సాగెను నది తెలిసి వాన
రాధిపుఁడు నాకసంబున కతిగ నెగిరి
క్లాంతిలేకయు నిలిచెఁ బరాక్రమమున. 575

ఇఁక సుగ్రీవుఁ డరుదెంచు టెంచిలోన
వంచితు డయి రావణుఁ డుండ, భానుసుతుఁ డు
రాక్షసేశు సోలించియుఁ బ్రథిత యశము
పరల మింటిపై కెగురుచు తిరిగె సచట. 576

ఇటుల సుగ్రీవుఁ డంతట నెంతొ పోరి
వాయు వేగాన ముదముతో వడిగ నపుడు
రామునికి హర్షమును గూర్చ ప్రథిత కపులు
మెచ్చుచుండ వానరమధ్య వచ్చి నిలిచె. 577

అట సుగ్రీవుని మేనఁ గల్గ రణచిహ్నంబుల్ విలోకించి పి
మ్మట సుగ్రీవుని గౌఁగిలించుకొని ప్రేమన్ జూచి రాముండనెన్
ఇట నాతోడుత సంప్రదింపకయె యిట్లే సాహసంబున్ పొన
ర్చుట యుక్తం బొకొ, సాహసంపుఁ బను లెట్లున్ చేయు రుర్వీపతుల్.
578

ఇటు నన్నున్ బలమున్ విభీషణుని నీసంశయాంభోధిలో
నిటులన్ గూలిచి సాహస ప్రియుః యొనర్తే సాహసం బీగతిన్
ఇటు లింకెప్పుడు గాని సాహసికమౌ కృత్యంబు చింతింపకి
విటు గావించియు నాకుఁ గష్టమును గావిం పంగఁబో కోసఖా. 579

ఎదియేన్ నీకిట సంభవించు నెడ నాకిసీతతోఁ గాని యిం
కఁ దగం గూరుచు తమ్ముఁ డాభరతుతోఁ గానీ స్వసౌమిత్రితో
తుది శత్రుఘ్నితోడఁగాని మది నాతోఁగాని నాకేమి యుం
డదు కార్యంబు, మహాభుజా ! తెలిసికో నాయాశయం బిట్టులన్. 580

—: రాముడు లక్ష్మణుని కపశకునములు చూపుట :—

అట నారావణుఁ బుత్రమిత్ర కుల సైన్యాంగాది యుక్తంబుగా
నటులన్ జంపి విభీషణున్ భరతు రాజ్యాలన్ నిన్త్యాగించి చ
చ్చుటె యుక్తం బని నీవు రానిత్రిత మిచ్చో నీదువీర్యం బెఱుం
గుట యైనప్పుడు నిట్లి చేయుటకుఁ జేకొంటిన్ నిశ్చయం బాత్మలో. 581

అని రాముండు వచించు నర్థవచనం బాలించి సుగ్రీవుఁ డి
ట్లనియెన్ నీదగు భార్య దొంగిలిన పాపాత్మున్ ఖలున్ రావణున్
గని రామా! యిట నావరాక్రమ మెఱుంగం గల్గునే నెట్టు లా
తని సైవంగల నంచుఁ బల్కఁ విని యాత్మన్ మెచ్చుచున్ రాముఁడున్. 582

ఇటు లక్ష్మీయుతు లక్ష్మణుం బలికె, నీవీశీతలాంబుల్ ఫలాలెందు మి
క్కుటమౌ, నట్టి ప్రదేశ మెంచి బలముల్ కూడన్ విభాగించి యుం
తటి వ్యూహంబులు గూర్చి యుంద మిటఁ జెంతన్ లక్ష్మణా! చూడు మి
చ్చట నీలంకను నెట్టి భీతి కరదృశ్యంబుల్కడున్ దోఁచెనో. 583

ఇఁక లోకక్షయమౌనా యంచుఁ దలఁతున్ వీక్షింపుమీ యొల్లుగా
డ్లు కపుల్ రాక్షసులున్ మృతిన్ గనెదరో లోకాలు భీతింగనున్
వికటంబై పవనాలువీచు ధర కంపించున్ నగాగ్రాలు వ్రీ
లి కడున్ గంపము చెందుఁ గూలిపడు నీవృక్షంబు లత్యంతమున్. 584

పరుషాభ్రంబులు డేగలట్టులు కడున్ పారుష్య మేపార భీ
కర శబ్దంబులు చేసి నీరయుత రక్తంబుల్ ప్రవర్షించు నె
త్తురు గంధంబటు దారుణం బగుచు నెంతో సంధ్య వెల్గున్ దివా
కరు బింబంబున నుండి యగ్నులివె యుగ్రం బౌచు ధాత్రింబడున్. 585

అశుభంబై పలునక్కలర్కు మొగమై యత్యంతమౌ భీతి నల్
దిశలన్ గూర్చుచు దీనమౌచుఁ గరుణార్తిన్ బిట్టుగా నార్చెడిన్
శశి యీరాతిరి నప్రకాశుఁ డయి కృష్ణాంశుల్ సురక్తాంశువుల్
వెసఁ బర్యంతములన్ వెలుంగ కడుఁ బర్వెత్తున్ లయాసం బలెన్. 586

అర్కు పరివేష మది పొట్టి దగుచు, నెఱ్ఱ
నగుచు, రూక్ష్మమై యశుభమై యరయఁ బడియె
మఱియు సూర్యులో నల్లని మచ్చ తోఁచె
సరిగ మింట నక్షత్రముల్ మెఱయ విపుడు. 587

లక్ష్మణా! యుగాంతము వచ్చు లాగు తోచె
కాకులును డేగపక్కులు గ్రద్దలెల్లఁ
గ్రింద దిరుగుచు నశుభమై రెచ్చియుఱచె
ఎదురు కొందము రావణుం డేలుపురిని. 588

అని యాలక్ష్మణుతోడ రాముఁ డని ధర్మాత్ముండు శీఘ్రంబుగా
ఘన శైలాగ్రమునుండి క్రిందదిగి యుగ్రంబై యెదుర్కోఁగఁ జా
లని యాత్మీయ బలంబు చూచి కాలవిదుఁడై యవ్వేళ సుగ్రీవుతో
డన్ను నావానరసేన నంత బురికొల్పం జొచ్చె నాలంకపై. 589

కడు సుగ్రీవ విభీషణుల్ హనుమ ఋక్షాధీశుఁడౌ జాంబవం
తుఁడు నీలుండు నలుండు లక్ష్మణుఁడు తోడ్తోరాఁగ శీఘ్రంబ రా
ముఁడు నావానర ఋక్ష సైన్యములతో భూమిన్ సమస్తంబు న
య్యెడలన్ గప్పుచు ముందు ముందుచనె శౌర్యంబున్‌బలంబెచ్చగా. 590

అటు లారాముఁడు చాలసేపునకు నారామాలు నెత్తినవౌ
పటు ప్రాకారము తోరణంబులను దుష్ప్రాపంబయై దేవ దు
ర్ఘటమౌ లంకను జొచ్చి లక్ష్మణునితో లంకన్ విరాజిల్లు న
చ్చటి యాయుత్తర దిక్కు ద్వారమున రక్షన్ జేసె స్వానీకమున్. 591

అటనే సాయుధసైన్యముల్ వరుణుచే నంబోధులట్టుల్ మహో
ద్భటుఁడౌ రావణుచేత గుప్తమగుటన్ బాతాళ మట్టుల్ భయో
త్కటమౌ నుత్తర దిక్కు ద్వారముననే దైత్యేశుఁడౌ రావణుం
డటలుండై నిలుచుండ రాముఁడును తానై నిల్చె నద్రింబలెన్. 592

తూరుపు ద్వారానఁ జేరి నీలుఁడపుడు
ద్వివిద మైందులతోడ వేగ నిలిచె
దక్షిణ ద్వారానఁ దానంగదుఁడు గజ
గవయ ర్షభ గవాక్ష కపుల నిలిపె
పశ్చిమ ద్వారాన బలియుండు హనుమంతుఁ
డల ప్రమాథి ప్రఘసాదులను నిల్పె
మధ్యమ ద్వారాన మసల సుగ్రీవుడు
గరుడిఁ బోల్ కపివరుల్ వఱలియుండ్రు

ముప్పదారు కోటులమంది ముఖ్య కపులు
ఘనుఁడు సుగ్రీవుఁ డున్న చోటలనునిచి
లక్ష్మణ విభీషణులు నిల్వ రాము నాజ్ఞ
నమరిరి కపుల్ ప్రతి ద్వారమందుఁ గోటి. 593

రామునికిఁ బడమర మధ్యభూమి యందు
పరఁగె సుగ్రీవుఁ డాజాంబవంతుతోడ
ఆకపివ్యాఘ్రములు మహావ్యాఘ్రము లటు
తరు గిరి శిఖరాల నెలమివఱలి రనికి. 594

అందఱు తోకల నెత్తిరి
అందఱకు నఖములు దంష్ట్రి లాయుధములమౌ
అందఱు వికృత వివిధతను
అందఱకు విచిత్రముఖము లమరియె యుండున్. 595

కొందఱు దశ నాగబలులు
కొందఱు శతనాగబలులు కొంద ఱమేయుల్
కొంద ఱిభ దశ శతబలులు
కొంద ఱమోఘబలులు శతగుణితులు నొకరుల్. 596

వారి సమాగమ మిట్టులె
చేరెను నాశ్చర్యముగ విచిత్రముగాఁగన్
వా రాసైన్యంబులతో
మీరి రట మిడతల దండ్లు మీఱిన యట్టుల్. 597

చేరిన, చేరుచు నుండిన
శూరులు వానరులచేతఁ జోద్యము గాఁగన్
ధారుణి కప్పం బడియెను
మీఱెను సర్వంపు మిన్నె మిగులని యిట్టుల్. 598

నూఱు లక్షలమంది యావీరకపులు
ఋక్ష లనికినా ద్వారము లెనసినారు
నిఖిల కపులతో నాగిరి నిండిపోయె
వేయి లక్షలు కపు లట్టి వీడు గనిరి. 599

తరులచేతఁ బట్టిన కపివరులతోడ
లంక యింక గాలి చొరరాని లాగు తనరె
మబ్బువంటి యింద్రునివంటి మహిమఁ గపులు
నడ్డఁగా దైత్యు లాశ్చర్య మందినారు. 600

కట్టతెగిన సముద్రమువోలె నెట్టయెదురు
పడిన సైన్యఘోష మట మహాధ్వను లొనర్చె
ఆమహా ఘోషఁ బ్రాకార మేమి తోర
ణాద్రి వనుశోభ వణంక వణంకె లంక. 601

రామలక్ష్మణ సుగ్రీవ రక్షిత మయి
బలము సురలకుఁ గూడ దుర్వార మయ్యె
రాముఁ డసుర వధ కయి బలంబు పన్ని
క్షణము క్షణము మంత్రులతోడ సంప్రదించె. 602

నేర్మిఁ దరువాతి కృత్యంబు నిశ్చయించి
పరుస యోగ మర్థముల తత్త్వముల నెఱిఁగి
ఆవిభీషణు సమ్మతి నధిపుధర్మ
మెంచుచును యంగదు నట రావించి యనియె. 603

వెడలి సౌమ్య! ప్రాకారమున్ వడిగ దాటి
నీవు శ్రమలేక లంకలో నిర్భయముగ
నాదు మాటగ నాదశాననునితోడ
నీవిధముగఁ గపివర! వచింపు మిపుడు.

"భ్రష్టలక్ష్మీక! మరణేచ్ఛ! నష్టవిభవ!
నష్టచేతన! దేవ గంధర్వ ఋషుల
కప్సరో నాగ యక్షుల కధిపతులకు
మోహమున దర్పమునఁ జెడ్డ పొనరిచితివి. 605

తథ్యముగ నేఁడు విధివర దాన జన్య
మైన నీదర్ప మిప్పుడె యణగె లెమ్ము
నిన్ను మత్ప్రియాపహరు దండించు నల్క
దండ మూని యుంటిని లంక ద్వారమందు. 606

అసుర! నాచే హతుండవై యరిగె దీప్త
త్రిదశ రాజ ఋషి మహర్షి పదవి కిపుడు
ఏబలముచేత మాయచే నిట్టి నన్ను
కాన కంపి సీత గొనితో దానిఁ జూపు. 617

నాదు వాడియైనట్టి బాణములలోక
మిప్పుడె యరాక్షసముగఁ గావించివైతు
నయుత సీత నర్పించియు నాదు శరణు
నంద కుంటి వేనియు రాక్షసాధముండ. 618

విను ధర్మాత్ముండు విభీ
షణుఁడుదనుజవరుఁడు నాదుశరణును పొందెన్
కని శ్రీమంతుఁడు ముఖ్యుం
డని లంకైశ్వర్యము ధ్రువ మందెను జుమ్మీ. 619

ధర్మ హీనుఁడు మూర్ఖ మిత్రంబు పాపి
యువిది తాత్ముఁడౌ నీచేత నఖిలరాజ్య
మొక్క త్రుటియైన ననుభవ మొందఁ బడుట
యయ్యు దిటశక్యమే కాద యవనిలోన. 610

ధృతితో శౌర్యము నాశ్రయించి యిఁక నీవే పోరు, కాదేనిన్
ద్రుతి బాణంబుల చేతఁ జచ్చియుఁ బవిత్రుండె పోదువే
గతియుం గానియెడన్ త్రిలోకిని విహంగంబై వడిన్ జొచ్చుమీ
స్థితి నాకన్నులఁ బడ్డ క్రూరుఁడవు నీజీవాలతోఁ బోదువే. 611

హితమౌ వాక్యము చెప్పెదన్ జలుపు కోయీ వింక శ్రాద్ధంబ స
న్మతి; లంకన్ గనుగొమ్ము నీదు బ్రదుకో నామీఁద నాధారమొం
ది తసర్చున్ జుమియుంచు నెవ్వరిని బాధింపగ లేనట్టి స
న్మతి రాముండు వచింప నంగదుఁడు మూర్తాగ్నిం బలెన్ బైఁజనెన్. 612

అతి వేగంబుగ నంత శ్రీసహితుఁడౌ నాయంగదుం డేగి దు
ర్మతియౌ రావణు మందిరంబు చనియుగ్రాగ్నింబలెన్ నిల్చి మం
త్రి తతిం గూడిన రావణాసురునితోఁ దిన్నంగ తన్గూర్చి యు
ద్ధృతి విన్పించెను కష్టపెట్టని మహాధీశాలి రామోక్తులన్. 613

ఎవరిఁ గష్టపెట్టని కోసలేశ్వరుండు
రాము దూత వాలి సుతుండ నంగదుఁడను
ఈవునను గూర్చి వినియుందు విట్లుచూడు
అనియె రాముఁడు కౌసల్యయనుఁగు సుతుఁడు. 614

"ఎగిరి యెదిరింపు పురుషుఁడ వగుము క్రూర!
జ్ఞాతి సుత మంత్రి బాంధవ సహితముగను
నిన్నుఁ జంపెద, నినుజంప నిఖిలజగము
లార్తి లేనిపై యానంద మందఁగలవు. 615

ఎఱిఁగి మన్నించి సీత నర్పింపవేని
దైవదానవ యక్ష గంధర్వ ఋషుల
కెపుడు కంటక మగు నిన్ వధించి వైతు
చచ్చితివ, విభీషణుఁడె యైశ్వర్య మొందు". 616

అని పరుషంబుగా నపుడె యంగదుఁడున్ వచియింపఁ జూచి రా
వణు డతికోప మొంది సచివాదులతోడుత నిట్టి దుర్మతిన్
గొని వధియింపుఁ డంచు ననఁగ్రూరులు వహ్నిసమౌజులైనయా
దనుజులు నల్వు రంగదుని తత్క్షణమే గ్రహియింప గోరగా. 617

తన బలము దెల్ప లొంగి యాదనుజవరుల
పక్షు లటు బాహువులఁ బట్టి పర్వతమ్ము
వంటి ప్రాసాద శిఖరాన వడిగ నెగిరి
వారి నందఱఁ బడవేయఁ బడిరి క్రింద. 618

అపల నింద్రుఁడు హిమశృంగ మట్టు లెత్తు
వఱలు ప్రాసాద శృంగంబు భగ్నపఱచి
రావణుఁడు చూడ తనపేరు ప్రకట పఱచి
మింటి కెగిరి దైత్యులఁ గూల్చి మించి యార్చె. 619

కపులు సంతసింపఁగ వేగ కపుల మధ్య
రాముదరికి వచ్చి నిలువ; రావణుండు
తనదు నాశంబు తప్పదా యనుచు మిగుల
అనుచు నిట్టూర్చి నిశ్చేష్టు డయ్యె నపుడు. 620

వ. అంత రాముఁడు ఉత్సాహమున నుప్పొంగి హర్షించి గర్జించు వానరులఁ గూడి, యుద్ధంబునకు సిద్ధము కాఁగా గిరికూటముపంటి మహావీరుఁడు నుషేణుఁడు కామరూపు లగు వానరులతో సుగ్రీవుని మాట ననుసరించి చంద్రుఁడు నక్షత్రములందువలె నాలుగు ద్వారంబులందు దుర్ధర్షుఁడయి సంచరించె. పెదవ సాగరంబువలె లంకాపురము నెదుర్కొను వానరులు శతాక్షౌహిణులం జూచి మఱికొందఱు రాక్షసులు విస్మయ త్రాసంబులకు లోనయి సమరంబునకును దుర్ధర్షులై సిద్ధపడిరి. అపుడా ప్రాకార పరిఖలకును మధ్యభాగమంతయు కపులచే వ్యాప్తమయి పోవ మఱికొందఱు హాహాకారంబు చేయు కొందఱు రాక్షసులుభయ మోహితులై రాక్షస రాజధాని యందు బయలుదేఱిన కోలాహలము గూచి మహాయుధంబులు గైకొని ప్రళయకాల భీకరవాతములువలె సంచారములు చేసిరి. 621

ఇంక రాక్షసుల్ రావణు గృహము చేరి
రాము సేనల నగరి యాక్రమణ తెలుప
విని యలిగి పుర రక్షణ ద్విగుణముగను
చేసి ప్రాసాద మెక్కి వీక్షించె నెల్ల. 622

లెక్కలేని కపుల నెదిరింపఁ గోరి
అటవులను కొండలు వనము లాక్రమింప
భూమిఁ గబళింప నెటిఁగియు నెటులఁ గపులఁ
జంపవలెనొ రావణుఁ డెంచె సరగ నపుడు. 623

అటు చింతించుచు ధైర్య మొంది కపిసైన్యంబుల్ కనుల్ విప్పి యుం
తట వీక్షించెను; రాముఁడున్ తనదు సేనాంభోధితోఁ గూడి మి
క్కుట మౌ సంతస మంది యున్నతపు శృంగోద్దేశమున్ జేరి యు
త్కటమౌ కేతుల మీఱు లంక గని సీతం జెందు చిత్తంబుతో. 624

ఇపు డాబాల మృగాక్షి సీత కృశయై యీనాకు సైచింతచే
విపులార్తిం గని వట్టినేలపయి నే పీడన్ గడున్ జెంది నో
లి వరుండుంగదె యంచు బాధపడు నారిన్ సీతఁ జింతించుచున్
అపుడా ధార్మికుఁ డైన రాముఁ డరిసంహారంబు గావింపఁగన్. 625

కపి సైన్యంబుల కాజ్ఞ యీఁడు నెవరిన్ గష్టంబులం బెట్ట ని
ష్టపడం జాలని రాము నాజ్ఞగొనుచున్ సంఘర్షణల్ చేయ యూ
ధపులౌ వీరులు సింహనాదములు పెద్దం జేసి శృంగాల లం
కపురిన్ ముష్టుల తోడఁ జిమ్ముదముగాకంచున్ మదిన్ బూన్కితో. 626

గిరి శృంగంబుల బండఱాళ్ళఁ దరులన్ కెంగేలులం బీకి, రె
క్కిరి లంకాపురి కెక్కి రాకపివరుల్ దీక్షన్ వడిందూకి; రా
క్షురి నాశం బొనరించి రాముని యభీష్టార్థంబుకై హెచ్చి ర
త్తఱి వేర్వేరు బలాల రావణుఁడు వర్త్రాలెత్తి వీక్షింపఁగా. 627

ఎఱ్ఱని ముఖములన్ హేమంపు మేనులఁ
దగు కపుల్ పెన్ఱాళ్ళు తరులు విసరి
తరులతో గిరులతో స్థిరముష్టి వితతితో
ప్రాకార తోరణాలను మథించి

స్వచ్ఛనీరము లొప్పు నన్ని కందకముల
ధూళి రాళ్ళఁ దృణకాష్ఠాల నింపి
వేలు లక్షలు కోట్లు వీరవానరవరుల్
లంకలోఁ జెనుగోపురాలు విఱిచి

మదపు టేన్గులఁ బోలి సింహములఁ బోలి
ఎగిరి దూకి గర్జించి మథించి కొట్టి
లంకలోనికిఁ బర్వె త్తి బింకమడర
చేరి మీరి భీభత్సముల్ చేసినారు. 628

జై జై రఘు రామునికిన్
జై జై యాలక్ష్మణునికి శౌర్యాఢ్యునికిన్
జై జై వానర బలతే
జోజవునకు రామగుప్త సుగ్రీవునికిన్. 629

అని గోషించుచు గర్జనల్ సలిపి తామాలంక ప్రాకారమున్
ఘన శౌర్యంబునఁ గామరూపు లయివీఁకన్ వానరుల్ మించఁ గ
న్గొని యూథేశులు వీరబాహువు నలుండున్ తత్సుబాహుండు క్ర
న్ననఁ బ్రాకారతటోపరిష్ఠులయి రంతన్ బ్రీల్చి ప్రాకారమున్. 630

వ. ఇంతలో తక్కిన ప్రముఖవానరులు సత్వరంబుగ సేనాశిబిరంబులు
నిర్మించిరి. 631

పదికోట్ల కపు లొప్పు ప్రాగ్ద్వారగతుఁ గుము
దుని ప్రఘసవనసు లనుసరించి
రిరువది కోట్లున్న వరదక్షిణ ద్వార
మున వీరశతవలి ఘనతఁ గాచు

అరువది కోట్లుండు నాపశ్చిమద్వార
    మున సుషేణుఁడు తారజనకుఁ డుండె
సుగ్రీవ లక్ష్మణు లుగ్రులతో రాముఁ
    డుత్తరద్వారాన నుండి కాచె.

రాముఁ గోటి గోలాంగుల రాజి దరియు
నతి మహాకాయుఁ డయిన గవాక్షుఁ డుండె
భీమ బలులు ఋక్షులు కోటి వెడల రిపులఁ
జంపు ధూమ్రుఁడు రాము పార్శ్వమున నిలిచె. 622

గద చేఁబూని విభీషణుండు సచివుల్ గర్జింప నేతెంచె నా
యుదనన్ వీరులు గంధమాదన గవాక్షాదుల్ గజుఁడున్ మహో
న్మదుడౌ నాశరభుండు నాగపయుఁడున్ మాద్యద్ద్విపాలట్టు లు
న్మదులై వానరసేనఁ గాచిరి తమంతన్ వేగఁ పర్వెత్తుచున్. 623

అంతన్ గ్రోధము రేప రావణుఁడు-సైన్యంబుల్ వడిందాకి యా
హవముం-జేయఁగ నాజ్ఞయిచ్చె నది తామాలించి పల్రాక్షసుల్
జవమొప్పన్ భయపెట్టు ఘోషము దివిన్ మార్మోగ ఘోషించి రా
రవముల్ చేసెను స్వర్ణదండ హత చంద్రశ్వేత భేరుల్ కడున్. 624

ఘోరరాక్షసు లూదనూఋలు వేలుగా
    శంఖాలు ధ్వనిచేయఁ జదలు నిండు
భూషల శోభిల్లి ఘోషించు దైత్యాళి
    విద్యుద్బలాకాభ్ర వితతిఁ బోలు
రావణ చోదితోగ్రబలంబు లుప్పొంగి
    ప్రళయ పూర్ణాబ్ధుల వడిని మించు
వానరసైన్యాల ధ్వనులు మార్మోయుచు
    నాగుహాతట మలయాద్రి నింపు

శంఖదుందుభి ఘోషముల్ శక్తియుతుల
సింహనాదాలు దివిభువిఁ జెలగె జలధి
ఏనుగుల ఘీంకృతులు హయ హేషితములు
దనుజ కరవాల రథనేమి నినదమేచ్చె.

ఇంతలో దైత్యులకు వానరేంద్రులకును
ఘోర సంగ్రామ మయ్యది మీఱి జరగె
కరము పరశుశూలాస్త్రల గదలతోడ
తమదు పేరంచుఁ గపుల దైత్యాళి కూల్చె.

జై జై సుగ్రీవునికిని
జై జై రాజః యని పేరుసరిగఁ బలికి వృ
ధ్వీజంబుల నఖ దంష్ట్రల
చే జవముగ నొంచిరి దనుజేంద్రుల గపులున్.

మఱి కొందఱు దైత్యులు భీ
కరులై ప్రాకారమందుఁ గదలుచు నేలన్
తిరుగు కపుల శూలములన్
గరవాలంబుల గదలను కడు నొంచిరనిన్.

ఇంకఁ గపులును కోపాన బింక మకర
నేలనిల్చి ప్రాకారాల ప్రాలు రాక్ష
సుల నెగిరి వడ వైచి రిట్టులను నొడ్ల
అద్భుతము మాంస రక్తార్ద్రమై యాజియయ్యె.

వ. అట్లు మహాబలులయిన రాక్షసులు పరస్పరముపోరుచుండ యుద్ధవ బలముతోడను క్రోధముతోడను మిక్కిలి దారుణమయ్యె. బంగారు శిఖలుగ గుఱ్ఱంబులతోడను అగ్నిశిఖలవంటి ధ్వజములతోడ సూర్యులవంటి కవచము తోడను రాక్షస శార్దూలములు పదిదిక్కులను ప్రతిధ్వనింప జేయుచు రామ

నికి జయంబుగోరి భీమకర్ములై బలులుదేరిరి వానరసేనకూడ గొప్పదై జయంబుకోరి కామరూపులైన రాక్షసులవైపు పరులిడె. ఇంతలో ఒండొరుల వైపు పరువిడు వానరరాక్షసులకు ద్వంద్వయుద్ధము ప్రవర్తిల్లెను. 640

భవుఁడు యమునిబోలె వాలికుమారుఁ డం
గదుఁ డింద్రజిత్తును సెమరుకొనియె
వీరుండు సంపాతి పోరె ప్రచంఘుతో
హనుమయో జంబుమాలిని సెదిర్చె
క్రుద్ధుఁడయి విభీషణు డిద్ధవేగుం డగు
మిత్రఘ్నుతోఁ బోరి మేటియయ్యె
విపుల బలగజుండు తపసుతో పోరెను
నీలుండును నికుంభు నోలిఁ గలిసె.

ప్రఘసుతోడ సుగ్రీవుఁడు రణము చేసె
శ్రీక్షముఁడు లక్ష్మణుఁడు విరూపాక్షుఁ గొట్టె
యజ్ఞకోప సుప్తఘ్నులు నధికబలులు
రశ్మి కేత్వగ్ని కేతులు రాముఁ గనిరి. 641

ఘనఘోర వజ్రముష్టిని మైందుఁ డెదిరించె
దివి నశని ప్రభు ద్వివిదుఁ డెదిరె
వీరప్రతపనుండు ఘోరరాక్షసుఁ డేగి
తీవ్ర వేగు నలు సెదిర్చె మిగుల
కడు ధర్మ సుత సుషేణుఁడును విద్యున్మాలి
తోడుత రణముకై కూడఁబడియె
ఇతర భీకర దైత్యులెల్లర తోడుత
తగు కపుల్ ద్వంద్వ యుద్ధంబుగొనిరి

తనువు ఝల్లన ద్వంద్వయుద్ధాలు జరిగె
పోరిరి దనుజ వానరుల్ కోరి జయము
ఒరు లొరుల మేనినుండియుఁ గురుల తృణము
గాత్ర కాష్ఠాలు నెత్తుటి కాల్వ లడరె. 642

ఇంద్రుఁ డావజ్రమునఁబోలె నింద్రజిత్తు
బలముఁజీల్చ నంగదుఁగొట్టెఁ బరిఘచేత
హైమ చిత్రాంగమగు వాని స్యందనమును
అశ్వముల సూతు నంగదుం డడరికొట్టె. 643

శరముల్ మూఁడిటిచే ప్రజంఘుఁడు వెసన్ సంపాతినిం గొట్టె వా
విరి సంపాతియు నశ్వకర్ణ తరుచే వేసెన్ ప్రజంఘున్ పడిన్
అరదంబెక్కిన జంబుమాలి వరశక్త్యస్త్రాన వక్షాన వా
విరి వేయన్ హనుమంతుడా రథముతో ఛేదించె వానిన్ పడిన్. 644

నలుపైకిన్ యాప్రతపనుం డస్త్రాలు వేయంగ నా
నలుడున్ రెచ్చియు వానికన్నులను భగ్నంబున్ పొనర్చెన్ వడిన్
బలమున్ మ్రింగెడునట్లుగా ప్రఘసుఁ డున్ శైలంబ రాజూచి అ
వ్వల సుగ్రీవుఁడు సప్తపర్ణతరుచే భంజించి కొట్టెన్ త్రుటిన్. 64

అలసుప్తఘ్నుడు యజ్ఞకోపుడుఁ గరంబాయగ్ని కేతుండు పెన్
ఖలుడై మించిన రశ్మికేతువును వేగన్నిరాముంబై కొనన్
నలు శీర్షంబులు నూడిపో నలుగురన్ నాల్గొసితాస్త్రాల న
గ్నుల జ్వాలల్వలె వేసి రాముఁడును నెంతో మించె శౌర్యంబునన్. 64

పిడికింటి మైందుడు పొడువ రథాశ్వాలు
పడ బురుజులాపడి వజ్రముష్టి
నీలాంజనముఁబోలు నీలున్ నికుంభుడు
రవి మబ్బునటు కరాస్త్రములఁ ద్రోసె

మఱియు శతాస్త్రాలఁ గకరలాఘవంబున
నీలున్ నికుంభుడే తోలినవ్వె

అటు విష్ణువటు నీలుడతని రథాంగాన
రాల్చె నికుంభు సారథి శిరస్సు.

పిడుగు వజ్రాలవంటి ద్వివిదు డసురులు
కనఁగ నశని కొంతుగిరిశృంగమునఁ గొట్ట
నశని సమబాణముల గొట్టెనశని కొంతు
డలరి ద్వివిదుఁడో తద్రథాశ్వములఁ గూల్చె. 647

తఱుమ విద్యున్మాలి రథమెక్కియు సుషేణుఁ
బసిడి యమ్ములఁ గొట్టి వడిగ నార్చె

రథికు విద్యున్మాలి రథమున సుషేణుడు
గిరిశృంగమున వేగ ధరనుగూల్చె

అంత విద్యున్మాలి యతిలాఘవంబున
దప్పుకొని గదతో ధరణి నిలిచె

పిదప క్రుద్ధు డగుచు వెడలె సుషేణుడు
బండఱాల్ గొని దైత్యుపైపు పఱచె.

అట్లు పఱచు సుషేణుని నరసి గదను
వేసి తొమ్ము విద్యున్మాలి వేగ కొట్టె
అట్టి గదదెబ్బచూడక యాసుషేణుఁ
డతని గొట్ట విద్యున్మాలి యార్చి చచ్చె. 648

ఇటుల శూరులౌ కపులచే నెంతొ శూరు
లైన రాక్షసుల్ ద్వంద్వయుద్ధాగ్రమందు
సురలచే దైత్యు లట్టుల నసువులు వోవ
చచ్చి భూమిపై బడిరంత సత్వరముగ. 649

ఇట్లు భగ్నములైన యెన్నో తోమర శూల
ఖడ్గ పట్టస శక్తి గదలతోడ
ప్రీలు రథములతోఁ గుఱ్ఱములతో
పడిన మత్తద్విప పంక్తితోడ
చచ్చిన కపిదైత్య సంఘాల తోడుత
కూలి పడు రథచక్రాలతోడ
విరిగిన శకటాల వరదండములతో
క్షోణిపైఁ బడిన వస్తువులతోడ.

అజిరంగము భీభత్స మయి దనర్ప
శవములఁ బీకు నక్కలు సంచరింప
దైత్యకపుల మొండెము లటు నిటు ధరణిఁబడఁగ
యుద్ధము సురాసుర రణసమోగ్రమయ్యె. 150

వానరవరులచేఁ జీల్చఁబడియు మిగుల
రక్తములఁ బూయఁబడిన గాత్రములతోడ
రణము చేయుచు నెప్పుడు రాత్రి పడునొ
ఎపుడు కపులఁ జీల్తు మని దైత్యులుఁ దలంత్రు. 151

కపివా యం చసురుల్ నిశాచరుడవే కాయంచు నవ్వానరుల్
అపు డన్యోన్యము నంధకారమున హత్యా కాండ గావించుచున్
ఇపుడే చంపర కల్పరా యిటుల నోరీ రార పర్వెత్తరా
ఇపుడే నీపని తీర్తు నంచు విననయ్యెన్ వాక్యముల్ చీకటిన్. 152

నలుపా మేనుల వారు స్వర్ణకవచుల్ సైశాంధకారాన ను
* జ్జ్వలమౌ నోషధికాననాలు గల పల్ శైలేంద్రముల్ పోలికన్
వెలుగన్ పారములేని చీకటిని వేవేక్రుద్ధులై రాక్షసుల్
ప్లవగాళిం దినుచుండి చేసి రనిలో స్వైరప్రచారంబున్. 153

* ఓషధులు దీపములవలె వెలిగెనని కాళిదాసు.

ఇంక నావానరులో సువర్ణశిఖతొ నెన్నె న్నొ గుత్తాలుఁ బూ
నిక వహ్ని చ్ఛట వంటికేతులు రథానీకంబు తీవ్రంపు బం
డ్లకు వల్గోళ్ళకు నాహుతై యమరెగా రక్షొబలంబున్ కడున్
వికలంబుం బొనరించి పైచిరి జయావేశంబు చూపించుచున్. 654

రాముండు లక్ష్మణుండును
పాముల బోలిన శరముల వర్షించిరి దా
మేమఱక కనంబడు నవి
యేమియుఁ గనబడని దైత్యబృందము దునుమన్. 655

హయఖురాల నలిగి యరదపుఁ జక్రాల
నలము దుమ్ము శ్రవణాక్షులను నద్దె
మీఱిపుల్కలు గూర్చ ఘోర సంగ్రామాన
ఘోర రక్తపు నదుల్ మీఱిపాఱె
భేరి పణవ శంఖ వేణు మర్దల నాద
మద్భుతంబయి దిక్కులందు నలమె
హతులొచు నార్చుచు మృతినొందు దైత్యుల
వ్యథిత కపుల గొప్పధ్వను లెసంగె.

శస్త్ర పుష్పాల బలులతో సంగరోర్వి
దుర్నివేశ దుర్జ్ఞేయ రక్తోక్షిత మగు
దైత్య వానర హరియౌచుఁ దనరె రాత్రి
కాళరాత్రివలె దురతిక్రమము నయ్యె. 656

అవల నాయంధకారాన నసురు లపుడు
బాణవర్షాలచే రాము వదవిఁ బడిరి
అల్గి వచ్చెడి వారిగర్జాదిరవము
ప్రళయమున సప్తవార్ధి శబ్దాభ మయ్యె. 657

అనలోగ్రంబగు నాఱుబాణములచే నయూర్ధ్వరం దైత్యులన్
క్షణమాత్రంబునఁ గొట్టె రాముఁడు మహాశౌర్యంబు పెంపార నిం
ద్యుని ఘోరున్ యమశత్రుఁ గ్రూరునతికాయున్ వజ్రదంష్ట్రోద్యుఁదీ
ప్రనిరోధాత్మ మహోదరున్ ఖలుమహాపార్శ్వు, శుకున్, సారణున్. 65

శ్రీ

వ. అట్లు యమశత్రు ప్రభృతిరాక్షసుల నార్గురను మర్మములందుగొట్టు బడియింకను కొంత యాయుస్సుమిగుల యుద్ధరంగంబునుండి పాఱిపోయిరి. అంత రాముండు కాంచన చిత్రములు అగ్నిశిఖముల వంటివియు నగుబాణములచే దిక్కులను విదిశలనుక్షవిమలముగ నొనర్చె. మఱియు నితరులైన రాక్షసులును రాముని ఎదుటఁబడి అగ్ని యెదుటఁబడిన మిడతలవలె నష్టులయిరి. అపుడు సువర్ణ పుంఖములగు విశిఖంబులు పడుచుండ రాత్రి మిణుంగురు పురుగులచే శారదరాత్రివలె చిత్ర మయ్యె, అసలె గోరమయ్యును ఆరాత్రి వానర రాక్షసుల గర్జనంబులచే నింకను గోరతరం బయ్యె. అట్లు వర్ధిల్లిన మహాశబ్దముచేత నన్నివైపుల కందరా కీర్ణమైన త్రికూటాచలము ప్రతిధ్వని చేయుచున్నదివలె నుండె. అంధకారతుల్యమైనపర్చస్సుగల మహాకాయులైన గోలాంగూలులు బాహువులచే గ్రుచ్చి పట్టుకొని యానిశాచరులను భక్షించిరి. 65

రణమందున్ రిపుఁజంప వచ్చిన సుతీవ్రారంభుఁడౌ నంగదుం
డును నారావణపుత్త్రునింద్రజితుని న్సూతున్ తురంగాల దా
రుణ సంగ్రామమునందుఁ గూల్చి ఘనవీర్యుండయ్యు నష్టాత్ముడై
తన సౌవర్ణ రథంబు వీడి త్రుటినంతర్ధానమయ్యెన్ దఱిన్. 610

అవలన్ సర్వమహర్షులున్ సురలు పూజార్హుండయె వాలిపు
త్ర విచిత్రాహశ _ మెచ్చిరి కడున్ రాముండు సౌమిత్రియు
న్నవిశేషాధృతి నంగదున్ గనిరి యాసర్వుల్ కపుల్ పొంగి రె
క్కవ సుగ్రీవ విభీషణుల్ పొగడి రుగ్రున్ వైరి నోడించుటన్ 66

ఇటు లాయింద్రజి ద్భీకరాంగదునిచే నెంతేఁ బరాభూతుఁడై
పటు కోపంబును పూన నంతట నిటుల్ వాక్రుచ్చె రాముండు మీ
రిటుపై వానరరాజుతోఁ గలిసియే యేపారుఁ డౌతండౌ ము
న్నటులన్ బ్రహ్మవరాల రెచ్చి త్రిజగా లాడించి బాధింపఁగా. 662

ఇటు మీ యుద్ధము సిద్ధికోసమితడో మృత్యున్ గనన్ వచ్చె మీ
రిట మన్నింపుడు మీరు చింత విడుడం చీరీతిచెప్పన్ ఖలుం
డట మాయంబును పొంది యుండియును వజ్రౌజస్వియై క్రన్ననన్
పటులౌ సర్ప శరంబులన్ గురిసెనేవన్ రాముపై భ్రాతపై. 363

అట మాయంబయి కూటయుద్ధమును తానాయింద్రజిత్తున్ గరం
బటులల్ రామునికట్లె లక్ష్మణునికిన్ వ్యామోహముం గూర్చి యం
తట బంధింప సురర్షభుల్ పరవశత్వం బొంది యుండంగ న
చ్చట నావానరులున్ గనుంగొనిరి నిశ్చైతన్యులౌ భ్రాతలన్. 664

అటు కనఁబడి కనఁబడకయు
నట రావణి యింద్రజిత్తు నారాసుతులన్
పటుమాయ ప్రయోగించియు
నటుల మహాబలుడు వారినిట బంధించెన్. 665

వ. అంత ప్రతాపవంతుడైన రాముడు ఆయింద్రజిత్తు మార్గమును తెలిసికొనఁ గోరి సుషేణుని యిర్వురు కొడుకులలును నీలుడు వాలిపుత్త్రుడైన యంగదుడు వేగవంతుడైన శరభుడు వినతుడు జాంబవంతుడు మహాబలుండు సానుప్రస్థుండును ఋషభుడు ఋషభస్కందుడు నను పదిమంది వానరశ్రేష్ఠులకు ఆజ్ఞాపింప వారును ప్రహర్షముతో భీమబలులై నాలుగు దిక్కులలో నాకాశమున వెదకఁ జొచ్చిరి. 666

వడిగా బోయెడి వారివేగములనే ...
బడు బాణంబుల నడ్డి యస్త్రవిదుడున్ ... నింద్రజి
త్తడరన్ వానరు లంత బాణములచే ...ంగొట్టగాఁ
బడి, మేఘంబుల గ్రమ్ము సూర్యు ...విన్ గనన్ లేరికన్. 667

రామలక్ష్మణ దేహమాత్రములె వ్రీల్చ...
శరములనె యింద్రజిత్తు సత్వరము ...
అలుగు నింద్రజి శరరూపమందు పా...
లనుజుల మెయిఁ గాళియె లేనట్లు క... 668

వారిదేహాల రక్తంబు పాఱె మిగుల
అపుడు వారు మోదుగు చెట్టులట్టు లం...
పిదపఁ దుదల నెఱ్ఱని కండ్ల వెలసి చెద...
నాజనమటు లింద్రజిమాయమయి వచి... 669

కనఁబడకె పోరు చుండెడి
నను సురపతి యింద్రుఁడును గనన్ ... గ్రహిం
పనుజాలఁడుగద యింకన్
మనుజులు మీరా ననుగని మఱి పట్టుదురా. 670

గ్రద్ద యీకలు గల యాశుగములు చుట్టు
మిమ్ము యముసద్మఁ జేర్తు ధ్రువమ్ము సుండి
అనుచు ధర్మిష్ఠులౌ రాము నతని తమ్ము
శితశరములఁ గొట్టియుఁ బొంగి యతిగ నార్చె. 671

విడిన కాటుక ప్రోవటు లడరు నీలి
యింద్రజిత్తు పెద్దధనుస్సు నెక్కు పెట్టి
మాటిమాటికిని ఘోరమౌ మహిత శరము
లేసి గర్జించె ఘనరణ క్రీడలోన. 672

మర్మ లెఱుఁగు నింద్రజి రాము మఱియుఁ దమ్ము
ఖరశరములేసి ముంచుచు మఱియు నార్చె
రామలక్ష్మణు-లిద్దఱున్ రణములోన
బాణ బద్ధులై త్రుటిపైకిఁ గానరైరి. 673

వడిగ భిన్నసర్వాంగులై బాణశిఖలు
కష్టపెట్ట త్రాళ్ళుతెగిన గాలిపటము
లటు చలించి మర్మలు భేదమంది స్రుక్కి
ఆధను ర్ధరులటు నేలమీఁద బడిరి. 174

వ. అట్లు రామలక్ష్మణులు నెత్తురులు పాఱ దడిసి అన్నియవయవము లందు గొట్టబడిన వారయిరి. అపుడును నాగాస్త్రములచేత వారికి అపాదమస్తక మును ఒక్కయంగుళ ప్రదేశముకూడ గట్టబడనిదిగాని, కదలునదికాని, బాధ చెందనిదిగాని లేదయ్యె. కామరూపియయిన రాక్షసునిచే గొట్టబడి వారి శరీర ములనుండి నెత్తురుకాఱ జలమును స్రవించు ప్రస్రవణ గిరులట్టు లుండిరి. అప్పుడు దేవేంద్రుని జయించిన యింద్రజిత్తుచే రాముడు మర్మములందుబాణ ములచే గొట్టబడి పసిడిపిళ్ళు గలిగి ప్రసన్నాగ్రములై క్రిందికిపోవు నారాచల ములచేతను అర్ధనారాచముల చేతను భల్లములచేతను అంజలికములు వత్స దంతములు, సింహదంష్ట్రలు అనబడు కత్తులచేతను బాధింపబడి రణరంగ మునఁ బరుండియుండె. అట్లు నారివిడి ఈ చివర ఆ చివర మధ్య ఈ మూడు చోట్ల వంగిన చాపమును పట్టుకొని సడలిపోయిన పిడికిలితో బాణములు పడు దూరమునఁబడి శరబద్ధుడైన కమలపత్రాక్షుడయిన యాపురుషర్షభుఁడు రాముని జూచి లక్ష్మణుడు జీవితమున ఆశపోవ శోకించె. వానరులును అట్లుపడియున్న రామునిజూచి మిగుల విషాదము పొందిరి. అదితెలిసి వచ్చిన హనుమంతుడు మొదలగు ముఖ్యులును రామునిచుట్టునుజేరి యత్యంతముచింతిల్లుచు భూమ్యా కాశములపైపు చూచుచుండిరి. 675

జలముల్ కుర్సియు మాను మబ్బటు బాణౌఘంబు వర్షించి మి
క్కిలి దైత్యుం డలరన్ విభీషణుడు సుగ్రీవుండు మైందుండు ని
ర్మలులౌ నీలసుషేణ లంగద హనుమన్ముఖ్యులౌ వానరుల్
జ్వలనాభ ద్వివిదుడు గానాకుముదుండౌ పైవచ్చి రత్యార్తితో. 676

అటులన్ వచ్చియు జ్యేష్ఠ లేకపడియే యుట్లున్న యాభ్రాతలన్
చటులవ్యాకులమైన నేత్రములతో సంతప్త చిత్తాల సం
తట వీక్షింతురె కాని వానరులు నత్యంతమ్ముపల్మాయు న
చ్చటనే దాగిన యింద్రజిత్తునుగనన్ శక్తాత్ములై కారహో. 677

ఘనతేజంబునఁ గీర్తి నప్రతిమమౌ కర్మన్ ప్రతిద్వంద్విఁ గా
ననివాఁడై వరదాన శక్తినటనంతర్ధానముం జెంది మా
యను దాగుండియు నింద్రజిత్తడర, మాయాశక్తిచేతన్ విభీ
షణుఁ డాతమ్ముని పుత్రు నింద్రజితుఁ గాంచం గల్గె నామింటనే. 678

పిదపన్ దానొరించినట్టి పని నుర్వింబండి యున్నట్టి యా
మదమాతంగము లట్టి భ్రాతలస్థితిం బాటించి యాయింద్రజి
త్తెద నుప్పొంగి సమస్త రాక్షసులకుం బ్రీతింగడుం గూర్ప నీ
విధి బల్కెన్ ఖరదూషణాంతకులనే విధ్వంసముం జేసితిన్. 679

సరిగ పేరిని బాణపాశములనుండి
ముక్తులను జేయ ఋషులు దేవులను దైత్యు
లందఱును గల్సిపైఁ బడి నప్పటికిని
నెపుడు శక్యము గాదని యెంచుఁ డింక. 680

ఏనిమిత్తంబున ఈనాదు తండ్రియు
ఆలోచనలతోడ రేల నెఫుడు

పానుపు నంటక పరువులు తీయుచు
గాలు కాలిన పిల్లి వోలె దిరుగు

ఏనిమిత్తంబున ఈలంక యఖిలంబు
వర్షాల నదులట్లు వ్యాకుల మయి
యందఱు యూలాలు హరియించు నాయీ మ
హానర్థమును గూర్చి యడచినాను

రామలక్ష్మణుల మహాపరాక్రమము లు
చేరి కపులెల్ల నొనరించు చేష్టలెల్ల
శతదృతున మబ్బులట్లు నిష్ఫలము లయ్యె
అని దనుజులతోనని యూధపాళిఁ గొట్టె. 681

వ. మఱియు నా యింద్రజిత్తుతో

నీలుని నేడు బాణాలేసి కొట్టియు
ద్వివిదు మూడును మూడువేసి కొట్టె
జాంబవంతుని తొమ్ము శరమేసి కొట్టియు
హనుమంతు పయిఁ బదియమ్ము లేసె
అమితౌజులగు గవాక్షుని శరభుని
నింద్రజి రెండు రెండేసి కొట్టె
వాలిజు డంగదుపైని గోలాంగూల
విభుపై బహుశరాలు వేసికొట్టె

అగ్ని శిఖలట్టి శరముల నప్పుడేసి
వానరవరులఁ గొట్టియు త్వరగ నార్చి
మిగుల భయపెట్టి యింద్రజి మేటి యగుచు
నవ్వి యనియె చేయుచు సింహనాదమపుడు. 682

ఘనఘోరంబగు బాణపాశముల సంగ్రామంబునన్ రామ ల
క్ష్మణులన్ బద్ధులఁ జేసితిం గనుఁడి రక్షశ్శ్రేష్ఠులారా! యటం
చును నాయింద్రజి పల్కగా విని కడున్ జోద్యంబుతోఁ జూచి యా
దనుజుల్ భీకరకూటయోధులు ప్రమోదం బొంది యాకర్ణచే. 683

పెనుమబ్బుల్‌వలె వారు బిట్టుఱుముచున్ పే   చున్
చనిపోయెన్ భళి రాముడంచు మదిలో సంతోష   రా
వణి నాయింద్రజితున్ స్తుతింప నట నిష్పంద స్థితి
నను లేకుండిన వారిఁ జూచి హతులై నారంచు   న్. 684

అతి యానందము పొంది శత్రుదమనుండా   తనా
దితిజవ్రాతము హర్షపెట్టుచును ప్రీతిన్ లంకకుం   దీ
నత నారాముఁడు లక్ష్మణుండు పడియుండన్ భీతి సుగ్రీవుఁడా
స్థితికిన్ దైన్యపడన్ విభీషణుడు వాసిన్ బల్కె సుగ్రీవుతో. 685

"ఇటు సుగ్రీవ! భయంబు చెందకుము నీవీబాష్ప వేగంబు నా
పుట యుక్తంబగు నిట్లె యుద్ధముల నెప్డున్‌గల్గు గెల్పోటముల్
ఎటులున్ నిత్యము కావ యీమన కెదేన్ భాగ్యశేషంబ యు
న్నటులేనిన్ ఘను లీమహాత్ములకు మోహంబిద్ది నష్టంబగున్. 686

నిను దిక్కేమియు లేని నన్ను ధృతితో వేనిల్పి యిష్టాపుకో
యనయంబున్ భువి సత్యధర్మ రతులౌ నావీరధన్యాళి కె
ప్డును గానీ మృతివల్ల భీతి కలుగంబోదంచు ధైర్యం బెదన్
గన సుగ్రీవు జలార్ద్రిమౌకరముతో గన్నీళ్ళు తుడ్చెన్ గడున్. 687

అటు సుగ్రీవుని కళ్ళు తుడ్చి జలమున్ హస్తానఁ గైకొంచు ముం
గట మంత్రంబు జపించి సంభ్రమములేకన్ గాలయోగ్యంబులౌ
నటు పల్కెన్ గపిరాజ! దైన్యమును నిట్లొందంగఁ గాలంబుగా
దిటులే స్నేహముగూడ మృత్యువునకే యేపా నకాలంబులో. 688

కనుకన్ గార్యములన్ని యిందఁడచు వైక్లబ్య బికన్ వీడు మీ
మన రామున్ శరణొందు నీకపుల క్షేమం బీవు చింతించుమీ
మన రాముండిక మూర్ఛ వీడువఱకున్ భద్రంబుగాఁ జూత మిం
కను సంజ్ఞన్‌గని భ్రాతలీమనకు రక్షాదక్షులై యుండుతన్. 689

ఇదియేమీ మఱిపెద్ద రామునికిఁ గానేకాద రాముఁడు మృ
త్యుదశం బొందు నటన్న శంకకును నిందుంబాపె లేదోయి మృ
త్యుదశం బొందెడి వారి కిట్టి సిరియొందున్ గల్గనే కల్గ ది
య్యది నేఁగార్యము సర్దుదాక నిను, సైన్యంబెల్ల నోదార్చుమీ. 690

ఇఁక విస్ఫారిత కండ్లతోఁ గపులు నెంతే భీతితోఁ దొండఱన్
వికలాత్మంబున నాచెవిన్ జెవిని పేపే గిల్లుకొంచున్ వచిం
చికొనం జొచ్చిరి సన్నో చూచి పదువుల్ చేపట్టు సైన్యాళికి
విఁక ధైర్యంబును జెప్పు భీతి విడగా నీవాడుదండంబులెన్. 691

యిటు సుగ్రీవునకున్ విభీషణుఁడు నెంతే ధైర్యముంజెప్పి యి
ట్లటు చెల్లాచెదరైన సేనకుఁగరం బాశ్వాసముం గూర్చె నిం
కట మాయాపియు నింద్రజిత్తఖిల సైన్యంబుల్ తనుం గొల్వ నం
తట లంకాపురిఁ జొచ్చి రావణుఁ బితన్ దర్శించి తానప్పుడే. 692

అటు పీఠంబున గూరుచున్న పితకున్ సాష్టాంగదండంబు గా
పటుభక్తిం బడి రామలక్ష్మణులఁ జంపన్ గంటి నంచున్ వచిం
చుటయున్ దా విని పొంగి పైకెగురుచున్నన్ సూనున్ గరంబున్ గవుం
గిటిలో గ్రుచ్చి శిరంబు మూర్కొని యెఱింగింపంగ ప్రశ్నింపగా. 693

శర పాశంబుల రామలక్ష్మణులు నిస్సంజ్ఞన్ గతౌజస్కులై
ధరపై గూలుట యంతయున్ సరిగ వృత్తంబున్ నివేదింప న
త్తఱి నారామునివల్ల గన్న జ్వరసంతాపంబు పోవంగడున్
నెఱి నాయింద్రజినంతఁ బొంగి యభినందించెన్ సువాక్యమ్ములన్. 694

అటు లాయింద్రజియో కృతార్థుడయి తానాలంకకుం బోవ్వినం
తట నామారుతి యంగమందు నిలుఁడున్ తన్నీలుఁడున్ రంభుఁడు
త్కట వీరుండు గవాక్షుఁడుం గవయుఁడుం దజ్జాంబవంతుండు ను
ద్భటులౌ నాగజ గంధమాధనులు శ్రద్ధాళుల్ సుషేణాదులున్. 695

మఱి శతబలి యాది యగు వానరులు రాముఁ
జుట్టుకొని కాచుచును చెట్లు పట్టి యెత్తి
వ్యూహములు పన్ని నలుదిశ లుర్విఁ బైని
నొగిఁ గనుచు ఆకుఁ గదలదైత్యులుగ నెంత్రు. 696

రావణుఁడును హర్షమున నింద్రజిని వీడి
సీతఁ గాచెడి రాక్షసస్త్రీలఁ ద్రిజటఁ
బిలిచి యింద్రజి రాముని వేగఁ జంపె
ననుచు సీతకుఁ జెప్పి మీరరిగి యిపుడె. 697

ప్రీతిఁ బుష్పక మెక్కించి సీత కిపుడె
చచ్చిపోయిన రామలక్ష్మణులఁ జూపుఁ
డన్నరులఁబట్టికద సీత యతిగ పొగరు
గలిగియున్నది, చచ్చె లక్ష్మణుఁడు పతియు. 698

ఇంక విడి శంక యుద్వేగ మేమిలేక
ఏ యుపేక్షయు వీడియు నెల్లనగలు
దాల్చి ననుగొల్చు సీత భ్రాతలను పోవఁ
గనుచు నాశపోవ మఱొక్కగతిని గనదు. 699

అనుచు రావణుడు వచింప నాలకించి
రావణాజ్ఞచేఁ జని స్త్రీలు రయమ భర్తృ
శోకమునఁ గుందు సీత నశోకవనము
నుండి తెచ్చి త్రిజటతో రణోర్విఁ జనిరి; 700

ఇఁక లంకాపురి నెల్ల రావణుడు తానెత్తైన జండాల మా
లిక లెత్తించియు రామలక్ష్మణులు నేఁడే చచ్చి రాయింద్ర జి
త్తు కరాలన్ గనుఁ, డంచు నెల్లపురిలో తూర్ణంబ చాటింపఁగా
నిఁక సీతన్ స్వవిమానమున్ ద్రిజటతో నెక్కించి రాజిన్ గనన్. 701

అటులన్ బుష్పక మెక్కుచున్ త్రిజటతో నాసీత నల్వంక న
ట్లిటు నేలంబడి యార్తులైన కపులన్ హృష్టాత్ములౌ దైత్యులన్
అటనే యమ్ముల పాన్పునన్ శయితులై యావంతయున్ జేష్ట లే
నటులన్ సోలిన రామలక్ష్మణుల దుఖార్తిన్ గనెన్ బాధతో. 702

కవచంబుల్ వగులంగ విండ్లు చెదరంగా భిన్నసర్వాంగులై
భువి బాణంబుల బద్ధు నుజులన్ ఫుల్లాబ్జ వక్త్రాక్షులన్
సువిశేషించి విశాఖుస్కందుని బలెన్ శోభిల్లు వారిం భృశం
బ విలోకించి విలాపముల్ పొనరిచెన్ మాన్యాంగి యాసీతయో. 703

ధర ధూళింబడి దొర్లు రామునునుజున్ దైవ ప్రభావాత్ములన్
వరకాయించి మదిందలంచి మృతి సంప్రాప్తింపలేదే కదా
వరవీరుల్ పడియుండి రిట్లనుచుఁ దావంబొంది బిట్టేడ్చుచున్
వర నీలేక్షణ సీతస్రుక్కుచు నిటుల్ వాక్రుచ్చె దీనాంగియై. 704

పతిసుతుల్ కలదానఁ బతిహీనఁగా నని
ఏలక్షణజ్ఞుల్ వచించి నారొ
యజమాను మహిషిని యజ్ఞాఢ్యు సతి నంచు
ఏలక్షణ విదుల్ వచించి నారొ
నేనాలకింపఁగ నేసుమంగళి నంచు
ఏజ్యోతిషికులు వచించినారొ
వీరపత్ని నటంచు వినుత ధన్య నటంచు
ఎట్టి జ్ఞానులు వచియించి నారొ

వారినుడులు, రాముండు చంపంగఁ బడిన
నన్నియు నసత్యమైనవై యమరు నొక్క
కాళ్ళ ఊపద్మరేఖలు గ్రాలు సతులు
ప్రియులతో నభిషిక్త లౌట యస్మృతంబె. 705

వైనిచే భాగ్యంబు వెడల విధవల్గాదు
రాలక్షణములు నాయందు లేవు
పద్మరేఖలు స్త్రీల భవ్యలక్షణ మంద్రు
రాముడు పోవ వ్యర్థములె యివ్వి
ఈనీలి కురులును నెంతొ సమముగ నొఁ
గనుబొమ లొంటొంటిఁ గలవకుండె
సరిగ గుండ్రమ తిర్గి జంఘల రోమమౌ
పలువర్ప ధట్టమై యలరుచుండె

కనులుఁ బ్రాంత లలాటముల్ కాళ్ళు కేలు
తొడలు మడమలు కడుబల్సి యడరి యుండె
గోళ్ళు గుండ్రమై నునుపయి కొమరు మీఱు
వ్రేళ్ళు సమము లై చక్కగ వెలయుచుండె. 718

చనులు మధ్యను చోటె గనక బలిసి యుండె
చనుల తుదల్ లోతుగను నడంగె
లోతయి చుట్టుబొడ్డును నెత్తుగా నొప్పె
పార్శ్వముల్ ఱొమ్మును బలిసి యుండె
నారంగు మఁటిఁ బోలు నీరోమములొ మృదు
వీపది లక్షణా లిటు శుభాలు
అనుచు లక్షణవిదులైన మహాత్ములు
నన్ను గుఱించియు నెన్నొ యనిరి.

కాళ్ళు చేతులు నెఱ్ఱనై చిల్లు లేక
తగి యవాకార రేఖతోఁ దనరియుండె
నాదుల్లసన్వ్మను చిఱున వ్వనంగఁ గన్య
లక్ష్మణముల నిట్టులు ద్విజు ల్పలికినారు. 707

నాకుఁ బతితోడ రాజ్యాభిషేక మగును
అనెడి జ్యౌతిషికుల నుడులు నసృత మయ్యె
ఆజనస్థాని శుచి చేసి యురసి నన్ను
కొలవ రాని సంద్రముదాటి గోతిఁ బడిరి. 708

అవును వారుణ మాగ్నేయ మైంద్ర మింక
మఱియు వాయువ్యమును బ్రహ్మశిరము నసెడి
ఘనపు టస్త్రాలు రాఘవుల్ గలిగి యున్న
వీరలేగద యేల యిట్లైరో యిపుడు. 70

కదన రంగాన మాయచేఁ గానఁ బడని
వానిచే నిట్టు లింద్రసమాను లైన
నాదునాధు లనాధనౌ నాదు భాగ్య
వశముచే నిటు నిహతులై పడిరి గాదె. 710

రాము దృష్టి పథము పొంది రణమునందు
నరి మనోజవుఁ డయ్యుఁ గ్రమ్మఱఁడు బ్రదికి
భ్రాతతో రాముఁ డాజిని బడియె నసఁగ
సమయమున కశక్య మెది; దుర్జయుఁడు యముఁడు. 711

ఎటుల దీన కౌసల్యకై యేడ్తు, నటులఁ
గుంద వీరికైనను దల్లిఁ గూర్చి కూడ
వ్రతముఁ దీర్చి రాఁగ నెపుడు రాముఁ దమ్ము
సీతఁ జూతు నంచునునామె చింతగుములు 7.2

అని విలపించెడి సీతకు
అనె రాక్షసి త్రిజట యపుడు వడలకు దేవీ !
కనునీపతి బ్రదికియు యుం
డెను, వారేల బ్రదికి నెగడిరో వినుమీ. 713

ఇటు నీభర్తయొ చంపఁగాఁ బడినచో నీయోధ వక్త్రంబులో
యిట క్రుద్ధంబయి సంప్రహర్షయుతమై యేమాత్రమే నుండ, విం
తట వీరుల్ గత జీవులై కనుక నున్నంజూడు మీరీతి అం
తట నిన్ మోయదు దివ్యపుష్పక విమానం బీయదో జానకీ! 714

ఇటు వీక్షింపు ప్రధానులున్ నిహతులై యిట్లుంట నుత్సాహ మే
గుటఁ జుక్కానియె లేని నౌకవలె తిర్గున్ సేన నిర్యత్నయై
ఇటు కంగారది లేక వేగవతియై యీసేన యుద్వేగ మి
చ్చట తానొందక ప్రీతిఁ దెల్పుటనె రక్షం జేయు గాకుత్థ్సులన్. 715

కనుకన్ నీవు సుఖాది చిహ్నములచేఁ గాకుత్థ్సులో మృత్యువున్
గనలేదంచు నెఱుంగు, స్నేహమున వక్కాణింతు మున్నెన్నడున్
అనృతం బాడఁగ లేద యింక నిపుడో యాడన్ సుశీలత్వ మొం
దిన పుణ్యాత్మవు గాన నామనసునందే చొచ్చినా విట్టులన్. 716

సురులున్ దైత్యులు నింద్రుతోఁ గలిసి యిచ్చో నెత్తి యేతెంచినన్
సరె వీరిన్ గెలువంగలేర యిటులే చక్కంగఁ జింతించి యి
త్తఱి వాక్రుచ్చితి సావధానముగ నేతాదృగ్భలాకారముల్
పరకాయించుము మేనిలక్ష్మి విడ దివ్వారల్ స్మృతిన్ వీడినన్. 717

బలముల్ పోయి గతాయులౌ పురుషులన్ వక్త్రల్ వికారాల వ
ర్తిలుచుండున్ దఱచై, విమోహమును నార్తిన్ వీడుమో జానకి
అల నీరాముఁడు లక్ష్మణుండు మరణం బందంగ శక్యంబెయొం
ట్టుల నంచాడగ దైవపుత్రిసమ యిట్టుల్ సీతయున్ వాకొసెన్. 718

సరె యట్లేయగుఁగాక యంచు గరముల్ చల్లంగ జోడించి యా
తఱి వైదేహియుఁ జెప్పఁగా త్రిజటయున్ దత్పుష్పకంబున్ మర
ల్చి రయానంబురి లంకకుం జనకజం జేర్పింప నాసీత యా
వరులన్ చూచుచు నాయశోకవనికిన్ వచ్చెన్ సశోకాత్మయై. 719

ఇటులన్ ఘోరశరాల బద్ధులయి యుండే రాముఁడున్ లక్ష్మణుం
డట రక్తార్ద్రభుజంగమంబు లటు లొయ్యంగూలి నిట్టూర్చుచుం
డుట సుగ్రీవుఁడు లోనుగాఁ గపులు శ్రేష్ఠుల్ చుట్టుగూర్చుండి పో
వుటలో మగ్నత నుండ రాముఁ డురుసత్త్వుండౌటచే మేల్కొనెన్. 720

పిదపన్ రాముఁడు నెత్తురోఁ దడిసి యుద్వేగంబుతో దీనమౌ
పదనం బొప్పెడు తమ్మునిం గని కడున్ వాపోయె నీరీతి; నీ
యదనన్ లక్ష్మణువంటి భ్రాత కదనంబందుం బరాభూతుఁడై
యిదె యిట్టుల్ పడ సీత యేని బ్రదుకే నింకిప్డు నాకేటికిన్. 721

దొరకును జానకిఁ బోలిన
వరనారి మనుష్య జగతి బాగుగ వెదుకన్
దొరకునె లక్షణసమ సో
దరుఁడు రణవిశారదుండు ధరలో వెదుకన్. 722

వర సుమిత్రానందవర్ధనుఁ డిటుపోవ
వానరుల్ చూడ జీవముల విడుతు
కౌసల్యతల్లికిఁ గైకకున్ సుతుఁ జూడ
నెంచు సుమిత్రమ్మ కెది వచింతు
అనుజ హీనుఁడ నయోధ్యకు నేగి లేడి యు
ట్లార్చు సుమిత నోదార్చ బెట్లు
అనుజుతో వని కేగి యనుజుఁడు లేకెటు
లరిగి శత్రుఘ్నుని భరతుఁ జూతు

ఆసుమిత్ర మాటలను నె ట్లోసహింతు
ఇటనె తనువు వీడెదను జీవింపఁ గోర
ఎవనికై లక్ష్మణుఁడు మరణించినట్లు
ఇటుపడెనో యాఖలు నను నిందింపఁ దగును. 723

నాకుఁ బతితోడ రాజ్యాభిషేక మగును
అనెడి జ్యౌతిషికుల నుడులు నసృత మయ్యె
ఆజనస్థాని శుచి చేసి యరసి నన్ను
కొలవ రాని సంద్రము దాటి గోతిఁ బడిరి. 708

అవును వారుణ మాగ్నేయ మైంద్ర మింక
మఱియు వాయవ్యమును బ్రహ్మశిరము ననెడి
ఘనపు టస్త్రాలు రాఘవుల్ గలిగి యున్న
వీరలేగద యేల యిట్లైరొ యిపుడు. 709

కదన రంగాన మాయచేఁ గానఁ బడని
వానిచే నిట్టు లింద్రసమాను లైన
నాదునాధు లనాధనౌ నాదు భాగ్య
వశముచే నిటు నిహతులై పడిరి గాదె. 710

రాము దృష్టి పథము పొంది రణమునందు
నరి మనోజవుఁ డయ్యుఁ గ్రమ్మఱఁడు బ్రదికి
భ్రాతతో రాముఁ డాజిని బడియె ననఁగ
సమయమున కశక్య మెది; దుర్జయుఁడు యముఁడు. 711

ఎటుల దీన కౌసల్యకై యేడ్తు, నటులఁ
గుంద వీరికైనను దల్లిఁ గూర్చి కూడ
వ్రతముఁ దీర్చి రాఁగ నెపుడు రాముఁ దమ్ము
సీతఁ జూతు నంచునునామె చింతగుములు 712

అని విలపించెడి సీతకు
అనె రాక్షసి త్రిజట యపుడు హడలకు దేవీ!
కనునీపతి బ్రదికియు యుం
డెను, వారేల బ్రదికి నెగడిరొ వినుమీ. 713

ఎవరు చేయని దుష్కర కృత్య మిపుడు
హనుమ చేసె గోలాంగూల వినుత విభుఁడు
జాంబవంతుడున్ జేసిన సత్క్రియల్లను
మిగులగ నభినందింతును తగిన యటుల. 726

శరభుం డంగద మైందులున్ ద్వివిదుఁడున్ సంపాతియున్ వీరకే
సరి యాశూర గవాక్షుఁడున్ గవయుఁడున్ శ్రద్ధన్ గజుం డిట్లునా
కొఱకై వీరు స్వజీవితంబు విడఁగాఁ గూర్చుండి రీయట్టి వా
నరులన్ మెత్తు మనుష్య యత్నములు సెన్నన్ మించ వాద్దైవమున్. 727

సుహృదుం డౌచును ధర్మభీరు వగుచున్ సుగ్రీవ! యిట్లెంతొ స
త్ప్రహతుండై యొనరించినావు; కపులారా! మిత్రకార్యంబు మీ
రిహలోకంబునఁ జేసినారలు గదా స్వేచ్ఛాగతిన్ మీరలున్
మహితంబౌ భవ దిష్టమైన స్థలముల్ మన్నింపఁగాఁ బొండిఁకన్. 728

అని యారాముని యావిలాపముల నిట్లాలించి శుక్లాక్షులై
గని కన్నీరు కపుల్ కడున్ విడిచి, రీకాలాన సైన్యంబులన్
అనువౌ నట్లు విభీషణుం డునిచి యేపారన్ గదా పాణియై
చనుదెంచెన్ వడి రాముఁడున్ వగచు నాస్థానంబుకై వీఁకతో. 729

ఘన మటు శ్యాముఁ డగు విభీ
షణుండు సత్వరముగాగ చనుదేఱుటయున్
గనుగొని వానరులును రా
వణుఁగాఁ దలపోసి మదిని పరువెత్తి రటన్. 730

వ. పిదప మహాతేజుండును మహాబలుండు నగు వానరరాజు "ఇదియేమి యీ వానరసేన ఎదురుగాలిలోఁ బడిన నౌక వలె వ్యథతోనున్నది. అని యడుగ వాలిపుత్రుఁడైన యంగదుఁ డిట్లనెను. ఏమి యీ రామలక్ష్మణులు శరజాల

ముచేఁ గొట్టఁబడి శరతల్పమునఁ బడియుండుట నీవును జూచుచుంటివి గదా" అని. అంత సుగ్రీవుఁడు పుత్రుడగు నంగదునితో ఇపుడీ భయమున కేదో నిమిత్తము లేక కానేరదు. ఈ వానరులు విషణ్ణవదనులై యాయుధములు విడిచి కనులు విప్పి దిక్కులకుఁ బరువిడుచున్నారు. ఒక రొకరిని జూచి సిగ్గు పడరు. వెనుకవైపు చూడరు. ఒకరికొకరు దూర మగుచున్నారు. పడినవానిని జూచి లంఘించుచున్నారు అని. అపుడు గదాపాణియైన విభీషణుఁడు సుగ్రీవునికి ధైర్యము చెప్పుచు రామునిపైకిఁ జూచెను. అంత సుగ్రీవుడు వానరభీషణుఁడగు విభీషణుని జూచి దగ్గఱగానున్న ఋక్షరాజు జాంబవంతునితో నిట్లనియె. "ఇదిగో ఈ విభీషణుని జూచి రావణపుత్రుఁడగు నింద్రజిత్తేమో యనుకొని యావానరులు పరువెత్తుచున్నారు. వీరికి ధైర్యము చెప్పి యాపి యీ వచ్చిన వాఁడు విభీషణుడని చెప్పుము." అని సుగ్రీవుఁడు చెప్పగా జాంబవంతుఁడు వానరులను ఆపి నోదార్చె. అంత ఆ వానరులు కంగారు విడిచి విభీషణుని జూచిరి. అంత విబీషణుడు శరములచే గొట్టబడిన రామలక్ష్మణుల శరీరమును చూచి నీటితో దడిసిన చేతితో వారి కన్నులను తుడిచి శోకపీడితుడై ఏడ్చి విలపించెను. 731

### —: పడిన రామునిచూచి విభీషణుని చింత :—

బలయుక్తుల్ ఘనవిక్రముల్ ప్రియరణుల్ ప్రజ్ఞాత్ములౌ వీరి ని
ట్టుల నీదైత్యులు కూటయుద్ధులయి యాటోపాన సంజ్ఞా విహీ
*నుల గావించిరి దుస్సుతుం డనుజు సూనుం డిట్లు మాయావియై
ఖలుఁ డొచున్ ఋజువిక్రమాఢ్యులను నిష్కంపాత్ములం జేసెఁగా. 7[illegible]

* దుస్సుతుడు = తల్లికడుపు చెడబుట్టినవాడు.

శరములను గొట్టఁగబడి నెత్తురులఁ దడిసి
పుడమి షుండ్ల పందులవలెఁ బడిరియిట్లు
ఎవరి వీర్యముఁ బట్టి నేభువిని నిలుతు
నట్టి పురుషర్షభులు పడి రదిగొ మృతికి. 733

రాజ్యమును నాదు కోర్కెయు భ్రంశ మొంద
బ్రదికియె విపత్తుఁ బొందితిన్ రావణుండు
రిపువు ప్రాప్తకాముండె యయ్యె నిపుడు. యను వి
భీషణుని గ్రుచ్చి కపిరాజు ప్రేమ బలికె. 734

లంకారాజ్యము నీవు పొందెదవు ధర్మజ్ఞా ! మతిందేమియున్
శంకన్ బొందకు, రావణుండు సుతుతో స్వాభీష్టముం బొందఁడే
వంకన్, రాముఁడు లక్ష్మణుండు రుజచే స్వాస్థ్యంబు గోల్పోవతే
దింకన్ మోహముపోవ రావణుని నిక్కి చంపువారల్ సుమీ. 735

అని యోదార్చి విభీషణున్ మిగుల ధైర్యం బాడి సుగ్రీవుఁడున్
తన పార్శ్వాన సుషేణు మామఁ గని యుంతన్ బల్కె కిష్కింధకున్
జనుమీ భ్రాతలు రామలక్ష్మణులతో; శక్రుండు నష్టాత్మ ల
క్షినటుల్ సీతను దెత్తు దున్ని నకలస్వీయాప్తునిన్ రావణున్. 736

అని సుగ్రీవుఁ డనన్ సుషేణుఁడనె మున్నాదైత్య దేవాళి కె
ల్లను ఘోరం బగు యుద్ధముల్ జరగ శస్త్రాస్త్రాలఁ జాతుర్య మొ
ప్పిన దైత్యుల్ సురరాజి మిక్కిలిగ నొప్పింపన్ వినష్టాత్ములౌ
ఘనులన్ దేవుల నాబృహస్పతి సుఖులం గావించె మంత్రాదులన్. 737

కనుకన్ బోయి మహౌషధుల్ గలిగి దక్షంబైన క్షీరాబ్ధికిన్
మన సంపాతిముఖుల్ కపుల్ పనసుతో మన్నించి యాయోషధుల్
గని వేత్తెత్తురు గాక వారలును యోగ్యంబైన యాయోషధుల్
మునుపే తెల్పిన వారలే గనుక తాముస్ బొంద రేకష్టముల్. 738

అరసి క్షీరాబ్ధి నమృతంబు తఱచు చోట
ద్రోణ చంద్రాఖ్య లనుగిరుల్ కానిపించు
దివ్య సంజీవ కరణియు దేవ రచిత
మురు విశల్య కరణికల వోషధు లట. 739

అందు దేవత లాపరమౌషధులను
ఉంచి రచటకు హనుమంతుఁ డొగిని నేగు
గాక యని చెప్పు నంతలో గాలి హెచ్చి
యిలగిరి మెఱుపు ఘుబ్బిల్ చలింప వీచె. 740

ఘన వృక్షంబుల గాలిచేతఁ దరువుల్ గ్రావాలు ద్వీపంబులున్
వణఁకెన్ గొమ్మలతోఁ దరుల్ విఱిగి యావార్ధిన్ వడిం గూలి భీ
తిని నందుండియు నాగులన్ జలచరుల్ భిన్నంగ నీరాల ము
న్గెను నగ్నిం బలెనెగ్గుచుం దివి నిగన్పించెన్ గరుత్మంతుఁడున్. 741

అటు పక్షీంద్రుఁడు కానిపించిన క్షణం బందే సుయోగ్యాత్ములన్
పటు సామర్థ్యుల రామలక్ష్మణులనే బంధించి యున్నట్టి యు
త్కట నాగంబులు పాఱిపోవ నిఁక నాకాకుత్థ్సులన్ జూచి వా
రట నర్చింపగ వారియాస్య శశులన్ తట్టెన్ గరుత్మంతుండున్. 742

ఇఁక బక్షీంద్రుడు తట్టి నంతట వ్రణాలే మాయమై పోయె దఁ
త్వకలాలగాలు సువర్ణమై తనరె స్నిగ్ధంబౌచు; నవ్వారి లో
బ్రకటంబయ్యె బలంబు తేజమును వీర్యంబున్ మహోత్సాహమున్
సకలంబౌ గుణరాజి సూక్ష్మపుఁ బరిజ్ఞానంబు రెట్టింపుగన్. 743

అపు డాభ్రాతల లేవఁదీసి గరుడుం డాయింద్ర తేజస్కులన్
విపులప్రేమను గౌఁగిలించుకొనగా వీక్షించి రాముం డనెన్
అపురూపం బగునీయ నుగ్రహముచే నాయింద్రజి త్తిట్లు మా
దుపయిం గూర్చు వ్యథల్ చనెం గలిగె నెంతో శక్తి పూర్వం బిటుల్.

తండ్రి దశరథు నాయుజుఁ దాతఁ బొంది
నట్లు నినుబొంది నామది యమలి మయ్యె
రూప యుతుఁడవు దివ్య గంధోపయోగి
విట్టి తెలివల్వ నగలూను నెవ్వఁ డీవు. 745

అన మహాతేజుఁడు వినతాతనయుఁ డెంతొ
ప్రీతిఁ గని హర్షపర్యాకులేక్షణుండె
యగుచు నిటుపల్కె నేను నీయనుఁగు సఖుఁడు
నీబహిః ప్రాణమున్ గరుడ నేను సుమ్ము. 746

నీకు సాయము గావింప నేను వచ్చి
నాఁడ, ఘనవీరు లసురదానవులు నింద్రుఁ,
గానిన గంధర్వసుతులైన గూడ నింద్ర
జిత్తు కూర్చిన శరరజ్జుఁ జీల్చలేరు. 747

ఉగ్ర విషపూర్ణ దంష్ట్రిల నొప్పు నట్టి
కద్రువ సతు లసుర మాయ కార్య మహిమ
బాణ రూపంబు దాల్చి యీవగిది నిన్నుఁ
జేరి బాధించి రిట్టులు మీఱిమిగుల. 748

రామ! ధర్మజ్ఞ! సత్యపరాక్రమాఢ్య
సమరముల శత్రువులకు నాశంబు గూర్చు
భ్రాతలక్ష్మణుతోఁ గూడ భాగ్యవంతుఁ
డవగుటను చెక్కుచెదర కీలాగె యుంటి. 749

ఇట్టి నీదు వృత్తాంత మాలించి నేను
వెంటనే మీదు మైత్రి భావించి యిటకు
స్నేహమున వచ్చితిని మీరు చెడ్డ నైన
ఘోర శరపాశములనుండి కూడవిడిరి. 750

మీరు నిత్యము పొరపడి మెలగి యుండు
రణములందు రాక్షసులు స్వప్రకృతి చేత
మోస మొనరింత్రు ఋజు భావములఁ దనర్చు
మీకు సహజ మగు ఋజుత్వ మేబలంబు. 751

కనుక నెప్పుడు రణరంగమునను వారి
నమ్మరా దీయుదాహరణమ్మె నీకు
రాక్షసులు మోస గాండ్రని ప్రకటపఱచు
అనుచుఁ గౌఁగిటఁ జేర్చి వీడ్కొనఁ దలంచి. 752

మఱియు నిటులనె ధర్మజ్ఞ! మాన్యచరిత!
శత్రులందును గూడ వాత్సల్య ముంచు
వాడ వీఁకననుజ్ఞ యిడఁగ వాంఛ చేతు
వచ్చి నటు లిప్పుడే పోవ వలతు నయ్య. 753

అటు నీరోగుల రామలక్ష్మణుల నెయ్యంబార నీక్షించి యు
బటు హర్షంబున సింహనాదముల రోదస్సుల్ కపుల్ నింపి రు
త్కట లాంగూలము విదర్చిరి కడున్ గర్జించి భేరుల్ హుటా
హుటి వాయించి మృదంగ శంఖ రవముల్ హోరాహోరి జేసిరిన్. 754

బాహులఁ జఱచి చఱచి యు వానరవరు
లద్రులను జీల్చి ద్రుమములు నంతఁబీకి
ఘోషములు చేసి రసురులు గోడు వడచి
వేనవి తుద మబ్బటువిజృంభించి రపుడు 755

తొరగ నేను వానరుల యాతుముల శబ్ద
మాలకించి రావణుఁడు దైత్యాళితోడ
సచివులను గాంచి యనియె నీశబ్ద మిట్లు
స్నిగ్ధ గంభీర ఘోషమై సెగడె నేమి. 756

హృష్టులై పెక్కు వానరు లిట్లు ఘోష
మేఘ గర్జనము లట్లు మీటి చేతు
రిందు నెదొ మహా ప్రీతి కపీంద్రులకును
కలిగి యుందు నీఘోషచే జలధి కలఁగె. 757

భ్రాత లారామలక్ష్మణుల్ బాణబద్ధు
లై రి గాదె యీధ్వని యేల? నమ్మో శంక;
అనుచు రావణుఁడన మంత్రు లపుడె దరిగ
బనియు దైత్యులతో నిట్లు పలికి రపుడు. 758

త్వరగాఁ బోయి కనుంగొనుం డిపుడె చింతామగ్ను లౌ క్రోతు లి
త్తరి హర్షించుట కేమి హేతువొ నునం దైత్యుల్ సుసంభ్రాంతులై
పురి ప్రాకారము నెక్కి గొప్ప బలిరైై కొంచారు సుగ్రీవుకున్
పరిపాలించెడి గొప్ప సేనఁ గని రావట్నంపు ప్రాంతాన నే. 759

శరపాశంబుల నుండి ముక్తులయి స్వేచ్ఛన్ లేచి వేగాన ను
ద్ధరులౌ రాఘవులం గనుంగొనుచు నెంతో భీతి సంభ్రాంతులై
పురి ప్రాకారము నుండి వేగ దిగి మోషుల్ వాడిపో రావణా
సురు పాదంబులఁజేరి దీనముగ నచ్చోఁదెల్పి రీదుర్గతిన్. 760

ఎవరా యిం ద్రజి బాణబద్ధు లయి యింతేఁజేష్ట లేకుండఁగా
భువిపై సోలిరొ యట్టి రాజతనయుల్ ముక్తాత్ములై గొల్పు లె
ల్లవడిం ద్రెంపిన యేన్గులట్లు గజవిక్రాంతిం విజృంభించుచుం
గవియం జొచ్చిరి యస్మదీయబల మింకన్ జూడుమీయం చనన్. 761

వారిమాటలు విని మహాబలుఁడె యైన
రాక్షసేంద్రుఁడు చింత యాక్రమణ చేయ
కడు విషణ్ణముఖుఁ డయి రాక్షసులఁ గాంచి
యీవిధంబుగ నపుడు వచించె మిగుల. 762

మనవాఁ [illegible] జి ఘోరముల్ వరమునం [illegible] మోఘాలు దా
రుణ మాశీ [illegible] తుల్య మరుక్కఁ డటు వెల్గుం జి[illegible] బాణంబులన్
ఘనతన్ వేసి [illegible] ఋ వారిఁ గట్టెఁ గద యింకన్ [illegible] బద్ధు ల
య్యును నా [illegible]త్రులు బాణముక్తు లయిరా యూహింప నిట్లైనచో. 763

ఇఁక నస్మద్బల మెల్ల సంశయము నందే పడ్డ [illegible]ట్లింతు వా
సుకి తేజొప్పగ నా విరోధి బ్రతుకుల్ సూక్ష్మంబుగా లాగి యిం
తకు బంధించిన బాణముల్ మిగుల వ్యర్థంబై యిటుల్ పోయెనాః
యిక నేమందు నటంచు రావణుఁడు నెంతేఁ గ్రుద్ధుఁ డై పోవుచున్. 764

ఉరగం బట్టులు బుస్సకొట్టుచును నిట్టూర్పుల్ వదిఁ బుచ్చి నె
త్తురు కండ్లం గడు నిప్పులం గురియుచుం ధూమ్రాక్షుడన్ రాక్షసున్
కరముం భీకర రాక్షసాళినడుమం గన్గొంచు నీలా గనెన్
తొరగా నీవు మహాబలాలు గొని శత్రున్ రాముఁ జంపన్ వడిన్. 765

పద బయల్దేరు మటంచు రావణుడనన్ వైశంబ ధూమ్రాక్షుడున్
పదముల్ త్రొక్కుచు బొంగి రావణునికిం బాదాలకున్ మ్రొక్కి రా
ట్పదనంబున్ వెలువడ్డ వాడగుచు పండ్లన్ గొరుక్కుచున్ కోట గే
టుదరిన్ నిల్చిన సైనికాధిపతి కిట్టుల్ చేసె నాజ్ఞాపనల్. 766

త్వరగా సేనలతీసికొంచు నడు యుద్ధంబుల్ ఘొనర్పంగఁ దొం
దరతో నేగెడినాకు జాగుసలుపన్ రాదంచు ధూమ్రాక్షుడు
ద్దురతం బల్కగ సైనికాధిపతి యుద్ధోద్యుక్తుడై సైన్యముల్
త్వరగాఁ బంపఁగ గంటలన్ వడుముకుం బంధించి యారాక్షసుల్. 767

బలియుండ్రై బహు ఘోరరూపులయి దర్పంబార గర్జించుచున్
అల ధూమ్రాక్షుని జుట్టుకొంచు వివిధంబౌ నాయుధంబుల్ విరా
జిల శూలంబులు ముద్గరంబులు గదల్ చేదాల్చి భల్లాల ను
జ్జ్వల ఖడ్గంబుల భిండి వాలముల ప్రాసాల్ గండ్రగొడ్డళ్ళతో. 768

దిశలుం దద్దరిలం బయోదము లటుల్ దీక్షంబు గర్జింత్రు, రా
క్షసులుం గొంద అలంకరించు ధ్వజముల్ గ్రాలం రథానెక్కి మే
లి సువర్ణాంచిత జాలముల్ కపుల నోలిన్ వికారంబులై
పస చూపంగల మోములన్ ఖరము లొప్పన్ వచ్చి రత్యుగ్రతన్. 769

మరి యొక్కండు త్వరాన్వితమ్మగు సమ్మాన్యాశ్వముల్ గొంచు నొ
క్కరు నర్పించిన యేన్గులన్ గొనుచు వ్యాఘ్రూ లట్లు వేగన్ నిశా
చర శార్దూలులు బైలుదేఱ వృకపంచాస్యాస్యముల్ మీఱు వల్
ఖరముల్ పూన్చు రథంబు నెక్కి కడువేగన్ వచ్చెధూమ్రాక్షుడున్. 770

హనుమంతుఁ డున్నట్టి యాపడమటి ద్వార
మునకు ధూమ్రాక్షుఁడు పోయె నగుచు
ఖరయుక్త రథ మెక్కి యురుగు ధూమ్రాక్షుఁబో
వలదని మింటిపైఁ బక్షు లాపె
రథము శిరస్సున వృఖుగృధ్రము వడియె
కడుధ్వజాగ్రము నంటి గ్రద్దలు పడె
నెత్తుటఁ దడిసియు హత్తి యూర్చి తెలుపు
మొండెము ధూమ్రాక్షు ముందు పడియె

నెత్తురి కురిసె వడఁకె మేదినీ తలంబు
పిడుగువలె ధ్వనించుచు గాలి వీచె నెదురు
చీఁకటుల గుంపు కప్పు భాసిలవు దిశలు
అట్టి యుత్పాతములకు ధూమ్రాక్షుఁ డడలె. 771

అచట ధూమ్రాక్షు నుందున్న యసురు లెల్ల
నూర్చ పడిరి గాని సుభీమ మూర్తి యైన
బలుఁడు ధూమ్రాక్షుఁ డుత్సాహ మలరనబ్ధి
వలె కపిబలంబు గనె రామపాలితమును. 772

## -: ధూమ్రాక్ష యుద్ధ వర్ణన :-

వ. అంతట భీమపరాక్రమము గల ధూమ్రాక్షుఁడు యుద్ధసన్నద్ధుఁడయి రాఁగాఁ జూచి ప్రహర్షముతో యుద్ధకాంక్షులయి గర్జించి ఘోషముచేసిరి. అంత అన్యోన్యము వృక్షములతోడ శూలముద్గరములతోఁ గొట్టికొను వానర రాక్షసులకు ఘోరమగు తుముల యుద్ధము జరిగె. 773

ఘోర పరిఘలచేఁ గ్రూరశూలాలచే
శరములచే రాక్షసులు కొట్ట
చెట్లచే ఱాళ్ళచే చేతులఁ బిడికిళ్ళ
మోచేతులన్ గపుల్ మోదినారు
గ్రద్ద యాకశరాల గదల పట్టసముల
కూట ముద్గరములఁ గొట్టి రసురు
లంత వానరు లగ్గి హడలకుండగ భీమ
కర్మ గూలిచిరి రాక్షస గణాల

బాణముల శూలములఁ గపుల్ భంగపడఁగ
చెట్ల ఱాళ్ళ దైత్యులఁ గపుల్ చెండినారు
ఒకరి నొకరు గొట్టుచు వృద్ధి నొందుచుండ
పేర్లు చెప్పి దైత్యులఁ గపుల్ ప్రీల్చినారు. 774

కొందఱు దైత్యులన్ గెలువఁ గోరు గపీంద్రులు చంపినారికన్
కొందఱు రక్తభోజనులు కూలిరి రక్తము నోటఁ గ్రక్కుచున్
కొందఱఁ బ్రక్కఁ జీలిచిరి కొందఱు చెట్లను కుప్పయైరటన్
కొందఱు ఱాళ్ళఁ బిండయిరి, కొందఱ చీల్చిరి పండ్లచేఁ గపుల్. 775

విరిగిన జెండాల భిన్నమౌ ఖరముల
కూలిపోయి పడు రథాలచేత
పడిన రాక్షసులచేఁ బర్వతాభ గజాల
కపితతి చిమ్ము శృంగాలచేత
పిండియౌ గుఱ్ఱాల ప్రేలురౌతుల చేత
ఎగిరెగురు ప్లవంగ విగతి చేత
ప్లవగుల గోళ్ళచే వడితెగు దైత్యుల
నెఱబండలట్టి మొండెముల చేత

జుట్టు చెల్లాచెదరయి యిట్టట్లు తెగియు
కూలు దైత్యుల పెద్దశీర్షాలచేత
కదనమున మూర్ఛపడిన రాక్షసులచేత
నెత్తురు గంధాల రణభూమి నిండిపోయె. 776

పరమ సంక్రుద్ధులై వరరాక్షసులు వేగ
నురు వానరుల పైకి నుఱికినారు
వజ్రాభ మైనట్టి పాణితలములచే
నాకపులను గొట్టి యార్చినారు
పరువెత్తి వానరుల్ పై పడు దైత్యులన్
గుప్పిళ్ళచేఁ బళ్ళఁ గొట్టినారు
చెట్లచే మోదగ నట్లు రాక్షసు లార్చి
చెడుచుఁ గాళ్ళకు బుద్ధి చెప్పినారు

సైన్యములు పాఱఁజూచి రాక్షస వరుండు
ఘనుండు ధూమ్రాక్షుడును నల్గి కపుల పైకి
విఱిగి పడి ఘోరమైన సంగరము చేసి
దొరికినట్టి వానరులను దునిమివైచె. 777

ప్రాసాలఁ గపులను రాక్షసుల్ పొడిచిరి
వడిరక్తములు కాఱఁబడిరి కపులు
ముద్గరంబులచేత మోదఁగఁ బడి కపుల్
క్షోణీ తలంబునఁ గూలినారు
పరిఘల మథితులై పరశుల హతులౌచు
భిండివాలములచే ప్రేల్చఁబడిరి
పట్టసంబులఁ గొట్టి బిట్టు విహ్వలు లౌచు
ప్రాణంబులను వీడి వ్రాలినారు

శూలముల హతిన్ దడిసి శోణితముల
రాక్షసులు తఱుమగఁబాఱె ప్లవగ వితతి
హృదయములు భిన్నములు కాగ వ్రీలఁ బ్రక్క
లపుడు దాంత్రత్రిశూలాల నణఁచినారు. 778

అని యుగ్రంబయి దైత్యవానరులచే నత్యంతమున్ సంకులం
బునునై గర్జనతర్జనన్ బహుళమై భూమీరుహాలన్ శిలా
గణపాతంబుల వ్యాకులంబు నయి * హిక్కాతాళయుక్తంబునై
ధనురాస్ఫాలన తంత్రి మంద్ర మయి యుద్ధంబయ్యె సంగీతమై. 779

అటు ధూమ్రాక్షుఁడు విల్లు దాలిచి పరీహాసాలఁ గీశాళిపై
విటోతాటం బొనరించుచున్ శరములన్ వేగంబ వర్షింప వుం
గటవారున్ బరువెత్త మారుతి శిలాఖండంబు పైకెత్తి యుం
తట ధూమ్రాక్షు రథానపైచె నలుకన్ తంత్రడింబలెన్ శూరుడై. 780

---

* హిక్కలు = ఎక్కిళ్ళు తాళములుగ, వింటి నారి మ్రోత వీణాతంత్రుః ధ్వని. యుద్ధము సంగీతము నృత్త గీత వాద్య మయ్యె నని భావము.

తనపైకిన్ పడుచున్న యాశిలను చెంతంజూచి ధూమ్రాక్షుఁ డం
తనె వేగన్ గదయెత్తి వేయుటకి క్రింపన్ నిల్వఁగా నారథం
బును నశ్వంబులతోడఁ జక్రము ధ్వజంబున్ ఛిన్నభగ్నమ్ముఁజే
సినదై యాశిల చాపమున్ విఱిచి యాచెంతన్ బడెన్ నేలపై. 781

అటు భంజించి రథంబు వెంటనెమొదళ్ళంటం దరుల్ పీకి యు
ద్భటు డౌచున్ విహరింప రాక్షసులు మూర్ధంబుల్ బురిన్ రాల నె
త్తుట గాత్రంబులు దోగి పోఁ హనుమంతుం డద్రి శృంగంబు నొ
క్కటి పై కెత్తి యెదుర్కొనెన్ దనుమ నుగ్రాకారు ధూమ్రాక్షునిన్. 782

వడి ధూమ్రాక్షుఁడు శౌర్యమొప్పగ గదన్ బైకెత్తి వర్ధిల్లి యి
ట్టుడి వేగంబున నాంజనేయు తలపై వైవంగ నాదెబ్బకున్
హడలం బోపక యాంజనేయుఁడును వీర్యంబొప్ప శృంగంబు పె
న్వడి ధూమ్రాక్షు శిరస్సు మధ్యఁ బడగా వైచెన్ భువిం గూలఁగా. 783

గిరిశృంగంబునఁ గొట్టగాఁబడి యిలన్ కీర్ణంబ యౌకొండ మా
దిరి ధూమ్రాక్షుఁడు కూలిచావఁ గని యెంతే భీతులై చావఁగా
దరి శేషించిన రాక్షసుల్ కపులబాధల్ పొంది లంకాపురిన్
జొఱ నామారుతి నెత్తురిటేరులను నచ్చోఁ గూర్చి మెప్పున్ గానెన్. 784

అటు ధూమ్రాక్షుఁడు చంపఁగాఁ బడియె నంచాలించి యారావణుం
డటఁ గ్రోధమ్మునఁ బాము వోలికను రోషావిష్టుఁడై వెచ్చయా
నటు నిట్టూర్చుచు వజ్రదంష్ట్రుని నాహ్వానించి వాక్రుచ్చె నీ
వటు దైత్యావళి తోడు రాఁదునుము మీయారాము సుగ్రీవునిన్. 785

అన నట్లే సరియంచుఁ బెక్కులగుసైన్యంబుల్ తనుంగొల్వఁ గ
న్నన మాయావి ఖరాలు పూన్చు రథమున్ నాగంబులన్ శృంగంబులున్
గాని కేతుధ్వజముల్ చలింప నటు పెక్కుల్ చిత్రకేయూరముల్
ఘనమౌళిన్ ముకుటంబు మీఱ రథమింకన్ జుట్టి రాఁగాఁజనెన్. 786

ముసలాలన్ గదలన్ త్రిశూలములతో ముష్టిస్థమౌ యష్టులన్
నిశితాస్త్రంబుల భిండిపాలములతో నిస్త్రింశ చక్రాలఁ బ
ట్టిస పాశంబుల గంబ్ర గొడ్డళుల గాఢాగ్రాలతో మీఱి స
ద్వ్యసనంబుల్ ధరియించి బైల్వెడలి రాదైత్యుల్ సుదీప్తాంగులై. 786

నడయాడం గల యుద్రుల్లట్లు ఘనమౌ నాగాల పై కెక్కియున్
దృఢమై యొప్పెడి తోమరాంకుశములెన్నోఁ దాల్చి వర్షాల వె
ల్వడు కార్ముఖ్యాల దండునా నుఱుముచున్ బల్యోధులా వాలిపు
త్త్రుఁడెయౌ నంగదు డున్న దక్షిణపు ద్వారోద్దేశమున్ జేరగన్. 787

అశుభంబుల్ గనుపట్టె మేఘములె లే కామింట నుల్కల్ పడెన్
అశివంబై పలునక్క లగ్నిశిఖ లొయ్యం గ్రక్కుచుం గూసె రా
క్షస సంహారమె యౌనటంచు మృగముల్ గాటంబుగాఁ జెప్ప మా
నసముల్ భీతిల మోహమొంది భటులు న్గంపించి రత్యంతమున్. 7

ఇటు లుత్పాతము లెన్నొ నాల్గుదిశలన్ వీక్షించియున్ ధీరుడై
పటు వీర్యుండగు వజ్రదంష్ట్రుడు మహావర్చస్వి యుద్ధొత్సుకుం
డట నిర్లక్ష్యము చేసి బైల్వెడలె దిక్ప్రాంతాలు మార్మ్రోగనం
తటనవ్వానరులున్ పొనర్చిరి మహాధ్వానాల్ జయాకాంక్షులై.

అపు డన్యోన్యముఁ జంపఁగోరి కపు లుగ్రాకారులౌ దైత్యులున్
విపులోర్విన్ తుములంబుగా రణము గావింపంగ నంగాల ర
క్తపుఁ గాల్వల్ ప్రవహింప మేనులు మెడల్ గాత్రాలు కూలంగ ఘో
రపు భీభత్సపు దృశ్యముల్ మిగులఁ గండ్లంగట్టె నయ్యాజిలో.

కొంద రొండొరుఁజేరి కొట్టి పరిఘలతో
నని మరలక చిమ్మి రాయుధములు
కొంద ఱస్త్రాల్ డీకొడి ద్వంద్వరణంబు
చేతఁ గాళ్ళ ముష్టులఁ జేసినారు

కొండలు చెట్లతోఁగొట్టి మోకాళ్ళతోఁ
గ్రుమ్మి దైత్యుల మేనుగూల్చినారు
కొందఱు చెట్లతోఁగొట్టి పిండిగఁజేసి
యుద్ధ దుర్మద కపు లార్చినారు.

అపుడు వజ్రదంష్ట్రుఁడు నాజి నమ్ములేసి
యయ్యె అయుకాల పాశ ధరాంతకుండు
వివిధ శస్త్రాలు దాల్చి యాహవమునందుఁ
గపులఁ గూల్చి రల్గిపడు రాక్షసులు రెచ్చి. 790

పడిగాఁ గొట్టబడి దైత్యులన్‌గని తరుల్ బైకెత్తియున్ శోణితా
క్షుఁడయై యంగదుడంత సింహమువలె క్షుద్రోద్య సత్త్వాలం బకెన్
కడు ఘోరంబగు నాజిలోఁ దలలవేగన్‌కూల్చి ఖండింపగా
బడు వృక్షంబులు వోలె వ్రాలి రచటన్ పైశంబ యారాక్షసుల్. 791

కపులన్ దైత్యుల రథములు కరిహయాలు
తనువులును రక్తములు గప్ప ధరణియెల్ల
భయదమే యయ్యెఁ గేయూర వస్త్ర హార
రత్న శస్త్రాల ధర శరద్రాత్రి యయ్యె 792

అంగదుని పరాక్రమ రయంబు చేత
ఆమహారాక్షస బలంబు అన్ని కూడ
అతిగఁ గంపించి పోయెను నట్టితఱిని,
మారుతము చేత మేఘంబు మాడ్కి నపుడె. 793

వ. అంతట తనబలమును గూల్చి యంగదుఁడు జయించుటను జూచి క్రోధావిష్టుఁడయి మహాబలుడగు వజ్రదంష్ట్రుఁడు శక్రాశనితో సమమగు ధ్వని గలుగు తనఘోర ధనుస్సును సారించి శరవర్షములచే వానరసేనలను [illegible]

వందఱ చేసె. అపుడు ముఖ్యరాక్షసులు కూడ రథము లెక్కినానావిధాయుధము లతో రణమునఁ బోరాడిరి. వానర శూరులును శిలలను ధరించి యన్ని యెడల పోరిరి. ఆయుద్ధమున రాక్షసులు కపివరులపైని నానావిధ శస్త్రములనుప్రయోగించిరి. మత్త మాతంగముల వంటి వానరులు రాక్షసుల పైని గిరులు వడవైచిరి. ఇట్లు గోరముగ యుద్ధము చేయుచు రణమునుండి మరలకుండ రాక్షస వీరులు పోరాడిరి. కొందఱకు శిరస్సులు భిన్నమైనవి. కొందఱకు పాదములు తెగినవి. కొందఱకు బాహువులు తెగినవి. కొందఱుశస్త్రములకుదేహములర్పించి రక్తముతో తడిసిరి. భూమి నాశ్రయించి వానరులురాక్షసులును పడియుండిరి. అందు గ్రద్దలు డేగలు శ్యేనవిశేషములు నక్కలు గుంపులు గుంపులుగ తిరుగ సాగినవి. భీతులకు భయంకరమై భుజపాటి శిరస్సులు తెగి మొండెములు పడిపోగ, ఆరణమున వానరులును రాక్షసులును హతులై పడిరి. అంత. 794

—: అంగదుచే వజ్రదంష్ట్రుడు కూలుట :—

అపు డావానరసేనచేత సకలంబౌ దైత్యసైన్యంబు గో
రపు నాశంబును బొందుచుండఁ గని శాత్రమాక్షుంఁడు వీరుండు వ
జ్రపు దంష్ట్రల్గల వజ్రదంష్ట్రుఁడు వడిన్ చాపంబు చేదాల్చి యా
కపిసేనన్ బుజు కంకపత్రపు శరగ్రామాన జీల్చెన్ గడున్. 1

మఱి తొమ్మండుగు రేడ్గు రైదుగురు నెన్మండ్రౌ కపివ్రాతమున్
శర మొక్కొక్కటి వజ్రదంష్ట్రుఁడును విల్సారించి వేయంగ వా
నర సంఘంబులు భీతులై తెగిన కంఠాలన్ గరంబంగదున్
శరణం బొందఁగ వేగఁ బర్విడెఁ బ్రజల్ ప్రస్ఫంబలెన్ భీతితో. 8

అటులన్ బర్విడు వానరవ్రజము నద్దా నుంగదుం డాపి యి
ట్టటు పైకింగను వజ్రదంష్ట్రిపయి కత్యంతంబు చూడంగ ం
తటనాయిర్వురు కూడి మత్తకరులో నా ద్వంద్వయుద్ధంబులన్
బటుతన్ జేయఁగ వజ్రదంష్ట్రుఁడు మహాశౌర్యంబు సెంపారఁగన్. 797

అటువే నమ్ములు వేసి తోమరములన్ హస్తింబరెన్ మర్మలం
దట కాయించుచు గొట్ట నంగదుఁడు సర్వాంగంబులన్ బిట్టు సె
త్తుటిచేఁ దడ్సియు వజ్రదంష్ట్రిపయికిన్ దూర్ణంబు వృక్షంబు వే
యుటయున్ సంభ్రమ మొందకుండ దనుజుం డోజస్వి కూల్చెన్‌వెసన్ 798

తరు పుర్వింబడ వజ్రదంష్ట్రిని సమర్థత్వంబు వీక్షించి వా
నరశార్దూలుఁడు గొప్పకొండను పడిం దద్దైత్యుపై వేసి బి
ట్టుఅవన్ బైపడు కొండఁగన్గొని రథంబందుండి వేదూకి యా
వర దైత్యుండు గదన్ ధరించి ధర నిల్వన్ వేగ నాకొండయున్. 799

త్వరగా వ్రాలుచు వజ్రదంష్ట్రిని గదన్ భంజింప నాయంగదుం
డరదంబున్ రథచక్రకూబరము నీయశ్వంబులన్ గూల్చగన్
తరు విభ్రాజిత మైన యొండుగిరి చేతంబట్టి యావజ్ర దం
ష్ట్రి రయంబున్ తలమీదఁ గొట్టగ నతండున్ నెత్తుర్తో మూర్ఛిలెన్.800

క్షణ మాదైత్యుడు మూర్ఛహొందియు గదన్ గౌఁగింటిలోఁ గుచ్చి వె
చ్చని నిట్టూర్చుచు సంజ్ఞ పొంది ధృతి నాస్థానంబునన్ వాలిపు
త్రుని మేనన్ గదతోడఁ గొట్టి గదనే తూర్ణంబ వర్జించి వెం
టనె యయ్యంగదుఁ గ్రుమ్మ నిద్దఱకు ముష్టాముష్టి పోరేర్పడెన్. 801

ఒక రొక్కక్కరిఁ గొట్టుకొంచు రుధిరం బుండుండిపల్ గ్రక్కు, చో
డక యంగారకుఁడున్ బుధుండువలెముష్టాముష్టి ఘాతంబులన్
సకలాంగంబులఁ గొట్టుకొంచు మిగులన్ శ్రాంతింపఁ దేజస్వి ని
ల్వక యాయంగదుఁ డొక్కచెట్టు వడి వ్రేళ్ళం బీకిపూల్ పండ్లతో. 802

కొట్టన్ గన్గొని వజ్రదంష్ట్రుడును నుగ్రుండౌచు నాచెట్టు వే
పట్టన్ ఖడ్గము నంగదుండు గొనఁగా వైళంబ దైత్యుం డసిన్
బట్టంగా వృష చర్మ మువ్వ లలరన్ వారిర్వురున్
చెట్టాపట్టముఁ బట్టి కొట్టుకొని రాచెంతన్ జయాకాంక్షులై. 803

వ్రణముల్ సెత్తుట విచ్చు మోదుగుల యట్లే క్రాంతి జానుల్ నిలన్
క్షణమాత్రంబున లేచి యంగదుఁ డటన్ చక్షుల్ ప్రకాశింపఁగా
గని దండాహత సర్ప మట్లమలమౌ ఖడ్గాన దద్దైత్యు నా
ఘనశీర్షంబును గొట్ట వాఁడు పడె రక్తార్ద్రాంగుఁడై రెండుగా. 804

అటులన్ గ్రూరుఁడు వజ్రదంష్ట్రుఁడు మృతుండౌటన్ గనుం గొంచునం
తట దైత్యులు భయభీతులై కపులబాధన్ గ్రుక్కుచున్ లంకకై
పటు దీనాననులై యవాఙ్ముఖులునై యార్తిన్ జనన్ శక్రుఁడా
పటులౌ దేవులతో వలెన్ నిలిచె తేవన్ వాలిపుత్త్రుం డటన్. 805

వ. పిదప వాలిపుత్త్రు డయిన యంగదుచేత వజ్రదంష్ట్రుడు చంప బడి నట్లు విని కృతాంజలి యయి దగ్గఱ నున్న సేనాధిపతితో రావణుఁ డిట్లనె ఎదురొ్కన రాని భీమవిక్రము లైన రాక్షసులు శీఘ్రముగ సర్వశాస్త్రకోవిదుఁ డైన యకంపనుని ముందుంచు కొని బయలు దేఱుదురుగాక. 806

## —: అకంపనుని రావణుడు పంపుట :—

ఇతఁడే నేతయు శాసకుఁ
డితఁడే రక్షకుఁడు యుద్ధకృత్య విదుండున్
ఇతఁ డెప్పుడు సమర ప్రియు
డితఁడిప్పుడును నాదుక్షేమ మెంచెడి వాఁడున్. 81

ఇతఁ డారాఘవుల గెలుచు
నితఁడే సుగ్రీవు బలుని నిట్టే గెలుచున్
ఇతఁడే వానరుల గెలుచు
నితఁడే మఱి ఘోరులయిన యితరులఁ జంపున్. 808

అని రావణుఁ డనఁగఁ దదా
జ్ఞను గొని సైన్యాధిపతియు సైన్యముఁ ద్వరపె
ట్టెను, నంత వివిధశస్త్రము
లను గొని యసుర వరులరిగి రధిపతి యాజ్ఞన్. 809

అవలన్ మేలిపసిండి కుండలములల్లాడంగ మేఘాభుఁడై
సహితశేషా భ్రపురంగు గల్గి జలదస్వానంబు మీఱన్ భయాకారదా
నవులెల్లన్ దనునావరింప రవియోనాఁ దేజమొప్పన్ సురా
ద్యవి కంప్యుండగు నాయకం పనుఁడు 'నంతన్వచ్చెఁ దేరెక్కియున్. 810

అసురిమేలి పసిఁడి కుండలములఁ దాల్చి
మబ్బురంగొప్ప మబ్బయి మబ్బులుఱుము
వంటి ధ్వని నకంప నుఁడంత బయలుదేఱె
తనుభయంకరాక్షసులనుసరింప. 811

కరము యుద్ధసంరంభమై పరువులెత్త
ఱటుకున- రథమూను కరులతో దైన్యమొందె
ఎంతో పోరఁగోరెడి వానియెడమ కన్ను
అదరె మోమువాడె ధ్వని గద్గదమయయ్యె. 812

సుదినమును దుర్దినంబయ్యెఁ జొచ్చెగాలి
పక్షులును మృగాల్యుగ్రమై పాఱియఱచె
వీనిగణియింపకయె వ్యాఘ్ర విక్రముండు
అసుర సింహసమపక్కొందుఁ డాజికేగె. 813

అటు లాతం గసురాళితో వెడలఁ సంక్షోభిం చిన
ట్లట ధ్వానంబులు గొప్పవై యడరఁగా నాశ ంచి యం
తటఁ గంగారుగ వేగవానరుల సేనన్ వృక్ష గముల్
వటు శస్త్రాస్త్రలుగఁ దాల్చియేగిరి రణప్రావీణ్య పారగా. 814

అట నత్యంతము రామ రావణులకై ప్రాణంబులన్ త్యజిం
చుట కైనన్ మదిలోన సిద్ధపడి రక్షోవానరుల్ కోరినా
రిట వారెల్లరు గొప్పశక్తిగల వారెల్లండ్రు శైలోపముల్
ఇట నావానరదైత్యు లొండొరులణంగింపంగ వాంఛింత్రెదన్. 815

ఆజిలో వేగమై యన్యోన్యమును పోరు
వీరి గర్జిత ఘోష వినఁగఁబడియె
కపి రాక్షసుల్ లేవఁ గడు భీకరంబయి
యరుణమై ధూళులు నపుడు లేచె
కేశీయ పాండువై కడు దుమ్ముచే నాజిఁ
బ్రాణులు కనఁబడ కణఁగిపోయె
ధ్వజములుగాని పతాకలు కవచమేన్
కరులాయుధములేన్ గానఁబడవు

పరువులెత్త గర్జించుచు వానరుల య
సురుల ధ్వని గాని రూపము లరయుబడవు
ఆగ్గి యాకపులె కపుల నణంచుచుండ్రు
ఈ యసురులె యసురుల వధింతు రిరుల. 816

తమవారిన్ బరులన్ వధించుచును రక్తార్ద్రంబు పంకానులే
సము ధాత్రిన్ బొనరింత్రు నెత్తువరదన్ బాసెన్ రజంబెల్ల ఈ
క్షమయెల్లన్ శవకీర్ణమై తనరె వృక్ష ప్రాస శక్త్యాది శ
స్త్రములన్ తోమర శూల పట్టస శిలాస్త్రాలన్ వధింత్రాఁ డొరుల్. 717

పరిఘలట్టి బాహువులచే గిరుల వంటి
కపులు దైత్యులన్ జంపిరి కదనమందు
రాక్షసులుం గూడం గ్రుద్ధులై ప్రాసశస్త్ర
తోమరములచేం గపులను తొరగం గూల్చి. 818

దైత్యవరు డకంపనుండు క్రోధమునం గపులం
జంపుచును దైత్యులకు సంతసంబు గూర్చె
కపులుగూడ దైత్యులను వృక్షములు దాళ్ళు
వేసి శస్త్రంబులును ద్రోసి వ్రీల్చినారు. 819

ఇంతలోపల వీరులై యేర్చి నలుండు
కుముద మైంద ద్వివిదులను గూడిరాంగ
నధికవేగాన దైత్య సైన్యములనెల్ల
చెట్లతోం గొట్టుచును గపుల్ చెనకి రరుల. 820

—: అకంపనుని యుద్ధవిజృంభణము :—

వ. అట్లు వానరశ్రేష్ఠులు మహాకర్మలం గావించుచుండం జూచి యకంప
నుడు తీవ్రముగా బోరంబొడగి క్రోధ మూర్ఛితుండై మహాధనుస్సును గంపిం
పంజేయుచు సారధితో నిట్లనియె. సారధీ ! నీవు శీఘ్రముగా వానరులు అసురు
లను నెక్కువగాం జంపుచోటికి రథమును తీసుకొని పొమ్ము. ఇదిగో ఇచ్చట
భీమకాయులైన వానరులు చెట్లు పర్వతములు ఆయుధములుగాం దీసికొని
నాయెదుట నిల్చియుండిరి. సమరమును మెచ్చుకొనుచున్న వీరిని వధింప
గోరుచున్నాను. ఈవానరులె రాక్షసబలమునంతను జంపినట్లు కనబడుచున్నది.
అని అప్పుడు సారధి రథముతోల మహారథికుం డయిన యకంపనుండు వేగము
గల యశ్వములు రథమును లాగుచుండ శరజాలములచే నా వానరుల నెదు
ర్కొనియె. 821

అనిలో వీరుఁడెయౌ నకంపనుని ముంగ[illegible]రుల్ నిల్వనై
ననె లేరేయిఁక పోరుఁగూర్చి యెటులన్ [illegible]క్రువ్వఁగానౌ నకం
పను బాణంబులచేత నందఱును భగ్నా[illegible]లై పాటి ర
ట్లను నామృత్యు నధీనులౌ కపుల నొయ్య[illegible]జూచి హన్మంతుఁడున్. 822

ద్రుతమొప్పన్ జని యా యకంపను నెదు[illegible]ర్కొఁజూచి యా వానరుల్
మతి ధైర్యంబున మెచ్చి తేరి ధృతి సమ్మాన్యున్ గడున్ మారుతిన్
ధృతిసమ్మాన్యులు వారు చుట్టుకొనఁగా నీక్షించి యాదైత్యుడున్
ధృతితోడన్ హనుమంతు నమ్ముల నెదిర్చె[illegible] నీళ్ళ నింద్రుండటుల్. 823

తన పై నింబడు బాణజాలముల నంతన్ లె[illegible]గై కోక యా
హనుమంతుండు నకంపనుం దునుమఁగా [illegible]త్మవ్రతంబూని వెం
టనె ధాత్రిం వడకించుచున్ దనుజుపైనం [illegible]రికి పల్ తేజుతో
ననలుం డట్టుల నైపరానిగతితో నద్రిం బె[illegible]బ్బెన్ వడిన్. 824

అటు లాయద్రి పెకల్చి యొక్కచెయితో [illegible]శైలముం ద్రిప్పి [illegible]
తట తానానము చిన్ సురేంద్రుఁడనితో [illegible]శిచే [illegible]ద్రిదు
ర్చుటయున్ జూచి [illegible]కంపనుండు వడి [illegible]ర్ధచంద్రాస్త్ర మే
యుటయున్ దద్గిరి వ్రీలి ముక్కలయి [illegible]యుర్వి బడెన్ శీఘ్రమే. 825

అపు డాశైలము ముక్కలై పడుటచే నాయాంజనేయుండు ను
గ్రపు రూపంబునఁ గ్రోధ మూర్ఛితుడెయై గర్వాన నుత్తుంగమై
విపులంబై తగు మద్దిచెట్టును వడిన్ వ్రేళ్లూడఁగాఁ బీకి దై
త్యు పయిన్ వేయుటకై మహాద్రి నటులన్ దూర్ణంబుగాఁ దిప్పుచున్. 826

పరువుల్ దీయుచు నూరువేగముననే శైలంబ వృక్షంబులన్
విఱుగం గొట్టుచుఁ గాళ్ళతోడ ధరణిన్ వ్రీలంగ ధట్టించుచున్
కదులన్ మావటులన్ రథాల్ రథికులన్ గాల్బంటులౌ దైత్యులన్
త్వరగాఁ గూల్చుచుఁ గ్రుద్ధుఁ డంతకుఁ డటుల్ తానై విజృంభింపగన్.

## —: అకంపనుని హనుమంతుఁడు చంపుట :—

కనుచుం గాళ్ళకు బుద్ధి చెప్పి దనుజుల్ కష్టాబ్ధిలో మున్గఁగం
గనివేగన్ హనుమంతుపై కుఱికి యుగ్రాకారుఁడై బిట్టు గ
ర్జన గావించుచు నా యకంపనుఁడు నస్త్రాళిలెంచి పద్మాలుగా
హనుమంతున్ వడి భిన్నుఁ జేసి యురచెన్ ప్రాణాంతకుం డట్టులన్. 828

అటు వర్షించిన బాణవృష్టికతిచే నామారుతిం గొట్ట నం
తట నామారుతిచెట్లు మొల్చిన మహేంద్రం బట్లు గన్పించె ముం
దట ధూమంబులె లేని యగ్నివలె పుల్లాశోకముంబోలె నా
దట నిల్చుండి తరాల్ను నొక్కతరువంతం బీకి యాదైత్యునిన్. 829

తలపైఁ గొట్ట మహాత్ముచేఁ దరువుచేతం గొట్టఁగాఁ బడ్డ యా
ఖలుఁ డైనట్టి యకంపనుండు పడ భూకంపంబునన్ వృక్షముల్
వలె దైత్యాలి వడంకి యాయుధములన్ వర్జించి వేపాఱి య
ప్పల లంకాపురివైపు పోయి అఱచేఁ బ్రాణమ్ములన్నిల్పుచున్. 830

వ. మఱియు నీరాక్షసులు జుట్టుముడులు వీడ కంగారుగా నోడిపాఱుచు అంగముల చెమటలుకాఱ రోజుచు రొప్పుచు పరువెత్తుచు ఒండొరులఁగొట్టుకొనుచు భయముచే మాటికి మాటికి వెనుకవైపు చూచుచు మూఢులై పాఱిఁ వారంతట లంకను ప్రవేశింపగా వానరులందరు హనుమంతుని జుట్టుకొని పూజించుచు మెచ్చుచుండ నతండును ఆ వానరుల ననుకూలముగ నభినందించి సత్త్వయుక్తుఁడయి యుండ జయంబులతో గర్వించిన వానరులు గర్జించి కేకలువేయుచు మరల ప్రాణావశిష్టులగు రాక్షసుల లాగిరి. అట్లు మారుతి రాక్షసులఁజంపి సేనాముఖమున విష్ణువు బలినిబోలె మహాభీముడయిన మహాసురుంజంపి మహావీరుడను శోభపొందె. అపుడు దేవతాగణములు స్వయముగా రాముఁడు అతిబలుండయిన లక్ష్మణుఁడు సుగ్రీవ ప్రముఖులయిన వాన

రేంద్రులు మహాబలుండయిన విభీషణుండ ంచి పూజించిరి. అంత రావణుండు-

ఆయకంపనువధ విని యలిగి సుం
దీనముఖుండై సచివులపైఁ దేఱిచూ
క్షణము ధ్యానించి మంత్రులన్ సం
యనిని వ్యూహము లుదయాన వర నియె. 831

రాక్షస వ్యూహములచేత రక్షితమయి
ధ్వజపతాకల మాలలఁ దనరు లంక
అరులచే రుద్ధమై యుంట యరసి
రణనిపుణుండౌ ప్రహస్తుతో ననియెనిట్లు. 832

—: రావణుఁడు ప్రహస్తుని బంపుట :—

రణనిపుణ! పురమెల్ల నాక్రమణ నుండె
త్రుటి హఠాత్తుగ పురము శత్రువులవలన
పీడితం బయ్యె, రణము గావించుకంటె
దీనికిని వేఱు మోక్షము గానఁబడదు. 833

నేనొ కుంభకర్ణుండొ సేనాని నీవొ
ఇంద్రజిత్తొ నికుంభుఁడొ యిట్టి బరువు
పూనఁ గల రిందుచే నీవు సేననెల్ల
నిపుడె గైకొని కపుల నిర్జింపఁ జనుము 834

అనికిన్ నీవును బెలుదేఱఁ జపలంబౌ వానరానీక మె
ల్లను దైత్యేంద్రుల గర్జనల్ వినుచు నీరై కారి వేజారి పా
ఱును నావానరులో సుశిక్షితులు ధీరుల్ గా రవశ్యంబు, వా
రణముల్ సింహనినాదముల్ బలిమియున్ సైపంగ లేకెట్టులున్. 835

తన బలము పాఱ రాముఁం
డును శోకముడుచియె తా కడుంగడు స్వవశ
మున లేక నిరాశ్రయుఁడై
విను నీవశమును వేగమె పొందున్. 836

ఇటు మనమూరకున్న వధియించుట ఖాయము యూరుకోకయే
యెటొ చొరవూని యుద్ధమొనరించిన మృత్యువొ గెల్పొ యౌనుగా
ఇట నిఁకఁ జావె ఖాయమ్ముగ నిచ్చెడి మౌనముకంటె పోరుచున్
ఇబు మరిచావొ గెల్పొ గలిగించెడి యుద్ధమె శ్రేష్ఠమౌఁ జుమీ. 837

ఇఁక నిటు వనుకూలమును ప్ర
తికూలమును సరిగఁ జూచి తిన్నని మార్గం
బె కయికొనుట యుక్తం బగు
నిక నిట మనకెది హితమొ వచింపుమి యిపుడే. 838

అని యూరావణుఁ డట్లు చెప్ప విని శుక్రాచార్యుఁ డారాక్షసేం
ద్రునితోఁ బోలె దశాస్యుతోడుతఁ బ్రహస్తుం డిట్లు వాక్రుచ్చె నో
దనుజేంద్రా! మును నేర్పు గల్గిన యమాత్యశ్రేణితోఁగూడ మం
తన మయ్యెం బరికింప నొండొరులకున్ గల్గెన్వివాదం బటన్. 839

సీత నిడుటయె వరమని చెప్పఁబడియె
సరియె యిఁక నివ్వకున్న సంగరమె ధ్రువము
సాంత్వముగఁ జెప్పె దేల నిష్టమునుజేయ
వా సతీధనాదిక రక్షణమ్ము చేయు. 840

ఆజి నీకయి జీవిత మాహుతి గను
చేయు నను నీవును రక్షింపు మనుచు
సైన్యపతి ప్రహస్తుండు దశాస్యుఁ బలికి
ఎదుట నున్న సేనాముల నెంచి పలికె. 841

వెంటనే దైత్యబలము రప్పింపుఁ డిటకు
నాదుతీవ్ర బాణాశని త్వరగ జంపన
వానరుల మాంసములు తిని వన విహంగ
బృందములు కడుతృప్తిని పొందుఁగాక. 842

వ. అని ప్రహస్తుఁడు పలుక ఆ సేనానులు తొందరగా ఆ రావణుని మందిరము దగ్గర బలము కూర్చిరి. అపుడు క్షణములో వక్రములైన నానాయుధములు ధరించిన వీరులతో గజములతో లంక నిండిపోయె. 843

దనుజు లగ్నుల్ ప్రేల్చి తగు బ్రాహ్మణుల మ్రొక్కఁ
గడు నాజ్య సురభితో గాలి వీచె
జయమంత్ర మంత్రితం బయి యొప్పు మాలలు
గల రాక్షసులు పోర నెలమిఁ జనిరి
విండ్లు కవచముల్ వేదాల్చి రావణుఁ
జూచి మ్రొక్కి ప్రహస్తుఁ జుట్టినారు
రాజు వీడ్కొని భేరి రయమున మ్రోగించి
యట దివ్యరథము ప్రహస్తుఁ డెక్కె

గొప్పధ్వజము గల్గ హయాలఁ గూర్చి కొట్టి
సూతుఁడును తోల మేఘంబు భాతి మ్రోగి
రవి శశి ద్యుతి మీఱ సర్ప ధ్వజాన
పసిడి జాలాల శ్రీనవ్వ మెసలె రథము. 844

అటులస్ స్యందన మెక్కి రావణుని తీవ్రాజ్ఞన్ తలందాల్చి యుం
తట లంకాపురినుండి బైల్వెడలి దైత్యశ్రేణి రాఁగా హుటా
హుటి మేఘధ్వనివంటి దుంధుభుల చక్షాప్పార నేపారి ముం
గట సంద్రంబున నింపునట్టులను శంఖధ్వాన మొప్పెన్ గడున్. 845

భీమ మహాకాయు వికృతరాక్షసు లార్చి
యేర్చుచును ప్రహస్తు నెదుటఁ జనిరి
కుంభహను నరాంతకులు సమున్నత మహా
నాదు లనెడి మంత్రు లాదుకొనిరి
వ్యూహములుగఁ బన్ని పూర్వంపు ద్వారానఁ
గరియూధ బలములు నుఱికి యేగె
సాగర ప్రతిమమౌ సైన్యమ్ము లరుదేఁఁ
గాలాంతకునిఁబోలెఁ గదలె నసుర

అతఁడు బైల్దేరు ధ్వని దైత్యు లార్చు ధ్వనులు
వినుచు లంకఁ బ్రాణులు నార్చె వికృత రీతి
మబ్బరుగు మింట నపసవ్య మండలముగ
మాంసభోజి పక్షులు రథ మావరించె. 846

: ప్రహస్తునికి దుర్నిమిత్తములగుట :

నక్క లగ్ని శిఖల వెళ్ళఁ గ్రక్కుచుండె
మింట నుల్కలు పడె గాలి మించి వీచె
గ్రహము లొకటి నొకటికడు గప్పికొనియె
పరుషముగ మబ్బుటిమి తేరిపైని తిరిగె, 847

మఱి ప్రహస్తునిముందు మబ్బు నెత్తురు కుర్సె
ధ్వజముపైఁ దగె గ్రద్ద దక్షిణముగ
గ్రద్ద యెగిరిపోక కడు రెండు ప్రక్కల
ధ్వజము గీఱి ప్రహస్తు ప్రభ హరించె
యుద్ధాలఁ దిరుగుచు నుద్ధతిఁ దోలెడు
సారథి చేకోల జాఱి పడియె
అశ్వపసుల కరుదగు ప్రహస్తుని కాంతి
పడె, సమభువి తొట్రుపడె హయాలు

బయలు దేఱెడి ప్రఖ్యాతబలుఁ బ్రహస్తు
నెదురుకొని వానరబలంబు లెన్నొ రాళ్లు
చెట్టు లాయుధంబులుగాగ స్వీకరించె
రాళ్లు చెట్లు పీకు ధ్వనులు ప్రబలిపోయె. 848

వ. వేగముగా నొండొరులను వధింపగోరుచు సమర్థులై యుద్ధము చేయుచు పరస్పరము యుద్ధమునకై ఆహ్వానించు వానరరాక్షసుల ఘోరగర్జనలు మింట వ్యాపించె. అపుడు దుర్మతియగు ప్రహస్తుఁడు అగ్నిజ్వాలలపై మిడుతవలె అతివేగమున వచ్చు సేనలను నొచ్చెను. 849

* త్రుటి బైల్దేఱెడి భీమవిక్రము ప్రహస్తున్ జూచి రాముండె అం
తట వాక్రుచ్చె యిటుల్ విభీషణునితోఁ దాల్మిం బయల్దేరు ఈ
పటు వీరుం డెవడో మహాభుజ! యనన్ వాక్రుచ్చె నాతం, డితం
డట సేనాపతి యానిశాటుకు బ్రహస్తాఖ్యుండు ప్రఖ్యాతుడున్ 850

---

* ప్రహస్తుడు మహాబలముతో బయలేరుచుండుట చేతను మహాకాయుఁడగుటచేతను ఉత్తరద్వారమందున్న రామునికి కనిపించెను.

ఇత డస్త్రజ్ఞుడు శూరు డీతని వశంబేయ్యె తగున్ రాక్షసే
శ త్రి భాగంబగు సేవ యంచు ననగా శూరా గ్ర్యులౌ వానరుల్
దితి జాధ్యక్షుడె యొ ప్రహస్తు డనికై తీవ్రంబ బైల్దేఱగా
నతిరోషంబునఁ జూచి రంతఁగడు వీర్యంబొప్ప గర్జించుచున్. 851

జయముం గోరుచు రాక్షసుల్ ముసలముల్ శక్తుల్ గదల్ శూలముల్
భయ దంబౌ వరిఘల్ శరాలు పరశుల్ ప్రాసాలు విం డ్లష్టులున్
రయమారం గొన వానరుల్ విరులచెట్లన్ పెద్దరాబండ ల
య్యయి కొమ్మల్ గొని యుద్ధముల్ సలువగా నల్లాడి రత్యంతమున్.

శిల లమ్ముల్ కురిపించి రాక్షసకపుల్ శీఘ్రంబ యన్యోన్యమున్
కలనన్ గొట్టుకొనన్ మహారణము గల్గన్ వానరుల్ దైత్యులన్
పలుదైత్యుల్ కపులన్ వధించి రిటు బీభత్సంబుకాగా జగం
బులు వీక్షింపగ లేకపోయె మహాభూతంబులున్ భీతిలెన్. 853

కొందరు శూలాల కొందఱుచక్రాలఁ
గొందరు పరిఘల కొట్టఁబడిరి
కొందరు గొడ్డళ్ళ గొందఱు బాణాలఁ
గొందరు ఖడ్గాలఁ గూల్బఁబడిరి
కొందఱు చావగఁ గొందరు గూలిరి
కొందఱు హృదిప్రీల గూలిరవని
కొందఱు తలలూడ క్షోణిపై దొర్లిరి
కొందరు పార్శ్వాల కూలబడిరి

ఇట్లు దైత్యులచే కపుల్ మృత్యు వొంద
గపులు కోపించి దైత్యుల నపుడు రెచ్చి
చెట్లు శృంగాల గుప్పిళ్ళ చేతిగముల
పిండి చేయ నెత్తురు గ్రక్కి పండి రవని. 854

కనులు దంతాలు శిథిలముల్ కాగ నపుడు
కొంద రేడ్చిరి గర్జించి కొంద రతిగ
సింహనాదాలు చేసిరి చేయు నిట్లు
దైత్యవానర తుముల నాదాలు పెరిగె, 855

అలిగి రాక్షసుల్ వానరు లపుడు రెచ్చి
యుద్ధ కౌశలమును జూపుచుండి మిగుల
కండ్లు త్రిప్పుచు భయము లేకయుం గరుబు
ఘోర కర్మలు గావించిరాత లపుడు. 856

కురిభహను నరాంతకులు సమున్నత మహా
నాద మంత్రులు కొట్టినారు కపుల
వారు వేగం గపులం బడంగొట్ట ద్వివిదుండు
నగశృంగమున నరాంతకుని గూల్చె
దుర్ముఖ కపిలేచి ద్రుమమొండువడిం బీకి
ఆసమున్నతు వేగ హతు నొనర్చె
జాంబవంతుం డల్గి సంగ మహాశిలం
గ్రుమ్మి మహానాదు తొమ్ముం గూల్చె

కుంభహనువును తారుండు క్షోణినుండి
ద్రుమము పీకి నెత్తి నిడి ప్రాణములు తీసె
ఆప్రహస్తుండు రథమెక్కి యాజిలోన
ధనుసు ధరియించి ఘోరయుద్ధమును జేసె. 8!7

## —: ప్రహస్తుని మహాయుద్ధ వర్ణన :—

వ. అపుడు ప్రళయకాలమందువలె అపుడు రెండు సేనల మధ్య అప్రమేయ సాగర ఘోషమువలె మహాఘోషము బెడలె. అంత యుద్ధకోవిదు

డగు ప్రహస్తుఁడు మహాశర ప్రవాహముచేత వానరులను ఆయుద్ధమునఁ గ్రుష్ఠుఁడయి బాధించె. వానరరాక్షసుల శరీరములు పడిన పర్వతములవలె భూమియంత వ్యాప్త మయ్యె. అపుడాభూమి రక్తప్రవాహములచేతఁ గప్పబడి వసంతమున విచ్చిన మోదుగ పుష్పములచేవలె గప్పఁబడెను. 858

చచ్చిన వీరుల సంఘంబె తటముగ
నొరిగిన చెట్టు లాయుధములుగను
నెత్తుటి పఱఁదయె నీటి పూరంబుగ
యమలోక సంప్రాప్తి యబ్ధి గతిగ
యకృతు ప్లీహంబుౌ యధిక పంకమ్ముగ
నరకిన నరములె నాచుగాఁగ
పడినమేనులు తలల్ వరమ మత్స్యములుగ
వపు వంగముల వేళ్ళు పచ్చికలుగ,

గ్రద్దడేగలు హంససారసములుగ
మెదడె నురుగుగ నేడుపే యుదధిధ్వనిగ
నొప్పు భీరు దుస్తరమైన యుద్ధనదిని
అబ్ధమున నేటి దాటి రాయుభయులు
జాళ్ళ దూళి గల సరసిన్ కరులువోలె 859

ఆరదమెక్కి శరాలు కురిసి కపుల్గఁ గొట్టు
నిపుణుఁ బ్రహస్తుని నీలుఁ డరసె
అనిల మభ్రమునట్లు లాసేనను ప్రహస్తుఁ
డేర్చి పైబడు నీలు నెదుర్కొనియె
వరధన్వియుఁ బ్రహస్తుఁ డరసి విల్లెక్కిడి
నీలుపై బాణముల్ లీలఁ గురిసె
ఆ బాణములు నీలు నంగములను జొచ్చి
పాము లట్టులు వేగ వడియె భువిని,

అపుడు జ్వలనములను బోలు నాశరాలఁ
గొట్టఁబడి నీలుఁడు ప్రహస్తుఁ డట్టు లేర్చి
వీర్యవంతుడై వృక్షంబు పీకి వేగ
ఆ ప్రహస్తుని గొట్టెను నంద ఱరయ 860

అట్లు నీలుఁడుకొట్ట ప్రహస్తుఁ డపుడు
వానర బలంబుపై బాణవర్షములను
కురిసి గర్జింప వృషభంబు కరణిఁ గండ్లు
ముడిచికొని శరాల్ దాటలే కడగిస్సైచె. 861

## —: ప్రహస్తుడు నీలునిచేఁ గూలుట :—

శరవర్షంబులచేతఁ గొట్టఁబడి రోషంబూని నీలుండు న
త్తఱి వేగన్ ఘనసాలమున్ గొని బలాధ్యక్ష ప్రహస్తాశ్వముల్
ధరఁ గూలన్ బడగొట్టివి, ల్లెగిరి యంతన్‌లాగి భంజించి బి
గ్గఱ గర్జించుచు నీలుఁడున్ నిలిచె మ్రుగ్రాటోప మేపారగన్. 862

అటు విల్లున్ విరువన్ వడిన్ ముసలమున్ హస్తంబుచేతన్ హుటా
హుటిగాఁ బట్టి ప్రహస్తుఁ డారథమునందుండిన్ వడిన్ దూక నె
క్కటికయ్యంబును వాహినీపతు లటన్ గావించుచుండంగ నె
త్తుట మేనుల్ దడియుంగ మత్తకరులం దూలించి రయ్యాజిలో. 863

వెలుగుల్ చిమ్మెడి తీక్ష్ణ దంష్ట్రిలకొనన్ వేసింహశార్దూలముల్
వలె శారూలమృగేంద్ర చేష్టితములన్ బాధించుచున్ గీఱుచున్
బలముల్ చూపుచు గెల్పుకై రణభువంబందున్ గడుం
బలులై వాసవ వృత్రు లట్లయిరి స్వప్రఖ్యాతికై యత్తఱిన్. 864

వ. అంత యుద్ధసన్నద్ధుడయిన ప్రహస్తుండు నీలుని నుదుట ముసల
ముచేఁ గొట్టఁగ రక్తముకాఱి మఱియూరక్తముచే సంగములు తడుప నీలుండు
క్రుద్ధుండయి యొక మహావృక్షముపైకి ప్రహస్తుని వక్షఃస్థలమునఁ గొట్టుటయు
యాయుూహింపరాని ప్రహారముగల యాముసలమును లాగికొనుటయు నా
నీలునిపైపుగా ప్రహస్తుండు పరుగెత్తె. అట్లు వేగముగఁ బరుపెత్తుకొని వచ్చు
ప్రహస్తునిజూచి ఆ వానర శ్రేష్ఠుడగు నీలుండు ఒకపెద్దశాతిని పట్టుకొని ముస
లముతో బోరాడు ప్రహస్తుని శిరమునవేసె. 865

అపుడా మహాశిల ప్రహస్తుని శిరస్సును అనేకవిధములుగా ఛేదించె.
మొదలునఱికిన చెట్టువలె వెంటనే ప్రహస్తుడు భూమిపైఁబడియె. అంత నతడు
ప్రాణములుపోవ ఆతని శిరస్సునుండి గిరినుండిజలమువలె రక్తము ప్రవహించె
అట్లు నీలునిచే ప్రహస్తుఁడు హతుఁడుకాగా శోకించు ఆ మహారాక్షసుల బలమం
తయు లంకపైపు పరువిడె సేనాపతి వడిపోఁగా నింక నితరరాక్షసులు సేతు
బంధమునుచేరి చెదరిన నీరువలె వారు ధ్యానించుచు నుండిరి. ఆ సేనాపతి
పోయినపిదప వారందఱును ఆనకట్టు పడిపోగా విడిన జలములవలె నుండలేక
ప్రయత్నములుమాని ధ్యానమూకులయి స్మృతిలేనివారివలె అయిరి. పిదప
విజయి యయిన మహాబలుడయిన నీలుడు తనపనికి రామలక్ష్మణులచేఁ గొని
యాడబడుచుండి సంతుష్టుడయ్యెను. 866

దనుజాధ్యక్షుఁడు వానరర్షభుని చేతన్ బోరఁ జంపంబడన్
గని భీమాయుధమై సముద్రసమవేగం బైన తత్సైన్య మె
ల్లను వేపాఱుచుఁ బోయి దైత్యపతితోడన్ వానరవ్యాఘ్రుచే
దనుజాధ్యక్షుఁడు చంపఁగాఁబడిన వార్తన్ జెప్ప దైత్యేశుడున్. 867

విని శోకంబునఁ జిక్కి క్రుద్ధమతియై వేగన్ స్వసైన్యాగ్ర్యులం
గని యింద్రుం దసురోగ్రవీరులనటుల్ గన్గొంచు దైత్యేశుం డి
ట్లనె మీరల్సభటున్ మహేంద్రబలముల్ ధ్వంసంబు గావించు నీ
ఘనసేనానిని జంపునా రిపు నుపేక్షన్జేయఁగా రాదిఁకన్.

అరులన్ జంపి జయంబు పొందుటకు నాయాశత్రుసైన్యాల ని
త్తటి లక్ష్యం బొనరింపకే స్వయముగాఁ దత్తన్మహాశ్చర్య సం
గర శీర్షంబును జేరి దారుణ శరౌఘంబుల్ సుదీప్తాగ్ను ల
ట్లలయం జేసియు రామలక్ష్మణులఁ గాల్తున్ వే ససైన్యంబుగా. ౮౬౮

అని యాయింద్రునివైరి రావణుఁడు-తానై వెల్గుచున్ వహివా
లెను భాసిల్లుచు నుత్తమాశ్వములతో లీలన్ విరాజిల్లు తే
రున నెక్కెన్ వడి సింహనాదములు భేరుల్ శంఖముల్ మ్రోయగా
ఘనబాహుల్ వడి నప్పళింపుధ్వని మ్రోగన్ స్తోత్రముల్ మీఱఁగన్. ౮౬౯

గిరిమేఘంబులవంటి రూపములు తీక్ష్ణాగ్ని స్ఫుర న్నేత్రముల్
వఱలన్ మించెడి మాంసభోజనులతో నల్ప్వై యేపుమీఱంగ భీ
కర భూతంబుల రుద్రుఁడ ట్లసురలోకాధీశుఁడౌ రావణుం
డరసెన్ లంకను నుండి బైల్వెడలి యుగ్రౌజస్సు లేపారగా. ౮౭౦

అటఁ జెట్టుల్ గిరులున్ ధరించి గొప్పజలదం బట్టుల్ మహాంబోధి యు
న్నటు గర్జించుచు నున్న వానరబలం బారావణుం డారయున్
పటువై చండమునైన దైత్యబలమున్ వ్యాళేంద్ర బాహుండు ను
త్కటమౌ శ్రీ గలరాముఁడట్టిట్టుల నేత్రాలుంచి వీక్షించుచున్. ౮౭౧

పర శస్త్రాగ్ర్యుఁడె యా విభీషణునితో వాక్రుచ్చె నీరీతి ముం
దర నానాధ్వజముల్ దనర్చ యసిశస్త్ర ప్రాస శూలాద్యులున్
వరగన్ గొప్ప మహేంద్ర పర్వత నిభంబౌ నాగముం గల్గి యా
వర, వీరుల్ గల యాబలం బెవరిదో వాక్రువ్వుమీ నావుడున్. ౮౭౨

వ. అపుడు రాముని వాక్యమును విని శక్రసమాన వీర్యము గల విభీ
షణుఁడు గొప్పయాత్మగల రాక్షసపుంగవుల బల నివేశమునుగూర్చి యిట్లుచెప్పె

శిరమూగఁ గరినెక్కి తరణి తామ్రాస్యుఁడై
* కదలి వచ్చెడి వాఁ డకంపనుండు

* హరికేతు రథమెక్కి వరగర్వి ధనువూగ
నెత్తు వండ్లున్న వాఁ డింద్రజిత్తు

వింధ్య మహేంద్రా స్త్రవిధి నొప్పు రథ మెక్కు
ఘనుఁ డతిరథుఁ డతికాయు డితఁడు

నవ రవి కనుల ఘంటాధ్వని కరి నెక్కి
యుటిమెడి వాఁడు మహోదరుండు

అరుణ సంధ్యాభ్ర గిరి తుల్య హయము నెక్కి
చూచి శూలమె త్తెఁ గను పిశాచుఁ డితఁడె
వజ్రవేగము దాటిన ప్రాస మెత్తి
వృషభ మెక్కి వచ్చెడి వాఁడు త్రిశిరుఁ డితడు. 874

ఇదె కుంభ డభ్రాభుఁడెగిరి దృఢపు ఔమ్ము
తగ నహికేతువై ధనువు నూపు

స్వర్ణవజ్రాల జుష్టము సధూమపరిఘను
గని నికుంభుఁ డితండె కలియ బడెడి

చాపాసి బాణజుష్టము-శృంగ యోధి-తే
రెక్కి నరాంతకుఁ డితఁడె వచ్చె

వ్యాఘ్రోష్ట్ర నాగమృగాశ్వ ఘోరాస్యమౌ
వరమ భూతాలతో వచ్చుచుండె.

---

* ఈ యకంపనుఁడు వేఱు
* హరి=సింహము.

దీ_ప్త యక్ష గంధర్వాది దేవ గర్వ
మడఁచి పేర్చిన వాఁడువీ డరయు మిందె
ఇంద్రుఁబోలి సూక్ష్మ శలాక లెసఁగి వెల్ల
గొడుగు గలవాఁడె రావణుఁ డడరు రుద్రుఁ. 875

ఇతఁడే గొప్పమనస్సుతోఁ దనరి శైలేంద్రుఁడైయావింధ్యుఁ డ
ట్లతిభీమంబగు మేనివాఁడు యమదేవాధ్యక్ష దర్పాంతకుం
డితఁడే సూర్యునిబోలె భాసిలెడి దైత్యేశుండు సుమ్మంచు దు
ర్మతులంగూల్చు విభీషణుండు పలుకన్ రాముం డిటుల్వాకొనెన్. 876

ధృతి వెల్గొందెడు నీతఁ డింతటి మహాతేజుండహో యేమి ! యా
దితిజాధీశుఁడు రావణుండు రవిభాతిన్ దుర్నిరీక్ష్యుండ యా
క్షితిలో నీతనిరూపు వ్యక్తముగ రాశీభూతమౌ తేజమే
ద్యుతిలోనిట్టిది మేనులే దసురులందున్ గాన మాదేవులన్. 877

ఎల్లరు పర్వతోపముల యెల్లరుగూడ మహాద్రి యోధులే
ఎల్లరు దీ_ప్తశస్త్రధరు లీమహితౌజుని వీరరాక్షసుల్
ఎల్లరు దీ_ప్త విక్రములె; యీ తనుధారులచే యముం డటుల్
ఎల్ల సుతీక్ష్ణ భూతముల నెల్లపు డాకృతుఁడై విరాజిలున్. 8 8

దైవవశాన నీఖలుఁడు దాటక నాదగు దృష్టిలోఁ బడెన్
ఈవిధి సీత దొంగిలిన యీతనిపైఁ గడు క్రోధమూనెదన్
ఈవిధిఁ బల్కి రాముఁడు మహీతలి లక్ష్మణుతోడ చాపమున్
లావున నెక్కుపెట్టి ప్రవరంబగు బాణముతో నిలంబడెన్. 879

వ. పిదప గొప్ప యాత్మగల రాక్షసేశ్వరుఁ డగు రావణుఁడు మహా బల ములకు రాక్షసులకును ఇట్లు ఆజ్ఞ యిడె. "మీరు ద్వారములందును పురద్వార విశంకటములందును గోపురము లందును నిర్విశంకులయి సంతుష్టులై యుం డుఁడు. మీతోపాటు ఇక్కడకు వచ్చినట్లు నన్నుఁ దెలిసికొని వానరులు ఏమా

త్రము నెమరొక్కనరాని శూన్యమగు పురిని కలంచి వేగ నెదుర్కొనఁ గలరు" అని వారికిఁ జెప్పి వారిని వీడ్కొని వారు తమ తమ నియోగముల ప్రకారము వెళ్ళఁగా తానుమహామత్స్యము పూర్ణమైన సముద్రప్రవాహమునువలె నావానర ప్రవాహమును జీల్చెను. అపుడట్లు వెంటనెదిపించు శరములతోఁగూడిన ధనుసు గల రాక్షసేంద్రుని జూచి గొప్ప పర్వత శిఖరమును పెల్లగించి వానరేశుం డగు సుగ్రీవుండు రాక్షసాధిపతి యగు రావణుని దగ్గఱకు పరువెత్తె. 880

తరుసానుల్ గల శైలశృంగ మొకటుత్పాటించి సుగ్రీవుఁ డ
త్తతి వేయన్ గని రాక్షసేశుఁడు సువర్ణస్వర్ణంపుఁ బుంఖాల వ
ల్నరముల్ వేసియుఁ గూల్చ భూమి నది కూలన్ వజ్ర కాలాభమై
యురగాగ్ని ప్రభలైమె వెలుంగెడి శరం బొక్కండు వేసెన్ వడిన్. 881

అది సుగ్రీవుని పొంది వేగ, గుహుఁ డేయం గ్రౌంచశైలంబుభీ
ప్రద శక్తింబలె, వొంపఁ జేతసముపోవన్ గూయుచుం గ్రిందఁ గూ
లఁ దడియు స్థితిజూచి రాక్షసులు హర్షంబొంది గర్జింపగా
నది వీక్షించి కపుల్ భయంబుననె యిట్టటుల్ పాఱె రాయాజిలో. 882

అపుడు జ్యోతిర్ముఖుండు గవాక్ష గవయ
ఋషభ నభసదంష్ట్రిలు నద్రులెత్తి వడిగ
వర్ధిలెడి గాత్రములతోడఁ బరుగు లెత్తి
యేర్చి రాక్షసేంద్రుని నంత నెదురుకొనిరి. 883

అంత తత్ప్రహారముల రక్షోధిపతియు
పైఁడి పుంఖాలుగల వాడి బాణవితతి
చేత వ్యర్థమొనర్చి విజృంభణంబు
చేసి వానరేంద్రులఁ గొట్టి క్షితిని బడిరి. 884

అటుల వారిని గొట్టి బాణాళిచేత
కపి బలంబుల మిక్కిలి గప్పివేయ
కొట్టఁబడి వడికూయుచుఁ గూలి భీతిఁ
బఱచుచు శరణ్యు రాము శరణుఁ గనిరి. 885

అప్పు డామహాత్ముఁడు రాముఁ డరసి వేగ
ధనువు గైకొని వెంటనె తరలి యరుగ
లక్ష్మణుండు ప్రాంజలి యౌచు రయము వచ్చి
యర్థ యుక్తముగా నిట్టు లనియె నపుడు. 886

పట్టి కడు నార్యుఁ డీదుష్టు మట్టుపెట్ట
శక్తుఁడేయైన నిట్టి నీచాత్ము నేనె
దునుమఁగల నీవలకు నేమి పనియు కాన
వీర! ప్రభు నాకె యనుమతి వేగ యిమ్ము. 887

అనఁగ నా మహాతేజుఁడే యయిన సత్య
విక్రముఁడు రాముఁ డనె నిట్లు "వెళ్ళు యత్న
మాచరింపు లక్ష్మణ! రావణాసురుండు
రణమున ఘనుఁ డాశ్చర్య పరాక్రముండు. 888

మూఁడులోకాలు పైఁబడఁ గూడి వచ్చి
నప్పటికిఁ గ్రుద్ధువీని నణంచ శక్య
మెంతయుం గాదు సంశయమేమి లేదు
కనుక ఖలు లోట్లు నీ లోట్లు కని యొనర్పు. 889

కంటిచే వింటి చేఁ బూని కావు నిన్ను
జాగ్రతగ నుండు మనఁగ లక్ష్మణుఁడు రాముఁ
గౌఁగిలించి పూజించియుఁ గరము మ్రొక్కి
యుద్ధసన్నద్ధుఁడై యేగె యుద్ధభువికి. 890

ఏన్గుతొండాలఁ బోల్ బాహు లెసఁగునట్టి
లక్ష్మణుడు వెల్గి యెత్తు విల్ గలిగి బాణ
జాలము కురిసి రావణుఁ డోలిఁ గపుల
తనువులను గూల్చుచుండఁగఁ గనియె నపుడు. 892

అతనిం జూచి మహౌజుఁడౌ హనుమ బాణాళిన్ నివారించి యు
ద్ధతుఁడై రావణుపైపు వర్వెడి తదుద్యత్స్యందసం బాపి యు
ద్ధతితోఁ దక్షిణ బాహు వెత్తి మిగులన్ దైత్యేశు నారావణున్
మతి భీతిల్లఁగఁ జేయుచుం బలికె ధీమంతుండు శ్రీమంతుడై. 893

సుర గంధర్వులచేత నా దనుజ రక్షోయక్ష వీరాళిచే
మరణం బొందని యట్లు నీకు వరముఁ బ్రాప్తించెనే గాన వా
నరుచేఁ దప్పక నీకు చావు కలుగున్ గాఁబట్టి యీాయైదు వ్రే
ళ్ళారయౌ నా కుడిచేయి మైవిడఁ జిరాయున్ జీవుఁ బై కీడ్చుఁగా. 894

హనుమంతుం డిటు పల్కఁ భీమ బలుడౌ నా రావణుం డుగ్రుఁడై
కని కండ్లెఱ్ఱన చేసి యిట్లనియె వేగన్ గొట్టి నిశ్శంకగా
ఘనకీర్తిం గను, మావయిన్ విదిత విక్రాంతున్ నినున్ జంపెదన్
కనుమో వానర యంచు రావణుఁ డనంగా వాయుపుత్త్రుం డనెన్. 895

మునుపే కొట్టితిఁ గాదె, యక్షసుతు నీవున్ జ్ఞప్తికిం దెచ్చుకో
అనుచున్ మారుతి చెప్పగా వినుచు దైత్యేశుఁ డోజస్వి రా
వణుఁ డంతన్ హనుమంతుఁ గేల జఱవం బల్మాఱు కంపించియున్
క్షణమాత్రంబటు నిల్పి ధీయుతుడు పల్ స్థైర్యంబుతోఁ గ్రుద్ధుడై. 896

అఱచేతన్ మహితాత్ముఁడౌ హనుమచే నాఘాతముం బొందియుం
ధర కంపంబునఁ గంప మొందెడి మహీంద్రం బట్లు దైత్యేశుఁ డ
త్తరిఁ గంపింపఁగ సిద్ధ దైత్య సురులున్ ధ్వానాలు శీఘ్రం బొన
ర్చిరి యంతన్ ఘనతేజు రావణుఁడు వారిం దేర్చి యీాలా గనెన్. 897

భళి యోరీ కపి ! యిట్లు విక్రమపు శేవన్ మెచ్చుకోదగ్గ నా
బలవద్వైరివి యంచు రావణుఁడు చెప్పంగా హనుమంతుఁ డి
ట్టుల వాక్రుచ్చెను ఛీ ! యిదా నిను నిటుల్ పోనిచ్చి ప్రాణాలతో
నిలవం బెట్టిన, దిద్ది కూడ బలమేనే నాది యీక్షించినన్. 898

ఒకసారీవరి కొట్టు చూతము ఖలా; యోరీ ! నినున్ నీవె మె
చ్చుకొనన్ సాగితి విప్పుడే కను నినున్ జొప్పారు నా ముష్టియే
ఇఁక నాకాలుని యింటి కంపుననఁగా నీరావణుం డేర్చి పూ
నికవేగన్ కుడిబాహుతో నురముపై నిన్ గొట్టె నల్కన్ గపిన్. 899

వడి నట్టుల్ హనుమంతు ధీరుని ఘనంబౌ రొమ్ముపైఁ గొట్టగన్
బడి తొట్రిల్లఁగఁ జూచి యాయతిరథుండౌ రావణుం డప్పుడ
య్యెడ నీలుంగని యాచమూవిభునిపై నెంతేని భీమంబులై
వడి మర్మంబులు గొట్టు సర్పసమమౌ బాణాలు వేసెన్ గడున్. 900

అట బాణంబులు వేయగా నలసి సేనాధీశుఁడౌ నీలుఁ డం
తటఁ దానొక్కకరాన పర్వతము నుత్పాటించి యారావణున్
పటు వీరుం డయి కొట్టె మారుతియు శేవన్ దేఱి తేజస్వియై
యటులే నీలునితో ననిం జలుపు దైత్యాధీశుతో నిట్లనెన్. 901

మఱి యిట్లన్యు నెదుర్చు నన్ను నెదిరింపన్ రాదుగా పోయనన్
ఖర తేజుం డగు రావణుండు గిరి శృంగం బద్దియేడమ్ము ల
త్తఱి వేయన్ వడిఁ బ్రీలుచున్ శిథిలమై ధాత్రిన్ బడన్ వేగ వా
నర సేనాపతి కాలవహ్నివలె లోనన్ మండి యుద్ధండుడై. 902

ధవసాలంబుల నశ్వకర్ణములఁ జూతాలన్ సుమాఢ్యంబులన్
వివిధాన్య ద్రుమముల్ వడిం బెల్లకి యెన్నేని వేయ నారావణుం
డవలీలన్ భువిఁ గూల్చి దారుణములౌ నమ్ముల్ కడున్ గుర్సి నీ
లువడిన్ గొట్టఁగ పొట్టివా డగుచు నీలుండెక్కె దత్కేతుపై. 903

జండాపై నటు నీలుఁ డెక్కఁ గనుచున్ జిత్తానఁ దైత్యేశుఁడున్
మండన్ నీలుఁడు క్రుద్ధుఁడై యెగిరి పెంపారంగ గర్జించె నా
జెండాపై మఱి వింటిపై మకుటపున్ శీర్షంబుపై నీలుఁడే
యుండన్ మారుతి రామలక్ష్మణులు నెంతో పొంది రాశ్చర్యమున్. 904

ఘన తేజుండగు రావణుండు కపి- తాఁగావించు నా లాఘవం
బున కాశ్చర్యము పొంది వెల్గుచుఁగరంబున్ మందు నాగ్నేయమౌ
వినుతాస్త్రంబును తీయు నీలుపనికిన్ విభ్రాంతుడౌ రావణుం
గని యా వానరులెల్ల హృష్టు లగుచున్ గర్జించి రత్యంతమున్. 905

అని యాలించుచు రావణుండును గరం బాసంభ్రమావిష్టమౌ
హృది సంరంభము నొంది యేపనియుఁ గావింపన్ మదిం దోచకే
తుదకా కేతువు పైని నీలుఁ గని యెంతోమంతి యాగ్నేయ మం
త్రధృతంబౌ శరమూని యిట్టు లనియెన్ దైత్యేశుఁ డోజస్వియై. 906

కపి ! ఈమాయను లాఘవంబు మిగులన్ గావించితే గాని నీ
విపుడే శక్తుఁడ వేని ప్రాణముల నెట్లేని గాచుకో చూతమీ
కపి రూపంబు లనేకముల్ సలిపితే గానీ మదీయాస్త్రమే
యిపుడే తీయును నీదు జీవముల నీవింకన్ భువిన్ లేవులే. 907

అని యారావణుఁడున్ మహాభుజుడు తానాగ్నేయ కాస్త్రాన నెం
టనె యానీలు వెడంద యొమ్మపయిఁ గొట్టన్ కాలుచున్ మండి యో
య్యన నీలుఁ డిలం గూలెఁగాని * పితృ మాహాత్మ్యంబు చేతన్ స్వతే
జున మోకాళ్ళపయిం బడెన్ బడినవచ్చో ప్రాణముల్ పోవెటుల్. 908

* నీలుడు అగ్ని కొడుకు గాన అతనిని ఆ యస్త్రము కాల్చలేదని భావము.

స్మృతి పోవంబడినట్టి వానరులన్ వీక్షించి యా రావణుం
డతిగాఁ బోరుట కుత్సుకుం డయి రథం బభ్రంబటుల్ మ్రోగ ను
ద్ధతి సౌమిత్రి నెదిర్చి స్వధను ర్దండంబు సారించుచున్
క్షితి కంపింపఁగఁ జేయువాడువలెనై శీఘ్రంబ యాపెన్ గడున్. 909

సుహాసత్త్వుఁడు లక్ష్మణుం డట ధనుస్సున్ సాచి యా యప్రమే
య మహాసత్త్వుని రావణుం బలికె రారా ! రాక్షసాధీశ ! నీ
దు మహాసత్త్వము చూపుటే కపులముందుం గాదు నా ముందు చూ
పుమటంచున్ ఘననారిఘోష మెసగన్ మ్రోగించి ఘోషింపగా 910

అపుడా లక్ష్మణు వింటినారి నినదం బాలించి యా రాక్షసా
ధిపుడా రావణుఁ డంత లక్ష్మణుని ముందే చూచి పల్కెన్ క్రుధన్
"ఇపుడే దైవవశాన లక్ష్మణుడ ! నాయా దృష్టికిన్ వచ్చి మృ
త్యువధిం గందు విరుద్ధబుద్ధి వయి నా బాణాలచే వ్రీలుచున్. 911

వయికిం దిర్గిన తెల్లనైన కొనలన్ వండ్లొప్ప గర్జించు నా
భయదున్ రావణుఁ జూచి విస్మయము నావంతేని సౌమిత్రి లే
క యనెన్ రాజ ! మహాప్రభావులెపుడున్ గర్జింప రీలాగు ని
న్నె యిటుల్ స్తోత్రము చేసికొందువుర యోరీ పాపిలోకాధమా. 912

ఎఱుగుదును నీ పరాక్రమ మెల్ల బలము
ఎఱుగుదును నీ ప్రతాపము నెల్ల వీర్య
మిదిగొ విల్లునమ్ములను ధరించి యుంటి
రమ్ము నీవె మెచ్చుకొనెదు వ్యర్థముగ నిన్నె. 913

అని సౌమిత్రి వచింప రావణుఁడు నే డస్త్రాలు సత్పుంఖముల్
తనరన్ వేయగ లక్ష్మణుండు సితచిత్ర స్వర్ణ బాణంబులన్
గాని వానిన్ దెగఁ గొట్టగాఁ బడగలన్ గొట్టంగ గూల్ పాము లో
యనఁ గూలన్ భువి వేసె రావణుఁడు నన్యంబౌ సితాస్త్రంబులన్. 914

ఇటు లంకేశుఁడు బాణముల్ గురియుఁగా వీక్షించి సౌమిత్రి యం
తట భల్లంబులు నర్ధచంద్రములు సత్కర్ణ్యస్త్రముల్ శూరత
న్నటు బాణంబులు వేసి బాణముల ఛిన్నాభిన్నముల్ చేసెఁ దా
నెటు క్షోభింపడొ యంత రావణుఁడు నెంతే విస్మితస్వాంతుడై. 911

కని యాలక్ష్మణు లాఘవంబు మదిలో గాటంబుగా మెచ్చి వెం
టనె తీక్ష్ణాస్త్రము లేయు లక్ష్మణుఁడు రూఢాగ్నిచ్ఛటల్ పోలి యిం
ద్రుని వజ్రాశనివంటి బాణముల నెన్నో గూర్చి రాక్ష సేం
ద్రుని జంపన్ వడివేయు, వాని దనుజేంద్రుండున్ వెసన్ గూలిచెన్. 913

అటు ఛేదించియు లక్ష్మణాస్త్రముల రక్షోధీశుఁ డాలక్ష్మణున్
స్ఫుటకాలాగ్ని సమ ప్రభంబయి స్వయంభూదత్తమౌ నస్త్రమున్
వటుశక్తిన్ నుదుటన్ బడన్ వయివఁ దద్బాణార్తుఁడై లక్ష్మణుం
డటఁ జేజాఱెడి విల్లు పట్టుకొనియే యాపైస్మృతిన్ బొందియున్. 914

ఎటులో కష్టముగా సురేంద్రరిపు దైత్యేశో గ్రచాపంబు నం
తట ఛేదించియు మూడువాడి వగు నస్త్రాళిన్ దశాస్యున్ హుటా
హుటిఁ గొట్టన్ దనుజేంద్రుఁడడ్డొరిగి తానోలిన్ బలం బూని యె
ట్లెటులో తేఱియు మేను మేథసును నెంతే నెత్తుటం దోగఁగన్. 915

స్ఫురదాటోప మహాబలుం డయి స్వయంభూదత్తమౌ శక్తి న
త్తఱిఁ జేఁబూని విధూమవహ్నివలె దీప్తంబై జ్వలింపంగ వా
నర సైన్యాలకు భీతిగూర్చుచును తీక్ష్ణక్రోధుడై లక్ష్మణున్
తొరగాఁ గొట్టఁగ లక్ష్మణుండుఱిమి తోడ్తో శక్తిఁగొట్టెం గడున్. 916

అయినంగాని రఘుప్రవీరు పృథుబాహా మధ్యభాగంబు శ
క్తియె చొచ్చెన్ మ యట్లు చొచ్చి నను నుజ్జృంభించి పల్మారు వీ
ర్యయుతుండై నిలవన్ దశాననుఁడు శీఘ్రం బేగి యుద్ధండుడై
రయమున్ బాహువు సెత్తివట్టుకొన సంరంభంబు చేసెన్ గడున్. 917

హిమవంతము సైనను మే
రుమందరమయిన నసురత్రిలోకి నయిన హ
స్తముల బయికెత్తఁ గానీ
సమరస్థలి లక్ష్మణుఁ గొనఁ జాలక పోయెన్. 918

బ్రహ్మ వరదత్త శక్తిచే లక్ష్మణుండు
గట్టిగా వక్షమునయందుఁ గొట్టఁబడుచు
విష్ణువు నచింత్య మైనట్టి స్వీయభాగ
మలరు వానినిఁగా దన్ను దలఁచు కొనియె. 919

పృథివి మనుజ దేహము గొన్న విష్ణుభాగ
మగుచు దానవ దర్పంబు నడచు లక్ష్మ
ణునిగఁ గరాలఁ బట్టియు నెత్తికొనఁగఁ జాల
కుండె సురకంటకుఁడు రావణుండు తాను. 920

అపల మారుతి క్రుద్ధుఁడై యటకుఁ బోయి
రావణు నెదిర్చి వజ్రతుల్యంబ యైన
ముష్టిచే వక్షమునఁ గొట్ట ముష్టిదెబ్బ
కణఁగి మోఁకాళ్ళఁ గూలి రావణుఁడు పడియె. 921

అట మోకాళ్ళను బడ్డ రావణుని మోమందుండి కర్ణాక్షులన్
నిటలస్థానమునుండి నెత్తురది యెంతేఁ గాటి ఘూర్ణిల్లఁగా
నట నిశ్చేష్టత మూర్ఛపొంది కదలం డంతన్ రథంబందె ముం
దటఁ గూర్చున్న విసంజ్ఞు రావణునిఁ గండ్లంజూచి రందెల్లరున్. 922

అట నింద్రుండు ఋషుల్ కపుల్ సురలు నందందుండి వీక్షించుచున్
బటు నాదంబులు చేయ రావణునిచేఁ బాటొందు సౌమిత్రిఁ బి
మ్మటఁ దేజస్వియ యైన వాయుసుతుడుం బాహుల్ వడిం జాచి యం
తట నారాము సమీపమందు నత్యంతంబు వీర్యంబుతో. 923

హనుమంతుం డతి భక్తుఁడున్ సుహృదయుం డౌటన్ గడున్ పైరికె
ల్లను గంపింప నశక్యుఁడయ్యెఁ గపి చాలా సుల్వుగాఁ బట్టి ల
క్ష్మణుఁబై కెత్తికొనెన్ రణంబున జయించన్ రాని సౌమిత్రి నం
తనె యాశక్తి త్యజించి రావణు రథస్థానంబు చేరెన్ మఱిన్. 924

అరులన్ గూల్చెడి లక్ష్మణుండు మెయి శల్యంబేగ నాశ్వాస మ
త్తఱి వేగన్ గని విష్ణునంశమునుగాఁ దన్నెంచె నారావణా
సురుఁ డోజస్వియు సంజ్ఞపొంది స్వధనుస్సున్ బాణముల్
త్వరగానే గొనె నంత రాముఁడు నటన్ బర్వెత్తు సేనన్ గనెన్. 925

వడిగా రాముఁడు చూచి రావణు నెదుర్పన్ బోవ నావాయుసూ
నుడు రామున్ వడిఁజేరి యిట్లనియె విష్ణుం డాగరుత్మంతుఁ గై
వడి నావీపును నెక్కి రాక్షసు నెదుర్ప బొమ్మనన్ రాముఁ డ
ప్పుడె యామారుతివీపు నెక్కి యరదంబున్ రావణున్ వేగనెన్. 926

కని తేజస్వి రఘూద్వహుండు లలి నీకంజాక్షుఁ డట్టుల్ ధను
స్సును జేఁదాలిచి నారిశబ్దమును నచ్చో వజ్రనిర్ఘోష మో
యనఁ గావించి గభీరవాక్యముల రక్షోధీశుతో వాకొనెన్
ఘనమౌ విప్రియ మీవు చేసి యెట లంకాధీశ పోఁజాలుదో. 927

యమునిన్ శక్రుని భాస్కరున్ హరుని బ్రహ్మన్ వహ్ని నీవిప్పు డా
శ్రయమున్ బొందినఁగాని యాపదిదిశ ల్పర్వెత్తినన్ గాని యే
మియు మోక్షంబును పొందఁజాల విపుడో యెవ్వానిపై శక్తి వే
సియు నీవున్ బ్రహరించితో యతఁడె గాసిన్ బొందియున్ వేగమే. 928

విను మాఱిన్ జనుదెంచి యాత్మజ సతీ భృత్యాప్త యుక్తంబుగా
నిను జంపన్ వడిఁబూనె నీతఁడె సుమీ నీయద్భుతమ్మైన ద
ర్శనమున్ గల్గి వరాస్త్రముల్గల జనస్థానస్థులౌ దైత్యులన్
ఘనులౌ నావదు నాల్గువేవురను వేగన్ జంపె పోకామీ. 929

అని రాముండు వచింప రావణవిభుం డాలించి వీరాగ్ర్యునిన్
హనుమంతున్ వడి రాము మోసెడి ఘనుండౌ నంజనాపుత్త్రు దా
రుణ కాలాగ్ని శిఖాభతీక్ష్ణ శరాలున్ గ్రుమ్మి కొట్టంగ నా
రణభూమిన్ సహజౌజుఁడౌ నతని వర్చ స్సెంతయున్ వర్ధిలెన్. 930

అటు లారావణు వల్ల గాయపడు దేహంబొప్పు నీవానరో
ద్భటు వీక్షించుచు నగ్ని పుంఖయుతమౌ బాణంబు లారాముఁ డం
తటఁ బల్మాఱులు వేసి స్యందనము ఛత్త్రంబున్ ధ్వజంబున్ మహో
త్కట వజ్రంబును శూలసారథుల ఖడ్గంబుల్ వడిన్ గూలిచెన్. 931

మఱి వజ్రాభ సన్నిభంబయి ఘనంబౌ బాణ మొండేసి యిం
ద్రరిపున్ రావణు స్వర్ణభాసిహృదయ స్థానంబునన్ రాముఁ డే
త్తెఱఁగొట్టన్ మును వజ్రకాశనులచే దెబ్బల్ కడుం బొంది యై
న రవంతం జలియింపనట్టి ఘనుఁడై నన్ సోలి వింటిన్ విడెన్. 932

పడి మూర్ఛిల్లిన రావణుంగని సుదీప్తాగ్రార్ధ చంద్రాస్త్ర మ
ప్పుడు సంధించి తదర్కవర్ణ మకుటంబున్ వే మహాత్ముండు రా
ముఁడు ఛేదించి విషంబె లేక పడుపాముంబోలి చల్లారి శ్రీ
విడఁగన్ నెత్తిఁ గిరీటముం బడిన దైత్యాధిపుతో నిట్లనెన్. 933

సుమహాంతం బగు భీమకార్యముల నిచ్చోఁ జేసియున్నావు నా
డు మహావీరుల నొంచినీవ యిఁక నిందున్ స్రుక్కియు న్నీవటం
చు మదిన్ నిశ్చయమూని నిన్ విడుతు నిచ్చో బాణముల్ వేసి మృ
త్యు ముఖంబుం గనఁజేయఁబో మ్మనుమతింతున్ నేఁడు విశ్రాంతికిన్.
934

అనిలో శ్రాంతుఁడ వైతివే గనుక దైత్యాధీశ ! లంకాపురిన్
జని యందూరటఁ గాంచి బైల్వెడలి నీ చాపంబు సారించి స్యం
దన మందెక్కియు రమ్ము పొమ్ము యపుడే నావీర్యముం జూతు వం
చన నారావణుఁ డల్లజూచె విరథుండై నిష్కిరీటుండునై. 935

అటు దర్పంబు రథంబు సూతుఁడును నయ్యాజిన్ భువింగూల ముం
దట నింద్రారియుఁ బోవ లక్ష్మణునితోఁ దత్సేనలన్ రాముఁ డూ
రటఁ బొందింప సురాసురుల్ ఋషులు సర్వంబైన భూతాళి మి
క్కుటమున్ హర్షముఁ బొంది రంత నుపకక్షోణీచరశ్రేణితో. 936

అటుల లంకకుం జని రావణాసురుండు
గర్వ మడఁగ నింద్రియములు కష్టమొంద
గజము సింహముచే వలె, గరుడిచేత
పాముపోలె రామునిచేత వ్యథితుఁ డయ్యె. 937

బ్రహ్మదండము పోలెను ప్రభల వెలిఁగి
మెఱపు వలె వర్చస్సులతోడ మెఱయుచున్న
రాము బాణంబులను లోఁదలంచుచుండి
రాక్షసేశుండు వ్యథపొందె రావణుండు. 938

అతఁడు పసిఁడి సింహాసన మాశ్రయించి
రాక్షసులఁ గని యీప్రకారముగఁ బలికె
నేను చేసిన తపమయ్యె నిష్ఫలంబు
ఇంద్ర సముఁడ మర్త్యునిచే జయింప బడితి. 939

నరులవల్ల నీకు భయమౌ నెఱుఁగు మనుచు
అపు డనిన బ్రహ్మ ఘోరవాక్కిపుడు వచ్చె
దాన వోరగ దేవ గంధర్వ యక్ష
రాక్షసులచే నవధ్యత ప్రాప్త మయ్యె. 940

నరులచే అవధ్యత కల్గు వరము కోర
మానుషుఁగ నెంతు దశరథాత్మజుని రాము
గఱ్యు డిక్ష్వాకు కులుఁ డనరణ్యుఁ డెపుడొ
మున్నె నీతోడ నీవిధంబుగ వచించె. 941

రాక్షసాధమ! కుమతి! నాకులంబునందు
సారథి బలాశ్వ సుత మంత్రి సహితముగను
సంగరంబు లోపల నిన్నుఁ జంపు నట్టి
పురుషుఁ డీఁకముందు జనియింపఁ బోవు" ననుచు. 942

మీఁదఁబడి పట్టఁగాఁబోన వేదవతియు
నిదివఱకు నాకు శాపంబు నిచ్చియుండె
ఆమెయే యీమహాభాగురాలు సీత
జనక నందినిగా భువి జన్మమందె. 943

ఇటులె యుమ రంభ మఱియు నందీశ్వరుండు
అల వరుణ కన్య పుంజికస్థలయుఁ గూడ
పలికినారు తపః ప్రభావంబు చేత
ఋషులు పలికిన యది మిధ్య యెపుడుగాదు. 944

వ. మీరిది తెలిసికొని యీవిషయమునఁ బ్రయత్నము చేయుఁడు. రాక్షసులును పురద్వారమందున్న భటసంచారదేశములందుగోపురాగ్రప్రదేశము అందును ఉండురుగాక. అప్రతిమంబైన గంభీరము గలిగి దేవ దానవ దర్పంబులఁ గొట్టువాఁడ బ్రహ్మశాప కృతనిద్రావరవశుండు నగు కుంభకర్ణుని లేపుఁడు. తాను పరాజితుఁడగుటయు బ్రహస్తుఁడు చంపఁబడుటయుఁ దలఁచుకొని మహాబలుఁ డగు రావణుఁడు తన మహాబలము నాజ్ఞాపించెను. ద్వారము అందు ప్రయత్న పూర్వకముగా గాపుండుఁడు ప్రాకారమెక్కుఁడు. నిద్రావశమందున్న కుంభకర్ణుని లేపుఁడు. అతఁడు నిశ్చింతుడయి కాలమువానిచిత్తము నవహరింప, తొమ్మిదో, ఆరో, ఏడో, ఏనిమిదో నెలలు నిద్రించుచునుండు, ఆతడు నాతో మంత్రించి బాగుగా నిద్రించె. ఇటనుండి తొమ్మిదవ దినంబున శీఘ్రముగ మహాబలుడైన కుంభకర్ణుని లేపుఁడు. 945

అతఁడో సర్వనిశాచరాళి కనిలో నత్యంతముఖ్యుండుగా
అతఁడే వేగమె రాజపుత్త్రుల ప్లవంగాళిన్ వధించున్జుఁడీ
అతఁడే కేతువు వంటి వాఁ డసురులం దాకుంభకర్ణుండు ని
ద్రితుఁడై గామ్యసుఖంబులను నెంతేఁ బొందుచున్నాఁడుగా. 949

ఇతనిన్ లేపినచో ఇఁకన్ రణములో నీరీతి నిష్ఠే పరా
జితుఁడై యుండు నాకు శోకమది కొంచెంబైనఁ గాకుండు ని
ట్టితఱిన్ గష్టము లిట్టివిన్ గలుగు చుండెన్గాదె యీవేళ స్వ
ర్పతితుల్యుం డిటు సాహసమున్ బడనిచో వాడుండి యేమయ్యెడిన్. 950

ఇక నేనిట్టి జడాత్ముతోడ నెది గావింతున్ వడిం బొందు బొం
డిఁక సంచున్ వచియింప రాక్షసులు దైత్యేశుండు వాక్రుచ్చు నా
సకలోక్తుల్ విని యెంతొ సంభ్రమముతో సర్వంపు సామగ్రితో
ప్రకటాహారములన్ సుగంధ సుమమాల్యాదుల్ కడున్ భక్ష్యముల్. 951

కొని వేగంబునఁ గుంభకర్ణుఁ డెపుడున్ గూర్కొందు నావేశ్మకున్
జనియున్ యోజనమంత దీర్ఘమయి యుచ్చద్వారముల్ గల్గి చం
దనగంధంబుల పూరముల్ గల విన్నిద్రత్కుంభకర్ణుండు వం
డిన యాగొప్ప గుహం గనుంగొనిరి వానిన్ లేపగా రాక్షసుల్. 952

గదలన్ గొట్టిరి శైలశృంగముల వేగన్ వేసి రుగ్రంబుగన్
గదపన్ జొచ్చిరి ముష్టులం బొడిచి వృక్షాలన్ మఱిన్ మోది ర
య్యెదనన్ హాయిగ నిద్రపోవు ఘనుఁడౌ నాకుంభకర్ణున్ బదే
పదె దొర్లించిన గుఱ్ఱువెట్టుచునె లేవం డెంత గావించినన్. 953

పడి నిద్రించిన కుంభకర్ణు ఘన నిశ్శ్వాసాల ధ్వానాల నె
క్కుడు దైత్యుల్ బలవంతులయ్యు వట నాక్షోణిన్ నిలంజాలరే
కడు భేరుల్ ఘట శంఖ మర్దలములన్ గై కొంచు నొక్కుమ్మడిన్
చెడ వాయించినఁ గొట్టినన్ మెదలఁడే చేష్టాదులం జేయడున్. 954

వ. అంత నారాక్షసులు ఆకుంభకర్ణునిలేపలేక మ్రుతియు గట్టిప్రయత్నము చేయఁదలఁచి యొంటెలను కంచరగాడిదలను ఏనుఁగులను వానిపై బరు వె త్తించి దండములతోను కొరడాలతోను అంకుశంబులతోను గొట్టిరి. భేరీశంఖ మృదంగములను శక్తికొలఁది వాయించిరి. అతని గాత్రములపైని పెద్దకఱ్ఱల తోను స్తంభములతోను ఱోకళ్ళతోడను శక్తికొలఁది మోదిరి. ఆపెద్దచప్పుళ్ళతో లంక యంతయు ప్రతిధ్వనించి నిండి పోయి పర్వతవనంబులు దద్దరిల్లిపోయి నవి. కాని అతఁడు మాత్రము మేలుకొనఁడయ్యె. పిదప వేలకొలది భేరుల నొక్కసారిగా పసిఁడి పిడులు గలవాయించు కఱ్ఱలతో గొట్టిరి. అయినను అతిగా నిద్రించి బ్రహ్మశాపమును పొందిన యతఁడు లేవఁడు. అపుడు దైత్యులు మహాకోపావిష్టులై యితరవిధములుగా ప్రయత్నములు చేసిరి. 955

కొందఱు చేసి రెంతొధ్వని కొందఱు భేరులఁ గొట్టినారఁకన్
కొందఱు వీనులన్ గఱవఁ గొందఱు జుట్టును బీకినారిటుల్
కొందఱు వేనవేల్ జలము కుండలు వీనులఁబోసినార లి
ట్లొందఱు నెన్ని చేసినను నేమి చలింపఁడు కుంభకర్ణుఁడో. 956

బలులున్ గొందఱు కూటముద్గరములన్ పాణిద్వయిం దాల్చి యా
తలపై వక్షముపైని గాత్రములపై తాటించినంగాని వ్యా
కుల పాశంబులఁ గట్టి వైచిన శతఘ్నుల్ వేసియున్ గొట్టినన్
జలియింపం, డిలఁ గొంచెమేన్ మెలకువేన్ సంప్రాప్తమౌ కాదిటున్. 957

అటుపై వేయిగజాలచే నసుర నిట్లట్లెంతొ త్రొక్కంగఁ జే
యుటచే మాత్రమయెట్లొ కొంచెముగ నేదో కొంతగా మెల్కువన్
అటఁబొందెన్ గిరిశృంగముల్ తరులు వేయన్ బాది కొట్టంగ న
వ్వటికిన్ లేచెను నావులించుచు క్షుధా బాధార్తి నిద్రే చనన్. 958

గిరిశృంగంబుల పోవు పెన్పడగలన్ గెంటించు పెన్ బాహులన్
త్వరగాఁ జిమ్ముచు మెళవిఱచు చస్వీకార వక్త్రింబటన్
తెరవన్ జేయుచు నుండ మేరువు తుడన్ దీప్తార్కుఁడోనాఁగఁ గ్ర
చ్ఛఱ వెల్గెన్ గిరినుండి వాతముల యోజన్మీఱ నిశ్శ్వాసముల్. 959

అటులన్ లేచెడి కుంభకర్ణుఁడును గ్రీష్మాంతాన వర్షించుచున్
పటుపై మింట బలాకలన్ దనరు నబ్దంబట్లు తోచెన్ కనుల్
పటు దీప్తాగ్నులు వోలె విద్యుదురు దీప్తౌజస్సు లట్టుల్ విశం
కట దీవ్యగ్రహముల్ వలెన్ గనులకున్ గన్పించె నత్యంతమున్. 960

అపుడాతండు సమస్తభక్ష్యములు ప్రోగై యున్న యన్నంబులున్
విపులంబైన వరాహముల్ మహిషముల్ వేగంబ భక్షించి మాం
సపు రాసుల్గొని రక్త కుంభములు స్వేచ్ఛన్ జుఱ్ఱి మేదోఘబా
ధ్యపు మద్యంబులు కాళిచేసి మదినత్యంతంబు తృప్తింగనెన్. 961

అది వీక్షించి గ్రహించి దగ్గఱకు నాదైత్యుల్ వడింబోయి ప్రమో
కిక్కి దరిన్ నిల్చియు వానిఁ జుట్టుకొనఁగాఁ గెంపారు నేత్రాల నా
ల్గు దిశల్ చూచుచు కళ్ళు నుల్మకొనుచున్ లోలోన నాశ్చర్యమున్
గదురన్ నిద్దురనుండితేఱి యిటు వక్కాణించె నోదార్చుచున్. 962

ఎందుకు నాదరించి నను నిట్టుల లేపితి రేమి రాజు తా
నెందును క్షేమమేగద యెదేనియు వానికి భీతి గల్గెనా
ఇందఱు వచ్చి లేపితిరె యేదియొ యన్యులవల్ల భీతియున్
బొందియొ యుండవచ్చు నటు పొందకపోయిన నేల లేపుదుర్. 963

ఇదిగో నిప్పుడె రాక్షసేశుని భయుం బెల్లన్ వడిన్ బీకిపై
చెద నింద్రుం బడఁగొట్టనా, యనలమున్ చెండాడి చల్లార్చనా
ఇవె యిట్టుల్ నను స్వల్ప హేతువునకై యాత్రాత లేపండుగా
యెది యీ నన్నును లేపు కారణము నిప్డే చెప్పు డీ సత్యమున్. 964

అని వాక్రుచ్చెడి కుంభకర్ణు వచనం భావించి యూపాక్షుఁ డి
ట్లనెఁ గేల్మోడ్చి, దేవభీతి మనకేలావచ్చు, నామర్త్య చే
తనె యీభీతి మహాంతమై కలిగి దైత్యశ్రేణిచేగాని యీ
దనుజ శ్రేణులఁగాని కల్గదు మఱెంతై కల్గు మర్త్యాళిచే. 965

పర్వతములఁబోలు కపులవల్ల నిపుడు
ఇట్టి మనలంక పడె నాక్రమింపఁ బడియె
సీతను హరించి నందుచేఁ జింతమునుగు
రాము వల్లనె మనకెంతొ త్రాస మొదవె. 966

ఏక వానరుచేతనె యీపురంబు
మున్నె తగులఁ బెట్టఁ బడియె పుత్త్రుఁడైన
యక్షుఁడును సానుచరముగ హస్తిగణము
తోడఁ జంపఁగాఁ బడియెను తూర్ణముగను. 967

రాజ ! సురకంటకుండు పౌలస్త్యుడైన
రావణుఁడె స్వయముగ సూర్యవర్చ సొప్పు
రాముచే యుద్ధమున మృతప్రాయుఁడుగను
చేయఁబడి దయదలచి త్యజింపఁ బడియె. 968

ఎదిసురలు దేవదానవు లేని చేయ
రది యొనర్చి రాముఁడిపుడె ప్రాణసంశ
యంబు గూర్చియు గావించె నను నపుడు
పలుక యూపాక్షు నావాక్యములను వినుచు. 969

యుద్ధమున భ్రాత రావణుఁ డోడినట్లు
వినుచుఁ గుంభకర్ణుఁడు కండ్ల వేగఁ దిప్పి
యనియె "నిపుడె సేనలను లక్ష్మణుని రాము
రణములోఁ జంపి రావణుఁ గనెద నపుడు. 970

కపుల మాంసరక్తాల రాక్షసుల కిపుడె
కరము సంతోషమును నేను కలుగఁ జేతు
స్వయముగా నెత్తురును త్రాగివైతుఁ గూడ
అనఁగ మ్రొక్కి మహోదరుఁ డనియె నిట్లు. 371

రావణుఁడిది చెప్పవిని తర్వాత నీవు
మరల గుణదోషములను విమర్శ చేసి
ఇఁక మహాబాహు శత్రులనెల్ల నపుడు
వడి జయించెదు గాని యప్పుడె సువీర! 372

అటు మహోదరుఁడన విని యసుర గణము
తోడఁ గుంభకర్ణుఁడు ఘనౌజుఁడగుచు
బయలుదేఱ నాసనమందు వఱలుచున్న
రావణునికి దైత్యులనిరి ప్రాంజలులయి. 373

కుంభకర్ణుఁడు భ్రాత మేల్కొనియె రాజ!
అటకెచనిచూతువా లేక యిటకు రాఁగ
నరయుదొ యన రావణుడటకు వచ్చి
యున్న వారితోననె నిట్లు యుక్తరీతి 374

ఇతని నిటనె చూడఁదలంతు నితని నర్చ
చేసి యిటకె రప్పింపుడు స్వేచ్ఛగాను
అనఁగ వారేగి కుంభకర్ణునికి ననిరి
ప్రభువు నినుచూడ గోరెఁ దత్సభకెరమ్ము. 375

అన మహాబాహువు శయనమందు నుండి
యెగిరి మోము కడిగి స్నానమిఁక నొనర్చి
త్రాగఁగోరశక్తి నిడుమద్యాదులపుడె
ప్రభువు నాజ్ఞ వారిడిరి కుంభముల కొలఁది. 376

కాంచి యిరువేల కుండల కల్లు ద్రాగి
యపుడు కొంత మత్తుగని ఘనౌజుఁ డగుచు
మత్తుఁడయి కుంభకర్ణుఁడు మసలి యముని
సమమె యయి యన్న మేడకుఁ జనియెఁ నంత. 977

దైత్యతతితోఁ జనుచు ధర దద్దరిల్ల
నడుగులిడుచు సహస్రాంశు వట్లు ధరను
వెలుఁగఁ జేయుచు దైత్యు లంజలులు పట్ట
వెడలె నతఁడు స్వయంభువు వేశ్మ కట్లు. 978

రాజవీధి నేగెడి యమిత్రాంతకరుని
కుంభకర్ణుని నడయాడు కొండ నట్లు
అరసి వానరులంతట నధిక భయము
పొందినారలు తమ తమ డెందమందు. 979

కొందఱు రాముని శరణం
బొందిరి కొందఱు భయపడి భువిఁబడినారల్
కొందఱు వ్యథపడి పాఱిరి
కొందఱు హడలి భువిపైని గూలఁబడిరటన్. 980

మకుటమును దాల్చి గిరి యట్లు మార్గ మందు
చనుచుఁ దన తేజుచే సూర్యు సరగఁ దాకు
నిటుల నుగ్రుఁడై తోపగ నచ్చెరువుగ
పెరగ నాతని గని కపుల్ పరువు లిడిరి. 981

వ. అంత మహావీర్యుండు మహాతేజుఁ డగు రాముఁడు ధనువు గ్రహించి మహాకాయుఁ డగు కుంభకర్ణుని చూచెను. పర్వతాకారుడై పూర్వప నారాయణవిభుండు ఆకాశమునువలె నాకాశమందు వ్యాపించు స్వర్ణభూషణప దాల్చి కార్ముఖమువలె నున్న యా దైత్యుని చూచి వానర సైన్యములన్నియు

బరువెత్తుచుండ నాశ్చర్యపడుచు రాముఁడు విభీషణు నిట్లడిగెను. పర్వతము వలెఁ గనిపించెడి యితం డెవడు, కిరీటముదాల్చి కపిల నేత్రములతో గనిపించు చున్నాడు. మెఱుపుతోఁ గూడిన మేఘము వలె లంకయం దితఁడు కనుపట్టు చున్నాడు. భూమికిఁ గేతువు వలె ఇతఁ డొక్కడే మహా ఘనుడై యున్నాడు. వీనిని చూచినవార లందరు పరువెత్తుచున్నారే, చెప్పుము ఇతఁ డెవ్వఁడు? రక్షస్సా, అసురుడా, నేనిదివఱలో ఇటువంటి ప్రాణిని చూడలేదు. అని ఎవరిని ష్టపెట్టని రాముఁ డడుగ మహాప్రాజ్ఞుఁ డైన విభీషణుఁడు ఆ కాకుత్స్థునితో నిట్లనియె. 332

విను కుంభకర్ణుండు విశ్రవసుని సూనుఁ
డతిబలు డింద్రుని యము జయించె
ఇతఁడు దేవభుజంగ దితిజ విద్యాధర
గంధర్వకిన్నర గణము గెలిచె
ఇతనిఁ బ్రమాణాన నెవఁడు సాటి యెలేడు
సురలు శూలుఁగ నెంచి పరువులిడిరి.
ప్రకృతిగ నీతఁడు వరవర్చస్వి యన్యదై
త్యులకైతె వరదాన మోబలంబు

ఈమహాత్ముఁడు పుట్టగనే క్షుధార్తి
వేల సత్త్వాలఁ దినివైచె లీలగానె
అంత కంగారుపడి ప్రజ లామహేంద్రు
శరణుఁ జొచ్చి యీబాధ తెల్పిరి కరంబు. 333

అపుడు కోపించి వజ్రాన వతని వజ్రి
కొట్ట నాదెబ్బతిని యార్చెఁగోప మొంది
అట్టి యార్పులకును భీతినందిరెల్ల
భూమి కపించిపోయెను పూర్తిగాను. 334

అంత కుంభకర్ణుడు కోపమందివేగ
నింద్రు నైరావతగజదంత మిట్టిలాగి
నింద్రు వజ్రంబుపై కొట్టి నింద్రుడంత
బ్రహ్మఋషి దేవదానవుల్ బాధపడిరి. 985

వ. అంత ప్రజలతోఁగూడ నింద్రుఁడు వెడలి స్వయంభువు దరికిపోవగా ఆదేవతలు ప్రజాపతికి కుంభకర్ణుని దుష్టత్వమును నివేదించిరి. ఇట్లు ప్రజలను భక్షించుట, దేవులను బాధించుట, ఆశ్రమములు ధ్వంసముచేయుట,పరస్త్రీలను హరించుటనుగూర్చి దేవతలు బ్రహ్మతోఁజెప్పిరి. ఇతఁడు ఇట్లే గనుక నిత్యము ప్రజలను భక్షించినచో ఇంక లోకము శూన్యమైపోవును. అను నింద్రుని వాక్యము విని యపుడు ప్రజాపతి రాక్షసులను కుంభకర్ణుని రప్పించి వారిని జూచి నమ్మకము గల్గించి యిట్లనియె. నీవు లోకనాశమునకై విశ్వవసువు నిన్ను గనెను. కనుక నీవు నేటి నుండె మృత ప్రాయుఁడ వయిపరుండుదువు అని. అంతనతఁడు బ్రహ్మశాపముచే తిరస్కృతుండయి ప్రభువు నెదుటనే పడి పోయెను. అపుడు మిగుల కంగారుపడి రావణు డిట్లనియె. పెరిగిన కాంచనము వంటి వృక్షమును సమయము వచ్చినపుడు ప్రజాపతీ! నరకివైచితివి.

నీవు పలికినది యసత్యము కానేరదు. కాని ఇతడు తప్పక నిద్రించును. కాని నిద్రించుటకుఁగాని మేలుకొనుటకుఁగాని కొంతగడువు నిర్ణయింపుము అని. అప్పుడు రావణుని మాటలువిని ఆ స్వయంభువిట్లనియె. మంచిది యితడు ఆరుసెలలు నిద్రించును. ఒకరోజు మేల్కొనును. ఆయొక్కరోజు ఆకలితో భూమినిసంచరించి నోరుతెఱచి కోపగించిన యగ్నివలె లోకులను భక్షించును. రావణుడు వచ్చిన కష్టమునుజూచి కుంభకర్ణుని లేపెను. రాజు రావణుని పరాక్రమమునకు భయపడెను. ఇదిగో భీమవిక్రముడగు కుంభకర్ణుడు శిబిరమునుండి బయలుదేరి వానరులను భక్షించుటకై పరుగెత్తుచున్నాడు. కుంభకర్ణునిచూచిన వానరులు ఇపుడు పరుగెత్తుచున్నారు. రణమున కోపించిన యతనిని వానరులు వారింపలేరు. ఇదంతయు భయపెట్టెడి వేషమెయని చెప్పుము. అది తెలిసిన వానరులు నిర్భయులగుదురు. అని విభీషణుడుచెప్ప సహేతుకమగు నతని వాక్యమువిని రాముడు సేనాపతియగు నీలునితోనిట్లనియె. 986

నడు సైన్యంబులనెల్ల వ్యూహములుగా నడ్పించి నిల్పుండు మి
వ్వాడ సంచారపుఁ జోట్లు సంక్రమములం బూరింపగాఁ బెట్టి యా
పుడమిన్ వానరులెల్ల శైలశిఖరంబుల్ చెట్లు రాళ్ళున్ బథిన్
బడవైవం దగు ప్రోగు పెట్టవలె సర్వప్రాంత దేశంబులన్. 987

గిరులన్ జెట్లను నాయుధంబుల కడున్గేలన్ వడిన్బూని యుం
దురుగాకంచును రాముడాజ్ఞ యిడ సిద్ధుండౌచు నీలుండు నా
శరభుం డంగదుఁడున్ గవాక్షుఁడును పెన్శైలంబులన్బోలు నా
గిరిశృంగంబులు నెల్లద్వారపు దరిన్ గ్రేళ్ళుబ్బి బర్వెత్తిరే. 988

మఱి యారాముని వీర్యముల్ వినుచు నాత్మంబొంగి యావానరుల్
అరిసైన్యంబుల నెల్లగొట్టి చనఁగానంతన్ గనంబోవుచున్
గిరులం జేతనుబట్టి వేగముగనే గ్రేళ్ళుబ్బి యేతెంచు మం
దర తుల్యాభ్రములట్లు బైఁబడిరి యుద్యత్ మేఘ జాలంబటుల్. 989

దనుజ వ్యాఘ్రుఁడు నిద్రచే మధువుచేతన్ మత్తుడై నోలుచున్
ఘన లక్ష్మిం దిలకించు రాజపథముల్ కంపింపఁ గాళ్ళుంచుచుం
దనుజుల్ వేలుగఁ దన్ను జుట్టుకొన సౌధాగ్రంబు నందుండి వల్
వనితల్ పూల్కురియంగ నేగి నృప ప్రాసాదముం గన్గొనెన్. 990

జలద శ్రేణిని సూర్యుంబలెను రక్షోధీశు ప్రాసాద మ
వ్వల తాఁజొచ్చి వదంబులంచి దుశ్చింగంపం బొందఁగా నందు క
క్ష్యల లంఘించుచు నంత పుష్పకవిమానాసీను నాయున్న మి
క్కిలి దుఃఖంబున నున్న వానిని దశగ్రీవున్ గనెన్ శ్రద్ధతో. 991

అపుడేతెంచెడి కుంభకర్ణుఁగని రక్షోధీశుఁడౌ రావణుం
డపుడే లేచి ముదంబుతో నెదురుగా సత్యాదృతిం బోయి తె
చ్చి పయిం జూపఁగ కుంభకర్ణుడట నాసీనుండ యారావణా
ఙ్ఘ్రిపదంబుల్ వడిమ్రొక్కి యేమినెల వాలోచించి వాక్రువ్వమీ. 992

అన నాలించియు రావణుండెగిరి యంతైె గంతులన్ వైచి త
మ్ముని గ్రాగింటను గుచ్చఁ గౌఁగిటను తమ్ముండుం పడిం గ్రుచ్చి తె
మ్మని యెంతో యభినందితుండగుచునే మేలైన స్వర్ణాసనం
బునఁ గూర్చుండియు నల్క రక్తనయనంబుల్ మీరగా నిట్లనెన్. 993

ఏలకు నాదరించి విభు! యిట్లు ననున్ వడిమేలు కొల్పినా
వోలి వచింపుమీ యెవని నుండి భయంబు జనించె, వేని ప్రా
ణాలిపుడేను తీయవలె నాకు వచింపు మటంచుఁ బల్క నే
త్రాలు ధవంత్ర త్రిప్పయనె రావణుఁ డల్గిన కుంభకర్ణుతో. 994

నీవిటు నిద్రపోవఁగఁ జనెన్ బహుకాలము హాయి నిద్రలో
నీవు సుఖించి కాంచవుగ నేడిటు వచ్చిన రాముభీతి, సు
గ్రీవునితోడ దాశరథి లీలగ వారిధి దాటి సేనతో
శేవదలిర్ప ఈమన దృఢీకృత సేనల కూల్చుచుండెగా. 995

మనలంకన్ గల పూవుఁదోటల వనుల్మాపెన్, వడిన్ సేతువైఁ
జనుదెంచెన్ కపిసేనలున్ జలధిగా సర్వంబు గావించె, నిం
దనిలో వానరసేనయే మనదు దైత్యశ్రేష్ఠులన్ గూల్చి వై
చెను నావానరసేవ చావ దెపుడున్ జెండాడు గెల్చున్ సదా. 996

ఇటులన్ భీతియె పుట్టె నీపురిని రక్షింపన్ దగున్ నీవ యు
ద్భటః వీరన్ వధియింపు మిందు కొఱకే వైళంబ మేల్కొల్పితిన్
ఇటు రక్షింపుమి యింక లంక శిశువృద్ధావ శిష్టంబవ్వైె
యిటులుండెన్ బొనరింపు దుష్కరమహాకృత్యంబు నీ భ్రాతకై. 997

ఇది నీకెప్పుడుగాని చెప్పితిన యెంతే భ్రాత నీయందు నా
కు దయా స్నేహము లాదరంబులును గల్గున్ జుమ్మి దేవాసుర
ప్రధనాలందును చాలసార్లు సురలుం బర్వెత్త నోడించితే
ఇది సర్వంబటు లుంచు భీమబల! నీకెందున్ సముండుండెనే? 998

ప్రియరణ ! బంధుప్రియ ! యీ
ప్రియహిత కార్యంబును బొనరింపుము సుమ్మీ
రయమేగి శత్రుసేన నిఁ
క యమునికడకనుపు శరతు ఘనమనిలమతుల్. 999

హడలుం జెందిన యన్న రావణుని దీనాలాపమాకుంభక
ర్ణుఁడు నాలించుచు నవ్వి చెప్పెనిటు ముందోషంబు నెద్దాని న
ప్పుడు మంత్రించెడి కాలమందుఁగని నాహో యద్ది యాపథ్యపున్
నుడులం దిష్టముకేని నీకుఁ గలిగెన్ జుమ్మీ స్మృతించెచ్చుకో. 1000

ఖలకర్ముల్ నరకంబు గాంతురిటు దుష్కార్యంబు గావింప ని
ట్టుల నష్టానికిఁ దగ్గ యూఫలమె పట్టుల్‌పట్టి ప్రాప్తించె న
ట్టుల నీవప్పుడు ముందుగన్గానక యొట్లో క్రొవ్వి గర్వానఁ గే
వలమీ దోషము పుట్టునంచుగనకే పాటించి గావించితే. 1001

వితగను ముందు చేయుపని పిమ్మటఁ, బిమ్మటచేయు దానినిన్
ధృతి చెడముందు చేయునతఁ డెన్నఁడెఱుంగఁడు మంచిచెడ్డలన్
శ్రుతమును దేశకాలములు చూడక చేయు విరుద్ధకర్మలన్?
సతత మపాత్రునందిడిన సద్ధవిసట్టులు దోషయుక్తమౌ. 1002

మంత్రులను గూడి యుత్తమ మధ్య మాధ
ముల త్రివిధమగు కర్మలఁ దెలిసి ద్రవ్య
దేశకాల ప్రయోజనాత్మీయగతుల
నిర్ణయము చేయు వాఁడొందు నీతిఫలము. 1003

నీతిశాస్త్రముఁ బట్టియు నియతకార్య
మాచరించి మంత్రులఁ గూడి యదను తెలిసి
స్నేహితులఁ జూచి వర్తిలు నీతినుండి
నిర్ణయము చేయు వాడొందు నీతిఫలము. 1004

ధర్మ మర్థము కామము తగినవేళ
రాక్షసేశ్వర ! యన్నియు ప్రథిత రీతి
జంటలుగనో పొందెడి పూరుషాగ్రవరుఁడు
నిర్ణయముచేయఁ బొందును నీతి ఫలము. 1005

ధర్మమునఁ గామమందు నర్థంబునందు
ఏది శ్రేష్ఠమొ విని గ్రహియింపకున్న
రాజుగాని రాజసదృశ తేజుఁడేని
వాఁడు విన్న దెల్లయుఁ గూడ వ్యర్థమె సుమి. 1006

దానసామ భేదము లేని దండమేని
అన్నియునుగాని నయ మనయంబుగాని
ధర్మ కామార్థములుగాని తగిన యాత్మ
గలిగి సచివాళిఁగని చేయుఁగనఁడు వ్యథలు. 1007

అర్థ తత్త్వజ్ఞులగు నమాత్యాళితోడ
తన హితానుబంధ మెఱిఁగి తనదు కార్య
మా యకార్యము తెలిసియు నాచరించు
వాఁడె లోకంబులోపల బ్రదుకు హాయి. 1008

పురుషులు శాస్త్రార్థంబులు
నరయక పశుబుద్ధులగుచు నాలోచనలన్
ఎఱిఁగిన వారటు లెంతయు
గరువముతోఁ జెప్పుట కటు కడఁగెదరు కదా. 1009

అర్థశాస్త్రాల నవభిజ్ఞులైన వారి
యహిత వాక్యముఁబట్టి చేయంగవలదు
అసలె యర్థశాస్త్ర మెఱుంగనట్టి వారి
వాక్కుఁగొనరా దధికలక్ష్మి వలయువారు. 1010

హితముగను దోఁచు నహితంబు నేమనుష్యు
లూరక ప్రగల్భులై ప్రేలుచుంద్రో వారు
కార్యముఁ బాడొనర్తురు కాన నట్టి
వీరి మంత్రబాహ్యులఁ జేయవలయుఁ జుమ్మి. 1011

తెలిసిన రిపులఁగూడి భర్తృ క్షయంబు
చేయుఁ దలపోసి తలక్రిందు చెడ్డపనులు
చేసి మంత్రులై వ్యవహరించెడి దురాత్ము
లైన మంత్రుల నెఱిఁగి చేయుంగవలయు. 1012

శ్వైరగఁ గృత్యాల దుష్టమంత్రములఁ బట్టి
నడచు చపలచిత్తులయిన నరపతులవి
ఛిద్రములఁగొని నడతురు చిల్లుపడిన
క్రౌంచగిరి నుండి పక్షుల్ చరించునట్లు. 1013

ఎవఁడు రిపుఁదెల్సి తన్ను రక్షించుకొనఁడొ
వాఁ డనర్థాలఁగని పదభ్రష్టుఁ డగును
ఇదివఱకె మనదుతమ్ముఁ డెది వచించె
నదె హితము, లేద నీనచ్చినదియె చేయు. 1014

అటులఁ గుంభకర్ణుఁడు చెప్పినట్టి నుడుల
నా దశాస్యుఁడు రావణుఁ డాలకించి
కన్బొమలను జిట్లించుచుఁ గరము మండి
యిట్లు కుంభకర్ణునితో వచించె నపుడు. 1015

నను శాసింతువె మాన్యుఁడౌ గురు బలెన్ మాన్యుండవా యేమి యిం
కను చాలింపుమి యూత్రశమం; బిపుడొ యుక్తంబౌ నదే చేయు ప్రాం
తినొ వ్యామోహము చేతనో బలము శక్తిన్ గర్వముం బొందియో
మనుపె కార్య మొనర్చినో యుధియె యిప్డున్ త్రవ్వుటల్ వ్యర్థమే. 1016

ఇపు డెదియు_క్తమో యొనరింపు మదియె
గతము గూర్చి శోకింపరు గతము గతమె
నా యుపనయంబుచేఁ గల్గినది త్వదీయ
విక్రమంబున సరిదిద్ద వేగఁబూను. 1017

నాయెడల నీకు స్నేహంబు నాటియున్న
నీదు బలమె నీవుఁ దెల్పితివ యేని
ఈ రణంబు కర్తవ్యమం చెంచిచేయు
యిప్పుడది విక్రమించి గావింపు మింక. 1018

ఎవ్వడు విపత్తు లోనున్న యిట్టి దీను
నాదుకొని స్నేహమును జూపు నతఁడె సుహృదు
ఖము పొందు వారిసాయంబు నెతఁడు
ఆచరించునో యతడె యాప్తుడగును. 1019

వ. అని యిట్లు రావణుండు దీరముగా దారుణముగాఁ బల్కు వాక్యము
మును విని యితడు రోషముతో క్షుబ్ధహృదయముతో నున్నాడని తెలిసికొని
నెమ్మదిగా శాంతముగా నూరడించుచు కుంభకర్ణు డిట్లు పలికెను. 1020

ఇట్లు దైత్యేశ ! చాలు దుఃఖింపదగవు
స్వస్థుఁడవు కమ్ము నీవు రోషంబు వీడి
యేను బ్రదికుండఁనృప ! చేయుకెడదనిట్లు
ఎవనికై వ్యథ గాంతొ వధింతువాని. 1021

హితమవశ్యము వక్త్ర'శ్యమెల్లద అ
బాంధవమున స్నేహమునను బలికి తథిప!
ఇపుడె స్నేహముగల బంధువేది చేయు
నదియె చేతుఁజూడుము నాదు కదనమిపుడె. 1022

అనిని నేనిప్పుడా రామునతని యనుజుఁ
గూల్తుఁ బర్వెత్తుకపులఁ గన్గొందు విపుడె
త్వరగ నేఁడెచ్చు రాముని తలను గాంచి
సుఖముగనుము సీతయొ నేఁడె శోకమొందు. 1023

ఆప్తబంధువులు పోయిన యసురులిపుడు
స్వేష్టమగ రామువధను గాంచెదరు గాక
స్వీయ బంధులవధఁ గను వెతలఁ గుందు
నసురుల కనుస్రులుతుడుతు నరులఁ జంపి. 1024

అద్రివంటి సుగ్రీవుఁడు నర్కయుక్త
జలదమటు లాజి శిథిలమై చనఁగఁ గనెదు
రాజుఁ జంపఁగోరెడి నేను రాక్షసులను
కావ రాముడెట్టులు చంపఁగలడు నన్ను. 1025

ముందె నేఁ జంపఁబడఁగ రాముండు పిదప
నిన్నుఁ జంపు నో పూజ్యాత్మ ! నన్నుఁ గూర్చి
యీవు సంతాప మొందకు మిపుడు నన్నొ
యనికిఁ బంపుమి యితరుని నంపఁ దగవు. 1026

వైరిదమన ! నీశత్రులవడి వధింతు
వజ్రినైనను యముఁడైన వహ్నినైన
వాయునైనఁ గుబేరుని వరుణునైన
నెదురు కొనఁగల నేనింకఁ గదనమందు. 1027

పోనిశస్త్రాలు విడి యార్చిపోరుచుండ
కొండవంటి నేశూల ధరుండఁ దీవ్ర
దంష్ట్రిడను నేను నార్వయుద్ధంబునందు
బ్రదుకఁ గోరువాడెవ్వడు నెదుట నిలఁడు. 1028

కత్తిచేఁగాక గదచేతఁగాక నిశిత
శరగణంబులచేఁగాక శక్తిఁగాక
హస్తములచేత సంరంభమడర నేను
వజ్రధరునైనఁ జంపెడివాఁడఁ జుమ్మి. 1029

నాదు గుప్పిటి వడిసైచినప్పొడుగద
రాముబాణాలు నానెత్తు ద్రొక్కఁగలవు
చూతమోరాజ ! నేనుండ శోకమేల
పడెదు శిశ్రుతుఁగూల్ప బైల్వెడలెదిపుడు. 1030

ప్రభు ! అరాము నినుండి వీడు భయమున్ రాము్న్ వధింతున్ గపి
ప్రభు సుగ్రీవుని లక్ష్మణున్ దునిమెదన్ లంకాపురిం గాల్చి దై
త్య బలంబున్ వధియించు నట్టి హనుమన్ తత్సైన్యమున్ జంపి నీ
కు బృహత్కీర్తిని గల్గఁ జేసెదను గన్గామ్మి యసామాన్యమున్. 1031

విను మాయింద్రునివల్ల బ్రహ్మవలనన్ భీతిల్లితే, నేన యు
ల్గినచో దేవులు గూడ భూశయన మంగీకారముంజేతురా
యనలున్ మ్రింగెదఁ గాళ్ళు చల్లఁబడఁగాఁ బ్రాణాలు వీడున్ యముం
డిను నక్షత్రయుతంబుగా భువిని నిట్టే కూల్చి వైతుంజుమీ. 1032

సురరాజున్ వధియించెదన్ జలనిధిన్ జోద్యంబుగాఁ గ్రోలెదన్
గిరులన్ బిండియొనర్తుఁ జీల్తుధరణిన్ దీర్ఘంబు నిద్రించుచున్
ధరపై సోలిన కుంభకర్ణు బలమున్ స్థైర్యంబు భూతాళియే
యరయుంగావుత వానినెల్ల దినివేయున్ గళ్ళతోఁ జూచుచున్. 1033

ఇటు లోకత్రయిగాని నేసుతినుచో నేమాత్రముంజాల దిం
తట నీరామునిజంపి నీకు సుఖమున్ దథ్యంబుగాఁ గూర్చ న
చ్చటికిన్ బోయెదనింక రాముఁనిప్పుడే సౌమిత్రితోబాటు ముం
దట భక్షించి పయిన్ గపీశ్వరుల కృత్యంబున్ వడిన్ బట్టెదన్. 1034

ఇంక స్వేచ్ఛగ రమియింపు మిచ్చకొలఁది
మద్యములఁ ద్రావుపనులను మఱియుఁ జేయు
ఆ త్రివిదనాడు, నే రాము యమునియింటి
కనుపఁ జివరకు సీత నీకగును వశము. 1025

అతికాయుంపును బాహుశాలియును నౌ నాకుంభకర్ణుం సహం
కృతిఁ బల్కన్ వినుచున్ మహోదరుఁడు వల్కెన్ కుంభకర్ణా మహో
న్నత వశంబునఁ బుట్టికూడఁ గుజనుండట్లెట్లు ధృష్టుండవై
మతి గర్వంబున మాటలాడెదవు కార్యంబున్ గనన్ నేరవున్. 1026

నయమేదో యనయంబదేదొ యచటన్ కన్గొనపోలేవ యి
ట్టి యధీశుం,డిక బాలభావమున నిట్లీ వందు ధృష్టుండవై
యయనంబున్ తన వన్యలోను లవి యాయా వృద్ధి హాని స్థితుల్
నయమున్ దేశవిభాగకాలముల నీ నాథుం డెఱుంగుం జుమీ. 1027

బలవంతుండయి పామరుండు గురుసేవన్ చేయకున్నట్టి వాఁ
డిలగావింప నశక్యమైన ఘనమౌ నిద్రృష్మహాకర్మ యి
ట్టుల ప్రాసేజ్ఞుఁడుచేయు, * భిన్నఫల మిట్టుల్‌గూర్చు ధర్మార్థకా
మ లసత్కర్మల రూపమెల్ల గమనింపన్‌జాలుదే చక్కఁగన్. 1028

కర్మయే యన్ని ఫలములకుఁ గారణంబు
పాపకర్మల కిప ద్రశేష్ఠఫలమె కలుగు
అర్థధర్మాల ధర్మమనర్థమేని
శుభఫలమిడు నొకవ్వా డశుభము గూర్చు. 1029

---

* యాగాదులకు తత్కాలమున కష్టమే గాని సుఖము కనిపించుట లేదు. చౌర్యాదుల వల్లఁ దాత్కాలిక లాభము కలుగుచున్నది. యిట్లు భిన్న ఫలములు గూర్చుచున్నది కర్మ అని భావము.

ఇహపరములిడు కర్మగావించు జనులు
కామచారుఁడును శుభంబె కనుచు నుండె
ఇదియె యెంచి రాజానరించె నదియు మతమె
మాకు, నరికై చౌర్యవయొ యేమంత చెడ్డ. 1040

వీగియొంకడవే పోరుటకేది హేతు
వంటిపోయ దసాధువు ననుచితమును
ఆజనస్థాని వేల మహాబలాఢ్యు
లతనిచేఁ జచ్చిరె, యొకండ పతనిఁ గెలుతె. 1041

మును పె యెవరు జనస్థానమున జయింపఁ
బడిరొ యామహౌజస దైత్యవరులు నేఁడు
గూడనాటి ఘంగతులను గూడఁ దలఁచి
హడలి పోవుచుండుటయు మేమూరయుదుప. 1042

ఇట సింహంబటు లట్టు దాశరధి నాయా రాము సుప్తోరగం
బటులన్ నీప యెఱుంగకుండ నిపుడన్నా ! లేపుచున్నావ, యు
త్కట తేజస్సున మండి కోపపడఁ దాఁకన్ రాని యా రాము ముం
దట మృత్యుంబలె నే నరుఁడు పొందంగోరు వాక్రుప్పమీ. 1043

ఇదియెల్లన్ రిపు నిట్లెదుర్కొనుట యెంతే సంశయంబౌను నీ
యదనన్ నీవును నొంటిగాఁ జనుట నా కావంత యిష్టంబెగా
దిదె శత్రున్ బలవంతు నిర్బలుఁడువై యిట్లెదుర్కొంచికన్
బ్రతుకున్ వీడఁగ నిశ్చయించుకొని యెవ్వండావైరికిన్ లొంగునో 1044

ఎవనికి సాటిమానవుల నెన్నఁడుఁ జూడమొ యట్టి సూర్య వా
సవ సము నీవెదుర్కొన వెసన్దలపోయుదువేల ? యంచు ను
ద్దవిడి మహోదరుం డపుడు తద్గతి వాకొని కుంభకర్ణుతో
నవలను లోకరావణుఁడయై తగు రావణుఁ గాంచి యిట్లనెన్. 1044

జానకినిట్లు తీసుకొని చల్లఁగ వచ్చియు నిప్పుడెన్నొ, యే
లా నుడు లాడె దిట్లు ? జనకాత్మజఁ గోరెదవేని నీ వశం
బౌను నుపాయమొండు జనకాత్మజఁ బొందఁగ జెప్పువాఁడ నీ
కైనను నచ్చుచో నది స్వయంబుగ బుద్ధిని నాలకింపుమీ. 045

ఓ దితిజేశ ! అంక కిపు డూరక చాటఁగఁజేయు మిట్లు "సం
గ్రహదియుఁ గుంభకర్ణుఁడు పరాక్రమశాలి ద్విజిహ్వుఁ డేను నా
యైమగు రింక రాము వధకై వడిఁ బోదుఁగాక యుంచు నా
మీఁదట రాముతో రణము మే మొనరింతుము యత్నమూనియున్. 1046

ఏమునెవోపాయములు నింక జయింతుమ యేని చేయ మా
కేమియు లేదుగా బ్రదికి మే మొక వేళనతండె యున్న చో
మేము విమర్శచేసి యెదిమేకొని చేసినయు క్తమౌనొకో
యామెయి నీవిధంబుగను సంతటఁ జేతుము చూచి యప్పుడే. 1047

అట మేమో వలునెత్తురిలన్ దడిసి మాయంగాలు మేమే కరం
బటు లిట్టుల్ వడి రామనామముల నందం ధ్వంకితంబౌనటుల్
పటుతన్ జీలిచి కొంచు రామునిని నింకా లక్ష్మణుం జంపి యం
తట భక్షించితి మంచునార్చుచు భవత్పాదాల వ్రాలియున్. 1048

ఇఁక మాకిచ్చిన మాట తీర్చుమనగా నీవింకపెన్ హస్తిపై
నొకనిన్ నిల్పఁగఁ జేసి రాముడు బలం బొప్పారుసద్భ్రాతతో
నిఁక సైన్యంబులతోడఁ జంపఁబడెనంచీ వీటఁ జాటించి సే
నకు మాకున్ సఖిభృత్య సంతతికి దానా లిమ్ము హర్షంబుతో. 1049

ధనముల్ భోగములుల్ సువస్త్రమును గంధాద్యాను లేపంబులన్
ఘన మాల్యంబుల వీరయోధులకు వేగం బెన్నొ యిప్పించి నీ
వును మోదం బలరారఁ ద్రాగుతిమ ఘ్మామోద్భంబై యెల్లన్ పురిన్
ఘన రాముండును భ్రాతృబంధువులు ఛోర్ధాఁ జచ్చె నంచున్ గ్రద్దున్.

జనులన్ వాదుజనింపఁ జేసియు రహస్యంబందు నాసీత న
మ్మునటుల్ వాకొనియూరడించుచు ధనంబుల్ధాన్యముల్ రత్నముల్
ఘనకామంబులు గూర్చి మేల్కొలుపు మింకన్ సీత నీయందుఁగా
మన లేకుండియు నీయుపాయములచే మన్నించునిన్నున్ మదిన్. 1051

తన నాథుండును పో ననాథయయి చిత్తంబందు నైరాశ్యమె
చ్చను రంజించెడి భర్తపోయెనని స్త్రీచాపల్య భావంబుచే
తను నీకున్ వశమౌను మున్ను సుఖముల్ తానొందియే యుంటఁ జిం
తను ఘూరిలి సుఖార్థ సౌఖ్యము త్వదాధారమంచున్ మదిన్. 1052

ఎల్లవిధంబుల నాసీత యైనయు నిన్ను
ఇదియె నిశ్చయమిట్లు నామదికిఁ దోఁచు
రాముసెదుటఁబడిన ననర్థంబె కలుగు
నిందెయుండి నీపనిని సాధించుకొనుము. 1053

కదనమున కుత్సుకుండవు కాకుమయ్య
యుద్ధ మదిలేకయే సౌఖ్యమొదవు నీకు
శత్రుసైన్యాల ముందుకుఁ జనకుమింక
ప్రాణములపైకి తెచ్చుకోవలదు సుమ్మి. 1054

యుద్ధములు చేయకుండనె యుర్విధవుఁడు
జయముగాంచి పుణ్యంబు యశంబు శ్రీయు
ఖ్యాతి పొందియు రాజ! లోకంబునందు
చిరముగాఁబొంది సుఖమొందు నిరతమిట్లు. 1055

వ. అని యిట్లు మహోదరుఁడు చెప్పగా విని వానిని బెదరించి కుంభ
కర్ణుఁడు రాక్షసేశ్వరుఁడును తన భ్రాతయు నగు రావణునితో నిట్లుచెప్పెను.

దుష్టుఁడౌ రాముఁజంపి తద్ఘోరభయము
తుడిచివైతు నిప్వైరిపై పడయు సుఖము
జలములేని మబ్బులటు శూరులును వృధగ
నుఱుమరీ నాయుఱుము కార్యమరసె దనిని. 1057

తాను ధిక్కృతి పైపరు తమ్ముఁ బొగడి
కొనరు మాటలాడకె గొప్పపని యొనర్తు
రిన్నుఁబోలు పండితమానులెన్ని భీరు
వులగువారు మహోదర! పలిసిరిట్లు. 1058

ప్రధన భీరువులయిన నీవంటి ప్రియము
లాడువారు రాజునకుఁ బ్రక్కతాళమేసి
రాజె మిగులంగఁ జేసిరి లంకనెల్ల
కోశమోపోయె సేనలుఁగూడఁ జచ్చె! 1059

మిత్రనామ ధారులు మీరెశత్రులైరి
ఇదిగొ నిప్పుడె రణమునకేగి వైరి
నెదురుకొని జయించియు మీరలిట్లు
చేయు దుర్ణతి సరిదిద్దఁ జేతునయ్య. 1060

వ. అని ధీమంతుఁడైన కుంభకర్ణుఁడు పలుకగా విని రాక్షసరాజు రావణుఁడు ప్రహసించుచు యిట్లనియె నాయనా! యుద్ధవిశారద! నిజముగా ఈ మహోదరుఁడు రామునికి భయపడి యుద్ధము చేయనిష్టపడుటలేదు. స్నేహములోగానిఁ బలములోఁ గాని నాకింకెవ్వఁడు నీసాటిలేడు. కుంభకర్ణ! నీవు ఇంక శత్రువున్ వధింపబోయి జయింపుము. నీవు సాటిలేనివాఁడవుకాన భయనాశనమునకై నిన్ను లేపితిని. స్నేహితులగు రాక్షసులకిది సమయము కనుక శూలము ధరించి పాశధరుఁడైన యంతకునివలెఁ బొమ్ము సూర్యునివంటి తేజస్సుగల రాజపుత్రులను వానరులను భక్షించి వేయుము. నీరూపము చూచుటతోడనే వానరులు కాళ్ళకు బుద్ధి చెప్పెదరు. రామలక్ష్మణులును గుండెలువగిలి చచ్చె

దరు. అని రావణుఁడు పలికి తాను పునర్జన్మ పొం... తలచుకొనెను. కుంభ కర్ణుని బలమును పరాక్రమమును తెలిపి రాక్షస... శాంకునివలె నిర్మలుఁ డయ్యె. అంత కుంభకర్ణుఁడు రావణుని మాటలు ...ంతుష్టుడయ్యెను. 1061

వెలుఁగుల్ చిమ్ముచు నెల్ల కా ఱనుపదై ... డుం గూర్చుచున్
పలు బంగారు విభూషలం దగి మహావజ్రం... మిఱి ప్ర
జ్వలి తేంద్రాశని తుల్యమై యమరరక్షః కి... ద్యుగ్ర వీ
రులవేధించిన, శోణితార్ద్రమగు శత్రుధ్వంసి ...ంబుతో. 1062

ఘనతేజుండగు కుంభకర్ణుఁ డటు వేగం బైల్వెడిఱి రా
వణు నన్నుంగని యిట్లు పల్కె నిదిగో బైల్వెడిఱి యొక్కండనే
ఘనులన్ వానరులం భుజింతు, సుఖివై కాలంబు వెళ్ళింపు నా
కును సైన్యంబులతోఁ బనేమి యన రక్షోనాథుఁడీలాగనెన్. 1063

బలముల్ ముద్గరశూలముల్ గొనుచు రాబైల్దేరు మావానరుల్
బలవంతుల్ వ్యవసాయులుం గనుక స్వల్పంబేన్ ప్రమాదాన వ
ర్తిలు వానిన్ మఱి యొంటి వాని దశనాళిన్ నాశముం గూర్తు రిం
దులకై దుస్సహ సేనతో వెడలి శత్రుం జంపు మంచాడుచున్. 1064

వడిఁ బీఠంబున నుండి పైకెగిరి యా వర్చస్వి దైత్యేశుఁ డ
ప్పుడు శీఘ్రంబుగఁ గుంభకర్ణునికిఁ గెంపుల్ మీరు దండన్ తగన్
మెడలోఁ పైచి వరాంగదంబులఁ గడున్ మేలౌనటుల్ దిద్ది చం
ద్రుఁడటుల్ రాజిలుహారముం బరిమళాలుం జక్కగాఁ దీరిచెన్. 1065

చెవులం గుండలముల్ రచించి పృథునా చేవేళ్ళ యందుం గరా
లఁ దలం దూర్చి సుగంధనాగరులు పూయన్ స్వర్ణకేయూరముల్
మివులం దాలిచి నిష్కభూషణములన్ మేకొంచుఁ గుంభాలటుల్
చెవులందాల్చిన కుంభకర్ణుఁడట రాజిల్లెన్ హుతాగ్నిం బలెన్. 1066

పెను నీలి కటి సూత్రమును దాల్చి క్షీరాబ్ధి
వహివలయిత మందరాద్రిఁ బోలి
పెను భారమున నొప్పి వివిధాయు ధాభేద్య
మయి మెఱవటు దీప్తి నలరుచుండి
తగు పైఁడి కవచానఁ దనరి సంధ్యా మేఘ
వృత శైలపతి మహాద్యుతుల దనరి
సకల భూషలు శూలమిఁకఁ దాల్చి త్రివిక్ర
మోత్సాహి నారాయణోరుఁ బోలి

కుంభకర్ణుఁడు భ్రాతను గ్రుచ్చి మిగుల
తగఁ బ్రదక్షిణమును చేసి తలను వంచి
మ్రొక్కి బైల్దేఱ రావణుఁ డెక్కువైన
దీవెనలతోడ నాజికిఁ బోవ నంపె. 1667

—: కుంభకర్ణుని కపశకునంబు లగుట :—

శంఖ భేరులు మ్రోగ జలద ఘోషల మీఱి
రథములు కరులతో రథికు లలర
వరయోధు లరగాల ఖరముల నశ్వాల
మృగ పక్షి సింహాల నెక్కి రాఁగ
సతులు పూల్ కురియ చత్ర శూలము లూని
మదరక్త గంధాల ముదితుఁ డగుచు
బహు పదాతులు వేగ భయపెట్టి గర్జింప
రక్తాక్షు లతికాయు లనుసరింప

నీలికాటుకంబోల్ భటుల్ శూలగదలం
దాల్చి రాఁగుంభకర్ణుడు తరల ననికి
బహుళపరిఘుల ముసలాల పరశు తాళ
కాండములం దాల్చి రాక్షసుల్ గదలినారు. 1068

ఇటులన్ వేఱగుమేనం బెండ్లికొడుకట్లింతో గగుర్పాటు ము
చ్చటలన్ గూరుచుచున్ ధనుశ్శతపు పై శాల్యంపు దేహాన దు
ర్ఘటమౌ షట్శతదీర్ఘుండె శకట చక్రాక్షుండునై పర్వతం
బటు దగ్ధాద్రియటుల్ మహాన్యుండయి హాస్యంబొప్పగా నిట్లనెన్. 1069

అనలుం డాశలభాలనట్లు కపి యూధాంగంబులం గాల్చి పై
తును, కానీ కపులెంత మాత్రమును నెందుం దోషలేకాదు నా
కును పాపంబపరాధముం జలువ రీకుంకల్ పురోద్యాన భూ
షణులై యెంతొ వినోదపెట్టుదురు స్వేచ్ఛంగంతులన్ వేయుచున్. 1070

పురినెల్లం బడి యాక్రమించుటకునై మూలంబు రాముండు నా
నరకీటంబగు లక్ష్మణుం డతనిం దమ్ముఁన్ వధింపంగఁ జె
చ్చెఱ సర్వంబు హతంబగుం గనుకనే శీఘ్రంబ వానిన్ వధిం
తున్నీరణంబందున దైత్యు లార్చిరి మహాంబోధిన్ వణంకించుచున్. 1071

వడిగాక్షైత్రపాజ్ఞుండు కుంభకర్ణుం డనికై బైల్దేరుచుండం దివిన్
కడు నుల్కల్ వడె గర్ద భారుణపు మేఘంబుల్ భ్రమించెన్ వనుల్
వురముల్ కంపము చెందె నా కడలి మార్మ్రోగెన్ గడున్ నక్కల
ప్పుడు మంటల్ కడుం గ్రక్కి యార్చె విహంగంబుల్ తిగ్గె వక్రంబుగన్. 1072

ఇతండున్ బోయెడి దారి గ్రద్దలును నెంతే మాలలై కూలె నిం
కతిగాం గన్నదరెన్ భుజం బెడమదిన్ గంపించె భీమంబ యా
గతి ధ్వానంబులు చేసి మండిపడె నుల్కల్ సూరుండున్ మందుండౌ
క్షితి వాతంబు సుఖంబ పీవ దటు హెచ్చెన్ దారుణోత్పాతముల్. 1073

## —: పర్వేత్తు కపుల నంగదుడు మరలించుట :—

ఇవి ఎల్లన్మదిఁ గుంభకర్ణుఁ డిసుమంతేన్ లక్ష్యముంబెట్టకే
భువిఁ గాలుండును క్రోధుఁ సైలసముఁడై మున్ముందె ప్రాకారముఁన్
జవ మొప్పంగఁ బదాలదాటి చని యాశ్చర్యంబయై మేఘ రా
జివలెన్ మీరుచు నున్న వానరుల యాసైన్యంబటన్ గన్గొనెన్. 1074

ఇటు శైలోపముఁ గుంభకర్ణుని నటన్ వీక్షించి యావానరుల్
పటు వాతంబులఁ ద్రోయఁగాఁ బడిన వృక్షాలట్లు నల్దిక్కు కం
తట చెల్లాచెదరై చనంగను ప్రచండభ్రామ్య దభ్రవ్రజం
బటు వీక్షించుచు గుంభకర్ణుఁడు కడున్ హర్షంబు నొందెన్ మదిన్. 1075

అటు హర్షించుచు మేఘ సన్నిభుఁడె యానా కుంభకర్ణుం డటన్
పటురీతిన్ వరిఘోరుఁగ్రుఁడై యుఖుముఁగా నాఘోరఘోషంబు నం
తట నాలించి కపుల్ నికృత్తనిపత త్సాలద్రుమవ్రాత మ
న్నటు నేలన్ బడఁ బాశహస్తుయముఁడౌనా కుంభకర్ణుండొగిన్. 1076

జలధిన్ క్షోభము పెట్టుచున్ బిడుగులన్ జన్మింపఁగా జేయు న
ట్టుల శైలాల వహించు నట్లుఖుము శ్రేష్ఠున్ శక్రకపాళ్యంత కా
దులకేన్ జంపఁగ రాని దైత్యుఁ గని క్రోతుల్‌పాఱ వీక్షించి యా
నలు నీలున్ గవయున్ గవాక్షుఁ బలికెం * దారేయుఁ డీరీతిగన్. 1077

మిము మీవిక్రమముల్ ప్రసిద్ధమగు మీమీవంశ మర్యాద భ
స్మములోఁ బోసి భయార్తులై యెడకు నిర్మై పామరుల్ వోలె నో
క్క మొగిన్ బాఱెదరయ్యరే! మరలుఁడింకన్ సౌమ్యులారా! యిటుల్
మిము మీప్రాణముఁ గాచుకోగలరె యేమీచాలరే యాజికిన్. 1078

---

* తారేయుఁడు=తారకొడుకు అంగదుఁడు. పాశి=వరుణుఁడు.

ఇది యెల్లన్ బయిఁబైని వట్టి బెదరింపే సుండి యాదైత్యు ని
ట్లొదవం జేసిన వట్టి వేషమిది సుండో వానరుల్! వీక వీ
ని దహింపన్ గడగుండి యింక మరలుండీ యంచు వీర్యాన సం
గదుఁ డాడన్ గపులెల్లొ తేఱుకొని వేగన్ గూడి రన్యోన్యమున్. 1079

తరువుల్ కొండలు చేతఁ బట్టి కడుఁ గ్రోధంబారఁగా హెచ్చి వా
నరులున్మత్త గజంబులట్లరిగి యంతన్ బ్రాంశు శృంగాల భీ
కరమౌ ఱాళ్ళను పుష్పి తాగ్రతరులన్ ఘట్టించుచున్ గొట్టినన్
మఱి యేమాత్రము కుంభకర్ణుఁడనఁడుం బల్కఁ డుఁ గంపింపఁడున్ 1080

శిలలున్ వందలు వాని గాత్ర మువయిన్ శీర్ణంబులై పోయెఁ బూ
వులతోఁ జెట్టులు వేసికొట్టినను నీభూమింబడెన్ ముక్కలై
ఊలకం డేమి చలింపఁడుం బయిగఁ దాను గ్రుండయై పోయి కా
నల నగ్నింబలె మండి కాల్చఁ గపిసైన్యంబుల్ మహాక్రూరుఁడై. 1081

—: బాఱిపోవు కపులకు నంగదుడు ధైర్యముచెప్పుట :—

కపిముఖ్యుల్ రుధిరార్ద్రులై భువిని శఁకన్ తామ్రపుష్పంబులౌ
విపులంబౌ తరువుల్ వలెన్ బడిరి వేవేగన్ దిశల్ చూడకే
యపుడున్ బర్విడినారు గంతిడిరి యిట్టట్టుల్ భయుం బొంది యా
విపులాంగున్ గని వాని వీర్యములకున్ భీతిల్లి రత్యంతమున్. 1082

కొందఱు శక్తితో నసుర కొట్టఁగఁ గూలిరి వార్ధిలోపలన్
కొందఱు వచ్చినట్లు పధి గూడి చటుక్కునఁ బారినారికన్
కొందఱు క్రిందఁబై భువులఁ గొండల నెక్కి రెలుంగు బంటులున్
కొందఱు చెట్లు నెక్కిరిక కొందరు కూలిరి నేలపై గుహన్. 1083

అటులన్ గూలుచుఁ బర్వులెత్తు కపులన్ ఖ్యాతాత్ముఁడౌ నంగదుం
డట వీక్షించి పచించెనిట్లు కపులారా! నిల్వుఁడీ పోరుఁడీ
యిటు మర్లుండు ధరిత్రిఁబుట్టినను నిట్లేపారు మీకెల్ల నె
చ్చట స్థానంబు లభింప దీ ప్రభుకు రక్షన్ చే నువాంఛింతురా! 1084

భీరువులార శస్త్రములవీడియు మీరు పాఱుచుండ వి
మ్మారసి మీమ భార్యలును హాసము చేసెద రింతకంటె నీ
ధారుణిఁ జావెమేలు ప్రథితంబగు వంశములన్ జనించినా
రీ రహిఁ భీతులై చనెదరేడకుఁ బామర వానరుల్ వలెన్. 1085

అనిని పరాక్రమింపక భయంపడి పర్విడువారు నీచులౌ
జనసభ నప్పుడెన్నొ తమ శ్లాఘలె యెక్కువ చేసికొంచునౌ
వినిచిన గొప్ప లెక్కడకు వెళ్ళెను నిప్పుడు మన్య ధిక్కృతిన్
గని బ్రదికుండు పందలనెకానుకి లోకులు దూఱుచుంద్రుగా. 1086

సతతము బుధాళి మెచ్చుకొను సృతథిఁబోవుడు భీతివీడుఁడీ
హతులము నైతిమేని ధరయుండుఁ బడుందుటొ పొందరానిదౌ
గతియగు బ్రహ్మలోకమును గాంచుటొ శత్రునిజంపిగొప్పకీ
రితియొ సువీర లోకపు సమృద్ధిగొ పొందెదమోయి వానరుల్. 1087

మంటలోఁబడిన మిడత మాడ్కినపుడు
కుంభకర్ణుఁడు రాముఁ గన్గొనిన మనఁడు.
పాతి ప్రాణాలఁ గాపాడు వాంఛయున్న
మన యశస్సెల్ల నాశంబు గనిన యట్లె. 1088

వ. అని హెచ్చరించు కనకాంగదుడగుయున యంగదుని వాక్కులాలకించి పరువెత్తుచునె శూరులచే గర్జింపబడిన వాక్కులుగల వానరులనిరి. మాకికుంభ కర్ణునితో యుద్ధముచేసి ప్రయోజనములేదు. మాకిది సమయముకాదు. మాకు జీవితమే ప్రియమైనది. అనియిట్లుపలుకుచు నావానరులందఱు భీమాకారుడును

భీమాక్షుఁడునయిన కుంభకర్ణునిజూచి దిశలపై పు పరుసెత్తిరి. అంత అంగదుడు సాంత్వ వాక్యములచేత యుక్తులచేతను నచ్చఁజెప్ప నావానరులపుడు వెను దిరిగిరి. అంత వానరపుత్రుడగు నంగదుని వాక్కులఁబట్టి వారుసంతోషించి యతని యాజ్ఞను నిరీక్షించుచుండిరి. పిదప వారు ఋషభ, శరభ, మైంద, ధూమ్ర, నీల. కుముద, సుషేణ, గవాక్ష, గవయ, తార, ద్వివిద, పనసఁ వాయుపుత్రులను ముందుంచుకొని పోర బయలుదేరిరి. 1089

—: అంగదాదులు కుంభకర్ణు నెదుర్కొనుట :—

అపలన్ వానరులెల్ల వెన్దిరిగియున్ హర్షాన ప్రాణాలనా
హవమందాహుతి చేయఁబూనుచు ఘనంబౌ మేనులం దాల్చి సా
నువులన్ గొప్ప ద్రుమంబులన్గొని ప్రకర్షున్ గుంభకర్ణున్ గరం
బు వెసన్మించి యెదుర్కొనం జని రపూర్వోద్దామ శౌర్యంబుతో. 1090

అపు డుద్దండుఁడు కుంభకర్ణు డతికాయుంబొప్పగాఁ బెన్గదన్
విపులంబైన భుజానవెత్తి మివులన్ భీమంబుగాఁ దిప్పుచున్
రిపులన్ నల్గడఁ గొట్టికూల్చగ ధరిత్రిన్ వందలేడెన్మిదౌ
కపిసాహస్రములున్ విశీర్ణ విచలద్గాత్రాలఁ గూలెన్ బడెన్. 1091

ఎనమండ్రున్ బదునార్వురుం బదుగురాయిర్వండ్రు ముప్పండ్రు చూ
పున బాహాబల మొప్పలాగి తినుచున్ మోమెత్తిపర్వెత్తి యుం
తనె క్రుద్ధుండయి పాములం గడు గరుత్మంతుండు వోలెం భుజిం
పనెటో కష్టమయూరడిల్లి పెనుగుంపై __ చ్చ రావానరుల్. 1092

ద్వివిదుండప్పుడు శైలముం బెరికి వేవే కుంభకర్ణున్ నగా
భ,విలోలాభ్రము శైలమున్ బలెఁ గరంబున్ మించి పైకెత్తి చి
మ్మి విదిర్చన్ ఘనసైన్యమందుఁబడి యేమీ కుంభకర్ణాంగమున్
దివకే దైత్యుల యేన్గులన్ హయములన్ దేర్లెల్లఁ గూల్చెన్ వడిన్.1093

గిరి వేగంబున సూతుఁడున్ హయములున్ గిట్టించుఁ గూలన్ నిశా
చర రక్తంబున నార్ద్రమైన ధరణిన్ సంగ్రామ రంగంబు భీ
కర మయ్యెన్ రథికుల్ భయప్రదములౌ గర్జాధ్వనుల్ చేసి భీ
కర కాలోపమ బాణపంక్తిఁ గపులన్ ఖండించి రాశీర్షముల్. 1094

ఘనులౌ వానరులున్ ద్రుమంబులను వీకన్ బీకి పైకెత్తి వెం
టనె యశ్వంబుల నొంచె లేన్గుల నిశాట వ్రాతమున్ జంపి, రా
హనుమంతుండౌ మహాద్రి శృంగముల మేలౌ చెట్లలన్ బీకి కుంభక
ర్ణుని శీర్షంబునఁ గుర్పి పైకెగిరియెంతో చూపెఁబెన్ శౌర్యమున్. 1095

కుంభకర్ణుడపుడు కొండల శిఖరాల
ద్రుమవర్షములను శూలమునఁ గొట్టె
కపిసేన దరిఁ గుంభకర్ణుండు మెఱుపుఁ బోల్
శూలమేయు హనుమ శైలమేసె
పడిదెబ్బ కుంభకర్ణుడు భీకరాంగుఁడు
ఘన మేధసున రక్తమునను దడిసె
అట కుంభకర్ణుడు నద్రి వంటి హనుమన్
గుహుఁడు క్రౌంచ మటు గుండెఁ గొట్టె

అంత గుండెపైఁబడి శూలమదర హనుమ
నోటనెత్తుర గ్రక్కి లయఘనుండు వోలె
నార్వ ముదమొంది రాక్షసులార్చి రపుడు
హడలి కుంభకర్ణుఁ గని పర్విడిరి కపులు. 1096

బలవంతుండగు నీలుఁడంత బలమున్ వైళంబ తానాపి యు
జ్వ్వలధీ గల్గిన కుంభకర్ణు గిరితో వైవంగతోడ్తో మహా
చలమున్ గుప్పిటఁ కుంభకర్ణుఁడును పెల్చన్ గొట్టి కూల్చన్ మహా
చలమున్ జ్వాలలుగ్రక్కుచున్ బడియె నాక్ష్మా రంగమందత్తఱిన్. 1097

శరభుండున్ ఋషభుండు నీలుఁడు గవాక్షాఖ్యుండు రాజన్మ హో
ద్ధురుఁడై యొప్పిన గంధమాదనుఁడు నై దుం(డ్ర)ంత నాకుంభ క
ర్ణు రయానన్ గిరులన్ ద్రుమాలనటకేల్ గుప్పిళ్ళఁ గాళ్ళన్ వడిన్
తటుమన్ గొట్టినఁ గుంభకర్ణుకుఁ జలత్స్వర్నాభమై నొంచవున్. 1098

ఘనవేగున్ ఋషభుం గవుంగిటను వేగంబట్టి పీడింప నో
టను రక్తంబును గ్రక్కుచుం బడెనతండంతన్ ఘనున్ నీలు జా
నునఁ గొట్టెన్ శరభాఖ్యు గుప్పిటవడిన్ గ్రుమ్మెన్ గవాక్షున్ ధరి
త్రిని గూల్చెన్ వెస గంధమాదనునిగాలిం దన్నె దైత్యుండటన్. 1099

అటులం దెబ్బలు తించురక్తముల స్వీయాంగంబులన్ దడ్సి యం
తట భేదించిన మోదుగుల్ వలెనునద్ధాత్రిన్ గపీంద్రుల్ పడన్
ఎటులున్ బోవక కుంభకర్ణు మెయినెంతేఁ జుట్టి శైలాభు లు
ద్భట వీరుల్ కపులెల్ల వేలుగను దైత్యాంగంబు పైకెక్కియున్. 1100

పళ్ళను కఱచిరి, గీఁకిరి
గోళ్ళను పొడిచిరి కరంబు గుప్పిళ్ళను, మో
కాళ్ళను గ్రుచ్చిరి, తొక్కిరి
కాళ్ళను గడుఁ గుంభకర్ణు ఘన తనువెల్లన్. 1 0

గిరితుల్యుం డిటు వేల వానరులచేతఁ గ్రేళ్ళుబ్బి త్రొక్కంబడన్
గిరి వృక్షంబులచేతఁ బోలెను వెలింగెన్; గుంభకర్ణుండా వా
నరులన్ బాములఁ బక్షిరాజు కరణిన్ భక్షింపఁ బాతాళ కం
దరతుల్యాస్యముఁ జొచ్చి వెల్వడిరి కర్ణఘ్రాణ రంధ్రంబులన్. 1102

వానరులఁ దినుచుఁ బర్వతాభుఁడు కుంభ
కర్ణుండు కోపించి కపుల నొంచె
కాలాగ్నివలె మించి కపి మాంస రక్తాల
భువినెల్ల రక్తపు బురదఁ జేసె

వజ్ర ధరేంద్రుఁడు వలె పాశ హస్తుండు
యముఁ డట్లు శూలాన నదరి మీఱె
వేసవిలో నగ్ని విపినాల నాలబలెఁ గపి
దండును గుంభకర్ణుండు గాల్చె

అటులు కపులు కొట్టఁబడి నాయకులులేక
యూథపులు పోవ నార్చిరి యుద్ధ భువిని
ఇంకఁ గుంభకర్ణుండు కొట్ట నెంతొ గ్రుక్కి
పొగులు మదిని రాముశరణు పొందినారు. 1103

వ. వానరులు పారిపోవుట చూచి వాలి పుత్రుఁడు కుంభకర్ణుని పైపు పరువిడి యొక శైలశృంగమును గ్రహించి గర్జించుచు కుంభకర్ణుని వెంట నంటియు రాక్షసుల నందఱను భయపెట్టు కుంభకర్ణుని శిరస్సుపైని విసిరెను అపుడా నెబ్బ తిని కుంభకర్ణుఁడు మహాక్రోధముతో నుండి వాలిపుత్రుని పైకి పరువిడి యెదుర్కొని యంగదునిపైని శూలమును విసిరెను. అట్లు తనమీదకు వచ్చుచున్న శూలమునుజూచి యంగదుఁడు హస్తలాఘవముచేఁ దప్పించుకొని యఱచేతితో కుంభకర్ణుని వక్షఃస్థలమును గొట్టుటయు దానివల్ల రాక్షసుఁడు మూర్ఛిలి కొంతవడికిఁ దేఱి గుప్పిటిని తిప్పి వామ హస్తముచేఁ గొట్టఁగా అతఁడు సంజ్ఞ లేక పడిపోయె. అట్లు కపిశార్దూలుఁడు పడఁగా శూలమును దీసి కొని సుగ్రీవు నెదుర్కొనియె. అప్పుడా వానరపతి సుగ్రీవుఁడు పైబడుచున్న కుంభకర్ణుని జూచి ఒక పర్వతాగ్రము నెత్తి వానిమీఁదఁబడ నంతఁ దనపైపుగా వచ్చుచున్న సుగ్రీవుని జూచి వికృతమైన సర్వాంగములతో వానరపతి మోమై యుండి వానరుల రక్తములతోఁ దడిసి వానరులఁ దినుచున్న కుంభకర్ణునితో సుగ్రీవుఁ డిట్లనియె. 1104

నీవు కపులను బడఁగొట్టి యెంతొ గొప్ప
పని యొనర్చితివి కపులఁ దినియు గొప్ప
కీర్తిఁ గొంటివి విడువు ప్రాకృతుల కపులఁ
గొను పనేమి, కాచుకొను నా కొండదెబ్బ. 1105

అను సుగ్రీవుని సత్త్వధైర్యయుత వాక్యాలించి క్రోధంబుతో
ననెదైత్యేంద్రుడు కుంభకర్ణుడిటు, నీవాబ్రహ్మపౌత్రుండ విం
కను నాబుక్ష రజస్సుతుండవును వీఁకన్ బౌరుషాఢ్యుండ సం
చును గర్జించెద వేలవానర! యటంచున్బల్కె సుగ్రీవుడున్. 1106

విని క్రూరాత్ముఁడు కుంభకర్ణు పలుకుల్ వేగంగఁ జెన్శృంగమున్
ఘన వృక్షంబున పైచికొట్ట నదిభగ్నంబౌటనా వానరుల్
వనటన్ దైత్యులు హర్షమున్ గనఁగఁ గోపావిష్టుడైపోయి మో
మును సుగ్రీవునిపైపు ద్రిప్పివయిచెన్ బో*శంపబోల్ శూలమున్. 1107

అటులాక్రూరుడు కుంభకర్ణుఁడును స్వర్ణాంచ న్మహాశూల మం
తట వేయన్ హనుమంతుఁడెచ్చి తన హస్తాగ్రాల దానిన్ హుటా
హుటి మోకాళ్ళనుబెట్టి వేవిఱువ నెంతోపొంగి యావానరో
ద్భట సైన్యంబును సింహనాదములు మోదంబారఁ గావించుచున్. 1108

హనుమంతున్ గడుమెచ్చఁజూచి వడిగా నాకుంభకర్ణుండు వెం
టనె లంకామలయాద్రి శృంగమును గూడన్బీకి సుగ్రీవు తో
మ్మున వేయన్ గపిరాజు సంజ్ఞవిడి యాభూమింబడన్ గాంచి యా
దనుజుల్ పొంగియు నార్వదైత్యుఁడును చేతన్బట్టె సుగ్రీవునిన్. 1110

జలదంబున్ బవనుండు వోలెఁదన హస్తాలన్ గడుంబట్టి క్రో
తుల రాజున్గొని కుంభకర్ణుఁడటులన్ దూర్ణంబ మేరూపముం
డెలమిం గైకొనిపోవ నూర్ధ్వశిఖరంబేపారు మేరుంబలెన్
వెలయన్మెచ్చి స్తుతింప దైత్యులమరుల్ వింతంగవన్ గన్పడెన్. 1111

---

* శంప = మెఱుపు.

వడి సుగ్రీవునిబట్టి తీసికొనిపోవన్, రాముతోపాటె యి
ప్పుడు నావానరసైన్యమెల్లను క్షయంబున్ జెందునంచెంచి దై
త్యుఁడటుల్ చేయఁగఁగాంచి మారుతియు నెంతో లోనఁ జింతించె ని
ప్పుడు సుగ్రీవుఁడు పట్టుకోఁబడనికన్ ముందేమి గావించెదన్. 1112

హృదికిన్ దోఁచినయట్లు చేతునిపుడే యాదైత్యునిన్ బర్వతో
న్మద రూపంబునుదాల్చి గుప్పిడుల గ్రుమ్మంగూలు దైత్యుండయీ
యదనన్ వానరరాజు ముక్తిఁగసఁగా నావానరుల్ పొంగిపో
రొందరే, పోని సురాసురోరగులు గానీ పట్టినన్ ముక్తుఁడౌ. 1113

ఖండనంబునఁ గుంభకర్ణుండు కొట్టి
నిప్పటికిని లేవండిప్పుడింక లేచి
అనిని నీక్షణంబున వానరాళికింక
తనకు హితమునుచేయు యత్నంబు చేయు. 1114

ఏనితని విడిపించుచో నితనికిపుడు
అప్రియమగు నపఖ్యాతియగు చిరంబు
కనుక నొక్కక్షణముచూతుఁ గపివిభుండు
విక్రమింప నోదార్చెద వెడలికపుల. 1115

అని యిట్టుల్ హనుమంతుఁడెంచి కపిసైన్యం బావఁగానింక లం
కను వేచొచ్చియుఁ గుంభకర్ణుడల ప్రాకారాలఁ జర్యాగృహం
బునఁ బల్గోపుర పంక్తులంగల జనంబుల్ పూలువర్షింపఁ ది
న్నని పేలాలును నీళ్ళుచల్లఁ జనెదానన్ లేచెన్ సుగ్రీవుడున్. 1116

అటనెట్లో స్మృతిగాంచి దారుణబలుండౌ దైత్యకౌగింట నుం
డుట వీక్షించియిటుల్ మదిందలఁచెనిట్టుల్ నన్ గడుబట్టుకో
నెటు లేకార్యము నేనుఁజేయఁ గలనేట్లీ వానరశ్రేణికిం
బటువౌ మంగళముల్ హితంబులను గూర్పంజేతు నంచెంచుచున్. 1117

భుజముల్ చాచుచుఁ గుంభకర్ణుని చెవుల్ ముక్కుల్ తదీయాంశముల్
నిజదంతంబుల గోళ్ళఁ బీకుచును నెంతే శ్రోత్రనాసా విహీ
నుఁ జటాల్నంబొనరింప మండి దనుజుండున్ రక్తసిక్తాంగుడై
భుజముష్టిం గపిరాజు నుర్విఁబడఁగాఁ బోదోసి మర్ధిందుచున్. 1118

అటు భూమింబడఁద్రోయ దైత్యులు కరంబట్లిట్లు గొట్టంగఁ దా
నెటో దప్పించుక మింటిపై కెగిరియే యేతెంచె నారాము ముం
దట, కింతం గడు గుంభకర్ణుఁడును శ్రోత్రఘ్రాణ శూన్యాంగుడై
యట రక్తంబులఁదడ్సి కాటుకల ప్రోగై సంజయుమబ్బై తగెన్. 1119

అటు సుగ్రీవుడుఁ బోవ నింద్రరిపువౌ నాకుంభకర్ణుండు ను
త్కట కోపంబున నాజికై మరలవేగన్ వీఁకఁ బర్వెత్తి యుం
తట నేయాయుధమేని లేదనుచుఁ జిత్తంబందు జింతించి ముం
దటఁ బెన్ముద్గరముంటఁ దీసికొని లంకన్వీడి పోరన్జనెన్. 1120

చనియోజస్వియు లంకబైల్వెడలి తత్సైన్యంబు గాలుండువల్
జనులంబోలెను వేగజొచ్చి స్వపరజ్ఞానంబు లేకుండ నో
జను రక్ష కపులెల్లు బంట్లను బిశాచాలన్నొకేతితోఁ
గాని నోటన్ వయిచున్ దినున్నొకని ముగ్గుర్నైకుక్క రన్నిర్వురన్. 1121

ఇరుపెన్ దౌడల నెత్తురు క్రొవ్వువశెనెఁతేఁ గాఱ దైత్యుఁడుతన్
వరవీరుల్ కపులెంత కొట్టి వడిగా వారించినన్ మానక
త్తతి నత్యాకటఁ జిక్కి మ్రింగుచును నత్యంతంబు భక్షింప వా
నరు లంతన్ హడలెత్తి రామునకుఁ జెంతన్ జేరి రాత్రిన్ గడున్. 1122

నగి యేడెన్మిది ముప్పదిర్వదగు వందల్ చొప్పునన్ గ్రోతులన్
బిగియం బట్టియె తించుఁ బర్వెడుచు శీవిన్ గుంభకర్ణుం డటుల్
తగ సంచారము చేయఁ సగ్గొని సుమిత్రాపుత్రుడౌ లక్ష్మణుం
డొగి క్రుద్ధుండయి యుద్ధమున్ జలిపె విల్లూనెన్ రిపుంజంపగా. 1123

ఇంక సౌమిత్రియు, గుంభకర్ణు మెయిపై నేడమ్ములన్ వేయు నం
తకె సౌమిత్రి నతిక్రమించి ధరబద్ధల్ చేయుచున్ రాము ముం
దుకె పోవన్ గని రాముఁ డంతటనె రుద్రుండౌచు రౌద్రాస్త్రమున్
ప్రకటంబై పడ గుంభకర్ణుని హృదిన్ పైచెన్ మహావేగుఁడై. 1124

అటులన్ రామునిచేతఁ గొట్టబడి తానా కుంభకర్ణుండు ముం
తటికిన్ బర్విడి నోటి నుండియు జ్వాలత్‌జ్వాలావళుల్ గ్రక్కుచున్
పటు కోపంబున వానరాళిని గడున్ బర్వెత్తగాఁ జేయుఁ ద
త్పటు బాణాల్ పడవక్ష మంచు గదచేతంజాటి క్రిందంబడెన్. 1125

భువి సర్వాయుధముల్‌చెలా చెదరులై పోవంగ నిశ్శస్త్రుఁడై
జవ మొప్పన్ దనకాళ్ళ గుప్పిడుల సంగ్రామమున్ వేగ గా
ప్ప విధానన్ బొనరించె నంత సితసౌబాణాలు సేనన్ బడన్
స్రవియింపన్ రుధిరాలు, కొండ సెలయేళ్ళంబోలె విభ్రాజిలెన్. 1126

అతనిన్ దారుణ కోపమున్ రుధిరమున్ వ్యాపింపఁగా వానర
ప్రతతిన్ దైత్యుల నెల్లబంటుల పడిన్ భక్షించి పర్వెత్తుచున్
అతి శూరుండయి కొండఁబోకి బలియుం డీరాముపైఁ జిమ్మఁగా
నత డేడా బుజుపైన పైడి పిడి బాణాగ్రాల గూల్చెన్ ద్రుటిన్. 1127

పరమజ్యోతిని మేరు శృంగమటులన్ భాసించి యున్నాఁడు వా
నరులన్ జంపఁగ వచ్చి పైబడు ఖలుండౌ కుంభకర్ణున్ గడున్
త్వరగా నమ్ముల రాముఁడేసి ధరఁ గూల్పన్ జూచి ధర్మాత్ముఁడౌ
వర సౌమిత్రియు గుంభకరున్ వధోపాయుంబిటుల్ వాకొనెన్. 1128

ఇతడోతాఁదిను వారు వానరులొగాకేదైత్యులో యేమియున్
మతిలోఁ గానక మత్తులోనఁ బడిపల్ మాంసాశనుండౌచు శో
ణిత గంధంబున స్వీయులం బరులనేనిం దించుఁ బర్వెత్తఁగా
యితనిన్ వానరు లెక్కి తొక్కుదురుగా కింకం దగన్ ముఖ్యులున్.

ఇటు లైనన్ ఖలుఁడీతడిప్పు డిఁక నెంతో భారతం గ్రుంగి మి
క్కుటమౌ కష్టముపొంది భూమి బడుచుం గూల్పంగఁ జాలండ యుం
తట నీవానరసేన నంచుననిఁ దద్వాక్యంబు లాలించి యుం
తట హర్షంబునఁ గుంభకర్ణు మెయిమీఁదన్ వ్రాలి రావానరుల్. 1130

త్రుటిలో నప్పుడు కుంభకర్ణు మెయి నారోహింపఁ గ్రోధంబుతో
పటు దుష్టేభము మావటీంద్ర బలె గూల్పన్ గాంచి యూతండువు
త్కట దుష్టుండని రాముఁ డుత్తమ ధనుష్కాండంబు చేబూని యు
ద్భటుఁడై కంట దహించువాఁడు వలెనై తామ్రాక్షుఁడై పర్విడెన్. 1131

వడిగా రాముఁడు పాముపంటి ధనువాస్ఫాలించి బాణంబు నె
క్కిడి యా వానరసంఘ మెల్లఁ బొగడన్ గేలన్ ధనుస్సొప్ప భీ
ముఁడు రక్తప్లుత సర్వగాత్రుఁడు ఘనాత్ముండున్ గిరీటాఢ్యుడున్
గడు క్రుద్ధుండగు గుంభకర్ణుఁ దునుమంగావేగఁ బర్వెత్తియున్. 1132

అల్గిన దిగ్గజంబటు వానరులను
దైత్యులతోపాటు తఱుము వాని
వింధ్య మందర నిభున్ వివిధ హైమాంగదు
వర్షాబ్దమటు నెత్రు వఱలు వాని
నాల్కతో నెత్తురు నాకి రక్తాక్షుఁడై
యముడటు కపులను నణఁచు వాని
మండు వహ్నిని బోలి యుండి మాటికిఁ గపులపై
వడి విజృంభించుచుఁ బడెడి వాని

అరసి పురుషర్షభుఁడు రాముఁ డపుడె విల్లు
నెక్కుపెట్టుచు నారి మ్రోగింప మిగులఁ
గుంభకర్ణుఁడు నైపక క్రుద్ధుఁ డగుచు
నింక రాముపై పుగఁ బాఱ యెదురుకొనియె. 1133

వడిగ గాలితఱుమ మీఁదఁబడెడి మబ్బు
వంటి కుంభకర్ణుండు సర్పాధిరాజు
వంటి బాహులతో మీఁదఁ బడఁగ రాఁగ
గాంచి గిరినిభుఁడౌ కుంభకర్ణుఁ బలికె. 1134

రమ్ము రాక్షసాధిప ! విచారంబు పడకు
ఇదిగో చాపంబుదాల్చి నే నెదుట నుంటి
ఇంద్రరిపు! నన్ను రాముఁగా నెఱుఁగు మోయి
క్షణములో నీవు విగతచేతనుఁడ వగుదు. 1135

ఇంకఁ గుంభకర్ణుఁడు రాముఁ డితఁడె యనుచు
అగ్గి కపులను దఱుముచు నంత సర్వ
వానరుల హృదయంబుల వడఁగ జేయు
వాఁడు వలె వికృతము నవ్వి పలికె రాము. 1136

నేనా విరాధ దైత్యుఁడఁ
గాను, కబంధుఁడను గాను ఖరుడంగానున్
కా నామారీచుఁడ నే
గా నావాలినిఁకఁ గుంభకర్ణుఁడ జుమ్మీ. 1137

ఇదిగో చూడుము ముద్గర
మిది ఘోరము కాలినుమువ నిది చేఁబడెన్
ఇది మున్ను దైవదైత్యులు
మొదలగు వారిని గెలిచె సమూలము గాఁగన్. 1138

నా ముక్కు చెవులు తెగెనని
యేమాత్రము నన్ను నింద యిడరాదు సుమీ
ఈ ముక్కు చెవులు పోవుట
నేమాత్రము నీకుబాధ యెటఁ గలుగదుగా. 1139

నీకుఁగల వీర్యమెదొ యి
క్ష్వాకువ్యాఘ్ర ! త్వరగఁగనఁ బఱపుము నాపై
నీకుఁ గల పౌరుషమ్ము వ
రాక్రమమునుజూచి నిన్ను రయముగఁ దిందున్. 1140

వ. అని యిట్లు కుంభకర్ణుఁడు చెప్పఁగా విని వజ్రసమ వేగము గల బాణములను రాముఁడు వేసికొట్టినను వాఁడుక్షోభింపలేదు. సాలతరువులను జీల్చి వాలినిజంపిన బాణములైనను అట యేమాత్రము కుంభకర్ణునికి వ్యథగూర్పవు ఆ మహేంద్ర శత్రువు కుంభకర్ణుఁడు వారిధారలను వలె ఆ బాణధారలను తన శరీరములోనె మ్రింగుచు రాముని శరవేగము కంటె నుగ్రవేగముకల ముద్గరమును రాముని మీఁదకు విసరివేసి కొట్టె. ఇదివరలో దేవ మహాసేనలను వరువెత్తించిన యా ముద్గర మవ్వాడు కపి సేనలను పరువెత్తించె. అపుడు రాముఁడు వాయవ్యాస్త్రమునువేసి ముద్గరమును దాల్చిన కుంభకర్ణుని బాహువును తెగఁగొట్టెను. అపుడు ఆ దైత్యుడు తుములముగా ఆర్చెను. అపు డట్లు తెగఁగొట్టఁబడిన గిరిశృంగము వంటి బాహువు కపిసైన్యమునఁ బడి కపిసేనను గొట్టెను. చావగా మిగిలిన వానరులు పార్శ్వములనుండి యంగము కదల యుద్ధము చేయుచున్న రామ కుంభకర్ణుల ద్వంద్వ యుద్ధమును జూచుచుండిరి. అంత కుంభకర్ణుఁడు ఒక చేతితో ఒక వృక్షమును బీకి రామునిపైకి పరువెత్తెను. అంత ఆ కుంభకర్ణుని సాల వృక్షములతోఁగూడి యెత్తఁబడిన పాము పడగవలె నున్న బాహువును రాముడు బంగారువర్ణములు గల యైంద్రాస్త్రము చేతఁ గొట్టెను. అపుడు ఆ బాహువు తెగి గిరివలెఁ దిరుగుచు చెట్లను పర్వతములను రాళ్ళను వానర రాక్షసులను గొట్టిపైచెను. బాహువులు తెగిపోవఁగా వెంటనే ఆర్చుచు వచ్చుచున్న ఆ కుంభకర్ణుని రెండు కాళ్ళను వాడియైన అర్ధచంద్ర బాణములచే ఛేదించెను. అప్పు డా కాళ్ళు దిశలను విదిశలను గిరులను గుహలను సముద్రమును లంకను కపి రాక్షస సేనను దద్దరిల్లఁజేయుచు బడబాగ్ని ముఖము వంటి ముఖమును తెరచి ఆకాశమున రాహువు చంద్రునివలె గర్జించు రామునిపైకు పరువెత్తెను. అపుడు రాముఁడు పైడిపిళ్ళు గలిగి వాడి

మైన బాణములచే వాని ముఖమును పూరింపఁగా వాని నోట మాట రాక కూయుచు మూర్ఛిల్లెను. అంత రాముఁడు సూర్య కిరణముల వంటి బ్రహ్మ దండము యముని కాలపాశము వంటి గాలివలె వేగముకల యైంద్రాస్త్రమును వజ్రమునువలె రాక్షసునిపై విసరెను. అది పదిదిక్కులను వెలిగించుచు పొగలు నిప్పులు చిమ్ముచు పెద్దకోరలు కదలు కుండలాలు గల మహాపర్వతమువంటి ఆకుంభకర్ణునిశిరస్సును తెగఁగొట్టెను. ఆశిరస్సు కుండలములతో రాత్రి యుదయించిన పునర్వసు నక్షత్రముల మధ్యను చంద్రుని వలె వెలిగెను. ఆ శిరస్సు క్రిందఁ బడుచు గోపురపుఁ బైభాగములను ప్రాకారమును పడఁగొట్టెను. ఆ కుంభకర్ణుడు క్రిందఁబడుచు నటు నిటు పరువెత్తు కోట్ల కోతులను పడఁగొట్టెను. వాని గొప్ప శరీరము సముద్రములో పడి మొసళ్ళను పెద్ద చేపలను పాములను నలిపివైచుచు భూమిలో చొచ్చెను. ఆ దేవ బ్రాహ్మణ శత్రుడైన కుంభకర్ణుఁడు పడి చావఁగా నీటిలోను నేలను తిరుగు జంతువులు దేవులును హర్ష ధ్వనులు చేసిరి. రామ పరాక్రమమునకు సుర నాగ మహర్షులు యక్షులు హర్షముతో ధ్వనులు చేసిరి. రాహు ముఖము నుండి విడి సూర్యుని వలె దేవ లోకములోని చీకటి పోగొట్టినట్లు రాముడు వానరుల మధ్య ప్రకాశించెను. 1141

హిత మిష్టంబును గూర్చు రాముఁ గనియెంతేఁ బొంగి యువ్వానరుల్
మతిఁ బూజింపఁగఁ గుంభకర్ణు సురలన్ మర్దించు వానిన్ వధిం
చి తగన్ వృత్రుని జంపి యింద్రుఁ డటులం జిత్తంబునన్ మోద మొం
ది తనర్చెన్ సుఖమొందె వానరులతో ధీయుక్తమిత్రాళితో. 1142

అనఘాత్ముండగు రాముచేత మరణంబా కుంభకర్ణుండు పొం
ద నిటుల్ దైత్యులు చూచి రావణునితోఁ దన్మృత్యు వృత్తాంతమె
ల్ల నివేదించిరి, రాజ! కాలసదృశుండౌ కుంభకర్ణుండ యిం
తసె కాలంబును కర్మనిండఁ గపిసేనం ద్రోలి భక్షించుచున్. 1143

క్షణ మాశత్రులఁ గూల్చి రాముని మహౌజఃస్ఫూర్తిచేఁ శాంతుఁడై
వనధిన్ మేను సగంబు కూల కరముల్ పాదాలు భిన్నంబు కాఁ
దల కంఠంబల లంక ద్వారమును నంతన్ మూసివేయుంగ న
గ్నిని దగ్ధద్రుమ మట్లు ముద్దగఁ బడుండెన్ నెత్తురుల్ గ్రక్కియున్. 1144

వ. అని యిట్లు కుంభకర్ణుని మరణ వార్తను విని రావణుండు శోక సంతప్త హృదయుండయి మూర్ఛిల్లి క్రిందఁబడెను. తమ పినతండ్రి చావును విని దేవాంతక నరాంతకులు రోదించిరి. త్రిశిరుంకును అతికాయుడును దుఃఖించిరి. ఎవరిని కషపెట్టని రామునిచే భ్రాత చంపఁబడుట వినిమహోదర మహాపార్శ్వలు శోకాక్రాంతులైరి ఎటులో కష్టముగాలేచి తేఱుకొని దీనుడయి రావణుఁ డీవిధముగ విలపించెను. 1145

అకటా! తమ్ముఁడ! కుంభకర్ణ! ఘనవీర్యా! శత్రుదర్పఘ్న! నీ
విఁకఁ గన్పించవ నన్ను వీడి చనినావే కాలువాసంబు, మా
మక శల్యంబును బంధుముల్లు పెకలింపంబోక విద్వేషిసే
నకు నాశంబును గూర్చ కొక్కఁడవ నన్వర్జించియుం బోతివే. 1146

నీకుడి భుజమ్మునిట నాశ్రయించి నేను
దేవదానవులకును భీతిలక యుందు
నట్టి నాకుడిభుజమిది యిట్టె పడియె
ఇంక నేనిప్పుడిట మరణించి నట్లె. 1147

దేవదానవ దర్పంబు పోవఁ ద్రోలు
నిట్టి కాలాగ్ని రుద్రుల యట్టి ఘనుఁడు
వీర్యమున సాటిలేనట్టి విదిత బలుఁడు
సంగరంబున రాముచేఁ జంపఁబడియె. 1148

వజ్రపుం దెబ్బతిని చీమ ప్రాకినట్లు
కూడఁదలఁప విట్టి కృతివికూడ నిపుడు.
రాము బాణంబులఁ దిని యోళఁ బరుంటి
వదిగొ దివి దేవులార్తురు హర్ష మొంది. 1149

ఇపుడె ధ్రువముగ వానరులెంతొ పొంగి
తటిని గని దుర్గమౌ లంక ద్వారములను
నెక్కెదరు కుంభకర్ణుండె యింకలేమి
రాజ్యమేల సీతతో నేమి బ్రమఁకిచేల. 1150

మున్న యపకారమును జేయు నన్నుఁ జూచి
దేవులిప్పుడు హసియింత్రు దివికి నీవు
పోవఁగాఁ గుంభకర్ణ! నేఁబోర నెట్లు
ఇంద్రు నెదిరించి యిపుడు జయింపఁ గలను. 1151

ఆవిభీషణుఁ డాడిన యట్టి పలుకు
నేఁడు నిజముగఁ బ్రాప్తింప నేను గంటి
నామహాత్ముని వాక్యంబు లపుడు నేను
నాదు నజ్ఞానమునఁ గైకొనంగలేదు. 1152

కుంభకర్ణ ప్రహస్తులు కూలినపుడు
క్షితి విభీషణు క్రూరోక్తి సిగ్గుపఱచె
వినుత ధర్మ శ్రీయుతు విభీషణుని గెంటి
పడితి నిటులంచు నేడ్చె రావణుఁడు పడిమె. 1153

అటు ఖలుఁడు రావణుండు శోకాభితప్తుఁ
డగుచు విలపింపఁగఁ ద్రిశిరు డనియె నిట్లు
ఇటులె మధ్యమ పిత మృత్యు వెనసెఁ గాదె
సుజను లొందరు నీవలె శోకమధిప. 1154

త్రిజగమునకును జాలెదు నిజము ప్రభువ !
ఏల జడుడట్లు నిను గూర్చి యేడ్తువిట్లు
బ్రహ్మయిడిన శక్తి కవచ బాణధనుసు
లభ్రనద సహస్ర ఖరాఢ్య మరద ముంటె. 1155

శస్త్రమును లేక గెల్తు వలుసార్లు సురల
రాము గెల్వవె సర్వశాస్త్రాలు గలిగి
హాయిగానుండు ప్రమాట్టు ! యనికిఁ బోదు
బాముల గరుడివలెఁ జంపివైతు నరుల. 1156

* నరకు హరివోలె వజ్రి శంబరునివోలె
నేను రణములో రాము వధించివైతు
అనుచు త్రిశిరుఁడు చెప్ప రావణుఁడు వినుచు
చావుమూడఁ దన్ గనెఁ బునర్జితునట్లు. 1157

ఆ నరాంతక, దేవాంత, కాతికాయు
లటులఁ ద్రిశిరుని వాక్యంబు లాలకించి
మిగుల నుత్సాహ మొప్పార మించి యెలమి
యుద్ధ మొనరింప వేగమే సిద్ధపడిరి. 1158

పిదప నేను నేననుచు గర్జించి మిగుల
రావణు సుతులు శక్ర విక్రములు ఘనులు
రాక్షసవరు లంతట నంతరిక్ష మేగి
యుద్ధసన్నద్ధులై రంత యుక్కు మిగిలి. 1159

* ఇక్కడ నరకుఁ డనఁగా సింహిక యందు విప్రచిత్తికి పుట్టిన వాతాపి మొదలగు వారిలో ఒకడు. వాల్మీకి రామాయణ రచనా కాలములోఁ బుట్టకపోవుట వలన కృష్ణునిచేతఁ జంపఁబడిన నరకుడని చెప్పరాదు.

అందఱు మాయానిపుణులె
అందఱు సురదర్పదమను లంద అజేయుల్
అందఱు బలసంపన్నులె
అందఱును మహాయశస్కు లందఱు వీరుల్. 1160

సుర కిన్నర గంధర్వులు
సురగులు వీరల నెపుడును నోడింపంగంజా
లర వీరెల్లరు విద్యల
నరసిన వారే వరముల నందినవారే. 1161

రవితుల్య తేజులును దా
నవ దర్ప ధ్వంసులును రణనిపుణులును శ
త్రు వినాశులగు సుతులను త
గి వెలిఁగె రావణుఁడు సురలందగి మహేంద్రుఁ డటుల్. 1162

సుతులన్ గౌఁగిటఁ గ్రుచ్చి భూషణములన్ శోభిల్లఁగాఁ జేసి ప్ర
స్తుతులన్ దీవెనలిచ్చి రావణుఁడు తోడ్తో నాజికింబంపి త
త్పుత్ర రక్షార్థము తోడి భ్రాతలను యుద్ధోన్మత్తు మత్తున్ సువి
శ్రుతులన్ బంపగ వారు ప్రమొక్కి వలగొంచున్ బోయి రుద్గాత్ములై. 1162

మఱి దేవాంతకుఁడున్ నరాంతకుఁ డహంభావంబుతోడన్ గరం
బతికాయు త్రిశిరో మహోదర మహాపార్శ్వుల్ వడిన్రాఁగఁ బ్రో
ద్గతులై యార్తురు ధూప గంధముల సింగారించుకొంచున్ రణో
ద్ధతి బైల్దేరిరి రాము సేన దరికిన్ తన్మృత్యు సంప్రేరణన్. 1164

ప్రథితై రావణ వంశమం దొదవి నీలాభ్రంబగా నామీఱి, యా
యుధముల్ దాలిచి తూణులుం గలిగి యెంతో శీఘ్రమై మించి యు
న్మదమై యొప్పు సుదర్శనాఖ్యమగు పెన్ మాతంగ ముఖ్యంబు తా
నధిరోహించి మహోదరుం డదిగో నస్తార్కుం డటుల్ మీఱెడున్. 1165

ప్రథితాశ్వంబులు లాగుచుండఁ దగి సర్వంబైన నానావిధా
యుధముల్ మీఱ దశాస్యసూతి త్రిశిరుం డుద్యద్ధనుష్పాని తే
రధిరోహించి నగాగ్రమందు మెఱపుల్కాకుల్ విరాజిల్లు నిం
ద్ర ధనుస్సొప్పిన కాఱుమబ్బు కరణిం భ్రాజిల్లె సోత్సాహియై. 1166

అతఁడా స్యందనమందు మూఁడు మణిరమ్యంబౌ కిరీటాల మూ
డుతలల్ మీఱ త్రిహైమశృంగ తుహినాద్యోర్వీధ్ర మట్లొప్పె నా
దితిజాధీశ్వరు పుత్రుఁ డుగ్రుడు మహాతేజస్వి విల్కాండ్ర రా
జతికాయుండును వేగయుక్తరథరాజారూఢుఁ డౌచుం జనెన్. 1167

ఉరుచక్రా లిరుసుల్ సుదారునకుఁ గిందున్నట్టి షెన్ కోడు నా
వరమౌ కాడియు విల్లు నంబులమొదల్ ప్రాసాలు ఖడ్గంబులున్
పరిఘల్ దాల్చిన యా రథంబుపయి జాళ్వామెల్ కిరీటంబుతో
వరభూషల్ తగ నాతఁడొప్పె రవిభాస్వన్మేరుశైలంబటుల్. 1168

సురలతోఁ గూడిన సురరాజువోలె రా
క్షసులతో కతు నతికాయుఁ డొప్పె
ఉచ్చైశ్శ్రవ ఉదశ్వ ముల్కాళ శక్తితో
శిఖి గుహుడటు నరాంతకుఁడె యెక్కె
వజ్రాభ్య పరిఘ దేవాంతకుఁడు ధరించి
గిరిధర వారివోలె మెఱసి మించె
బహుళకాయుడు మహాపార్శ్వుఁడు గదఁబూని
గదఁ దాల్చిన కుబేరుకరణి హెచ్చె

సురగణ మమరావతినుండి కరణి నపుడె
యురుబలులు దైత్యులును లంకనుండి వెడలి
గజ హయావళితోడుత ఘన నినాద
మార రథములతో బైలుదేఱినారు. 1169

అటులా రావణపుత్త్రు లుద్భటులు సూర్యార్చిష్కులేపారి నం
తట శ్రీలొప్పఁ గిరీటశీర్షులయి మింటన్ బల్గ్రహాలట్టు లు
త్కటులై ఖాసిల వారుపైకొనిన శస్త్రాస్త్రాలు ఖాసిల్లె మి
క్కుటమై మింటను శారదాభ్రము మెఱుంగుల్ మీఱు హంసల్ వలెన్. 1170

మరణంబో రిపుమారణంబొ వరియింపంబోదు మాపోరిలో
మరలంబోమని బీరముల్ పలుకుచున్ బల్ వీరులై యాత్త్రి వల్
శరముల్ పైతురు మిన్నుగర్జనల నాచ్ఛాదింత్రు కంపింతురున్
బరిలోచేతురు సింహనాదములు జబ్బల్ చర్చి వీత్తుర్ దివిన్. 1171

అసురుల్ పొంగుచు పైఁబడేటి కపిసైన్యంబుల్ శిలల్ శృంగముల్
వెసఁ బైకెత్తియు నిల్చియుండఁ గనిరావీరుల్ కపుల్ గూడ సా
ధ్వస మొప్పన్ హయవారణాలు రథముల్ ధ్వానంబులన్ జేయ నా
కస మెల్లన్ వరకింకిణీధ్వనులు మ్రోగంగాంచి రచ్చోటనే. 1172

వెను కార్ముబ్బునుబోలి, యాయుధములన్ వేహాల్చు దీప్తానలా
రుణ తేజస్కులు రాక్షసుల్ మిగులపోరుల్ సల్ప నాయుత్తులై
మును ముందుండుటఁ జూచి యాప్లవగులుం భూమీధరంబుల్ తరుల్
గొని గర్జింప సహింపకే సలిపిరుగ్రోరు ధ్వనుల్ దైత్యులున్. 1173

అవలన్ వానరముఖ్యులా సురసైన్యంబుం బ్రవేశించి యా
హవముం జేయు మహాద్రులెత్తి శిఖరాఢ్యంబైన శైలాలటుల్
విపులం బర్విడ కొందరాకసము భూమింగొంద రొక్కండ్రు సై
న్య విభాగంబులఁ జూచి వృక్షములఁ గొండల్దాల్చి రయ్యాజిలో. 1174

అపుడా యుద్ధము దైత్యవానరుల కత్యంతోగ్రమై సాగెఁ బా
దపముల్ శైలములం ధరియించి మి[illegible]ం వద్వానరుల్కర్చి యా
విపులాస్త్రంబు లవార్యమాణ లగుచుం భీమంబులౌ విక్రమా
లపురూపంబుగఁ జూపిర త్తటిని నయ్యాజి న్నిశాటాళికిన్. 1175

అనిలోఁజేసిరి సింహనాదములు పెక్కావానరుల్ రాక్షసుల్
ఘనులౌ దైత్యుల జాళ్ళతోఁగపులు వేగం బిండిగాఁజేసి వెం
జనె చాఁగొట్టిరి నాజి హస్తిగతులంగానీ, సువర్ణాది భూ
షణులంగాని రథస్థులేయయిన రక్షస్సూరులం గానియున్. 1176

గిరిశృంగంబుల ముష్టిఘాతములచేఁ గేల్ పండ్లు కండ్లూడినన్
సరె దైత్యుల్ చరియింత్రు కూలుదురు గర్జాధ్వానముల్ బిట్టు చే
తురు తీక్ష్ణాస్త్రములన్ శరంబులనుసై తుర్ ప్రాసముల్ శక్తి ము
ద్గర శూలంబులచేఁ గపిద్విపములన్ దట్టించుచుం జంపుదుర్. 1177

ఒకరొక్కండ్రు పరస్పరంబును జయంబొందన్ విజృంభించి సై
నికులౌవానరరాక్షసుల్ తనువులం నెత్రోడఁగాఁ గూలి జీ
రికిఁ గైకోకయె పోరనంత సమరోర్వి రంగ మెల్లన్ని శా
టకపుల్ వైచిన రాళ్ళ బాణముల ఖడ్గాలన్ త్రుటిన్ నిండెఁగా. 11,8

విసరంగాఁబడి యందుఁ జెల్లచెదరౌ పెద్దైలఖడ్గాల రా
క్షసయోధాపళితోడ సంగర మదుగ్రాకార కేశాళితో
* అసఖధ్వంసులతోడ సర్వధరయున్ వ్యాపించె, నిండెం గపులు
భృశముం జిమ్మినఁ జిమ్మఁగూలు దితిజాళిం భగ్నశూలాలతో. 1179

అంగములతోడ నంగములడతు రనిని
కపులతోడఁ గపులను రాక్షసులు గూల్తు
రాక్షసులతోఁ గపులుకూల్తు రాక్షసులను
ఏమిలేనిచో గుప్పిళ్ళతో మధింత్రు. 1180

* అసఖులు=అమిత్రులు, శత్రులు.

కపుల కరశిలల్‌లాగి రాక్షసులు కూల్చి
రాక్షసుల శస్త్రముల్ కపుల్ లాగికూల్చి
ఒకరొకరు శైలశూలాలునూడ్చికూల్చి
దైత్యవానరులు సింహనాదము లొసర్చి. 1181

తనువు కాపాడు కవచముల్ తునకలుగను
సలిపి కపులు చంపిరట రాక్షసుల మిగుల
రక్తములు కాల్వలౌచుఁ బాఱంగ నపుడు
రాక్షసులు సైరి జిగురోడు వృక్షములటు. 1182

తురగంబుచేతఁ దురగము
నరదముచేతను నరదము నటులే యింకన్
కరిచేఁ గరిఁ గూల్చిరి కొం
దఱు వానరురాజి యందు దర్పముతోడన్. 1183

అందఱు కపులు హృష్టాంత రంగులగుచు
మనసు ఱాయి చేసికొని కొమ్మలఁ దనర్చు
చెట్లతో రాక్షసుల బాదిరిట్లు దైత్య
వానరులకు ఘోరరణ ముత్పన్న మయ్యె. 1184

వాడి యర్ధ చంద్రాస్త్రాల భల్లములను
ఖర శరంబులచేత నీకపులు వేయు
పాదపంబుల శిలలను త్వరిత గతిని
మించి రాక్షసులు కడు ఛేదించినారు. 1185

వ. చిమ్మఁబడిన శృంగములతోడను తెగిన చెట్లతోడను చనిపోయిన కపిరాక్షసులతోడను యుద్ధభూమి దుర్గమమాయెను. అంత వానరులుగర్వించి హర్షించిన చేష్టలు గలవారై భయము లేకుండ యుద్ధభూమి చేరి చేవసత్త్వము గలిగి నానాయుధములతో రాక్షసులతో పోరిరి. ఆతుముల యుద్ధము జరుగు

చుండ వానరులు పొంగి పోవుచుండ రాక్షసులు పడుచుండ ఋషులు, దేవతలు వాదములు చేసిరి. అంత వాయుసమాన వేగము గల గుఱ్ఱమెక్కి నిశితమైన శక్తిని గ్రహించి మహాసముద్రమును మహామత్స్యమువలె వానరసైన్యమును నరాంతకుండు ప్రవేశించెను. వాఁడు వాడియైన ప్రాసముతో ఏడుపందలమంది వానరులను భేదించి యొక్క క్షణములోనె హరిపుంగవుల సైన్యమును కొట్టెను. గుఱ్ఱపు వీపుననున్న ఆమహాకాయుఁడైన నరాంతకుడు వానరసైన్యమున విహరించుచుండ విద్యాధర మహర్షులుజూచిరి. పర్వతముల వంటి పడిన వానరులతోఁ గూడిన మార్గము మాంసరక్తములతో బురదమైపోయెను. వానర శ్రేష్ఠులు విక్రమింప బుద్ధి పుట్టులోపలనే నరాంతకుఁడు వారి నతిక్రమించి భేదించెను. అతఁడు వనములను దావాగ్నివలె మండుచున్న ప్రాసముతో కపి సైన్యములను దగుల(ఁ)బెట్టెను. వానరులు చెట్లను కొండలను పెల్లగించు లోపలనే వజ్రముచేతఁ దెగఁగొట్టబడిన కొండలవలె పడిపోయిరి. వర్షాకాలమున వాయువు వలె అన్నిటిని మర్దించుచు సర్వదిక్కులందు నరాంతకుఁడు సంచరించెను. అంత. 1186

ఇఁకఁబై కొంచును నిల్పుచున్ జనుచు నెంతేమించు సుగ్రీవున్ నరాం
తకుఁబైకొంటకుఁగాని నిల్పుటకు సైనస్కాల్ కదల్పు కొం
టకుఁ గానీ కపులేమి చాలకయె యుంటన్ దైత్యుఁ డవ్వారి సం
తకునింబోలె రవింబలెన్ వెలుఁగు తత్ప్రాసానఁ గూల్చెన్ వడిన్. 1187

వడి వజ్రాహతిఁబోలు ప్రాసహతి నైవస్ లేక యవ్వానరుల్
కడు ధ్వానంబులు చేసి యార్చిరి ప్లవంగాళు ల్వడింగూలి యు
క్కడ వజ్రంబునఁ గూలు శైలముల శృంగాలైరి, యాకుంభక
ర్ణుడుమున్ గొట్టఁగఁ గూలి స్వప్నమగుదండు ల్చేరె సుగ్రీవునిన్. 1188

అటు సుగ్రీవుఁడు దండుచేరఁ గని యిట్టట్టుల్ కడుంబాటి ముం
దట నాక్రూర నరాంత కార్తమగు సేనల్ చూచి, యూటెన్ హుటా
హుటిఁ జేఁదాల్చి నరాంతకుండును బలం బొప్పన్ హయారూఢుడై
యట కేతీరగఁ జూచి యంగదునితో నావానరేశుండనెన్. 1189

ఇదిగో నిచ్చట గుజ్జమెక్కి పయ్యెదైకే తెంచి యూనానరో
న్మద సైన్యంబుల క్షోభపెట్టి దితిజ ప్రాణంబులన్ దీయు మీ
పద యో యంగద ! యంచు బల్క జలదాభానీకమందుండి యం
గదుండున్ మేఘము నుండి సూర్యుడట్లు లుగ్రాకారుడై పైబడెన్. 1190

గిరిసంఘాతము వంటి యంగదుడు కెంగేలం గదాఢ్యంబనైు
వలలం ధాతు విచిత్రశైలము వలెం భాసిల్ల శస్త్రాస్త్రముల్
కరవాలంబును లేకయున్ స్వనఖ దంతాద్యాయుధుండై భయం
కరుడై యంత నరాంతకుం దరిసి వక్కాణించె నీరీతిగన్. 1191

ఒరె ! ఓరీ ! నిలు నిల్వుమీ కపులతో యుద్ధంబు నీకేమి యి
త్తరిం గావింతువు ప్రజతుల్యమగు నేత్రబ్బాస మీనాడు ను
ద్ధరవక్షంబున నేయు చూతమన దైత్యుండంత కోపించి యే
డ్తెల యోష్ఠంబునం బండ్లనొక్కి మహ యట్లీయార్చి రౌద్రాకృతిన్.
1192

అలుకంబూని నరాంతకుండు వడిగా నా యీటెతో నంగదుం
బెలుచన్ వక్షముపైన గొట్ట నదియు న్వేగంబ వజ్రాభ ని
శ్చల వక్షంబునంగూలి భగ్నమగుచుం క్ష్మామండలిన్ గూల ను
జ్జ్వల పక్షీంద్ర నికృత్త భోగిసమ హస్తంబెత్తి శీఘ్రంబుగన్. 1193

ఘన వాజిం దలపైనికొట్ట నది వేగం దౌడలున్ లోతుకుం
జనం గన్గుడ్లులు చిట్ల నాల్క వెలికిన్‌సాచన్ శీఘ్రమున్ వ్రీలి నే
లను గూలంగ నరాంతకుండు పశు గుజ్జంబున్ విలోకించి క్రో
న్నునం గ్రుద్ధుండయి వాలిపుత్రు తలపైనం గొట్టె పెన్ గుప్పిటన్. 1194

అపుడా గుప్పిడి దెబ్బకుం దలను గాయంబై కడు న్నెత్తురు కా
రిపడన్ వాలి సుతుండు మూర్ఛిలియు నోలిండేటి కోపించి దై
త్యు ప్రభావంబువకున్ వెలంగుచడి వజ్రోద్ఘాతముం బోలు ము
ష్టి పటన్పైచి నరాంతకోరమున వేసెం దెబ్బ పెల్లుబ్బునన్. 1195

అట నా దెబ్బకు గుండె వ్రీలిపడ రక్తార్ద్రాంగుఁడై స్రుక్కుచున్
త్రుటిలో సోలి నరాంతకుం డశనిచేఁ దూర్ణంబుగాఁ గూలు న
ట్కట శైలంబటు నేలఁ గూలిపడ నాకాశంబునం దేవు లి
చ్చట నీ వానరులుం బ్రహర్షమున ఘోషల్ చేసి రత్యంతమున్. 1196

ఇటు లాశ్చర్యకరంబు దుష్కరముగా నెంతే విజృంభించు న
ట్కటవీరున్ ఘనునంగదుం గనియు స్వాంతంబంచు రాముండు సం
తట మోదంబుగనన్ నరాంతకుని యంతంబున్ విలోకించి పి
మ్మట చింతించి మహోదర త్రిశిరు లాక్రందించి రార్తిన్ గడున్. 1197

అపుడు గ్రుండు మహోదరుండు ఘనతుల్యంబైన యేన్గెక్కి యా
కపి వీరాగ్ర్యుని నంగదుంగని మహోగ్రాకార దేవాంతకుం
డపమృత్యుంగను భ్రాతృపుత్త్రుఁగని శోకానన్ గడున్ స్రుక్కి యు
గ్రపు రోషంబునఁ బైకొనెన్ పరిఘ వేగంబూని యా యంగదున్. 1198

రవియ ట్లుజ్జ్వలమై మహాశ్వములతో రాజిల్లు తేరెక్కి వీ
ర వరుండౌ త్రిశిరుండుకూడ సమరాగ్రంబందుఁ బైఁ పైఁ బడన్
అవలోకించి త్రిరాక్షసావృతుఁడెయౌ నయ్యంగదుం డంతటన్
పవిచే నింద్రుఁడువోలె భీకి తరువా పైఁగొట్టె దేవాంతకున్. 1199

త్రిశిరుండున్ భుజగాలవంటి శరముల్ వేగన్ బ్రయోగించుచున్
గుశలత్వంబున నా ద్రుమంబును బడన్ గూల్చంగ నయ్యంగదుం
డు శుభాంగుండిదిచూచి పై కెగిరి చెట్లన్ కొండలన్ జిమ్మ నా
త్రిశిరుండల్గియు వాడిబాణములఁ ఛేదించెన్ వడిన్ వానినిన్. 1200

మఱి దేవాంతకుఁడున్ వెసన్ పరిఘ సంబాళించి వేగంబుగన్
దరులన్ గూల్చెను వీరు నంగదుని మేసన్ బాణవర్షంబులన్
గురిపించెన్ త్రిశిరుండు గూడను నెదుర్కొ మీఱి యా యంగదున్
శిరిపై వచ్చి మహోదరుం డశని తీక్ష్ణాస్త్రాలఁ గొట్టెన్ వడిన్. 1201

ఇటులన్ రాక్షసముఖ్యు లీమువురు తామేకంబుగా వచ్చి యు
ద్భటులై పైఁబడి కొట్టినప్పటికి నా వర్చస్వియౌ నంగదుం
డెటులున్ బాధను పొందకుండ సరచే యేపారఁగానెత్తి యు
త్కటమౌనా కరిఁగొట్టి దాని కనుబంతన్ ద్రీల నాశ్చెన్ గడున్. 1202

కరి దంతంబును లాగి యంగదుఁడు సంగ్రామాన దేవాంతకున్
త్వరగాఁ గొట్టఁగ వాఁడు విహ్వలిత సర్వాంగుండ యైపోయి లా
క్షరసంబ ట్లిఱపైన నెత్తురులు వక్త్రింబందుఁ గాఱంగ వం
దురియా పైనెటొ తేటివే పరిఘుఁ దోడ్తోఁ గొట్టి వన్యంగదున్. 1203

పరిఘాఘాతముఁ దించు జానువులపై పై ళంబు తాఁగూలి వా
నర వర్యుండట మళ్ళి లేవఁ ద్రిశిరుం డంతన్ శితాస్త్రాలు వా
నర శార్దూలు లలాటమందుఁ గురిసెన్ దద్రీతిగా నంత ము
వ్వురు చుట్టన్గని నీలుఁడున్ హనుమయున్ ముందేగిరచ్చోటికిన్. 1204

వ. అట్లు పోయి నీలుఁడు త్రిశిరుని మీద శైలాగ్రమును వేయ దానిని ధీమంతు డయిన యా రావణపుత్రుఁడు వాడి బాణములచే భేదింపఁగా అది నూఱుముక్క లయి శిలలుగా చీలి సెఱసులు జ్వాలలు గ్రక్కుచు నేలపయిఁ గూలెను. అట్లు ఆ శైలాగ్రము కూలఁగాజూచి హర్షముతో దేవాంతకుడు పరిఘను తీసికొని హనుమంతునిపైపు పరుగిడెను. అట్లు పర్విడి వచ్చుచున్న దేవాంతకునిజూచి యెగిరి వజ్రమువంటి ముష్టితోఁ దలపైని గ్రుమ్మెను అంత హనుమగ్రుమ్మి రాక్షసులను పరువెత్తించె. అప్పుడా ముష్టి దెబ్బతో శిరస్సువగిలి దంతములూడి కన్నులు నాలుకయు వెలికిపడఁగా రాక్షసరాజు కుమారుడు దేవాంతకుడు ప్రాణములు పోవనేలగూలె. 1205

సురవిద్వేషియు యోధముఖ్యుడు శూరుండు దేవాంతకుం
డు రణంబందు మృతిం గనంగఁ ద్రిశిరుండున్ నీలు వృక్షంబునన్
శరవృష్టిం గురిసెన్ మహోదరుడిఁకన్ శైలేంద్రముంబోలు కుం
జరమున్ సూర్యుఁడు మందరాద్రినట రోషం బొప్పఁగా నెక్కియున్.
1206

మెఱు పాయింద్ర ధనుస్సు గల్గ, జలమున్ మేఘంబు కొండం బలెన్
శరవర్షంబులు నీలు రొమ్మువయి హెచ్చం గుర్సి గాత్రంబు లు
క్కఱ మూర్ఛిల్లఁగ జేయఁ గొంతవడి సంజ్ఞం బొంది నీలుండువల్
తరువుల్ వేసి మహోదరున్ శిరముపై దట్టించి గొట్టం బడన్. 1207

అటు గొట్టంగ, మహోదరుండు ఘనవజ్రాఘాత ముందిన్న యు
త్కట శైలంబటు మత్త వారణముతో ధాత్రీతలిం గూలి యుం
తట, బాణంబులు వీడి చావఁ ద్రిశిరుండంతం బితృవ్యుండు చ
చ్చుట వీక్షించి ధనుస్సు గైకొని మరుత్పూతిన గ్రుధం గొట్టగా. 1208

హనుమంతుండిఁకఁ గోపగించి గిరి శృంగాగ్రంబు వేయుంగ దా
నిని తీవ్రంబగు బాణపంక్తిఁ ద్రిశిరుం డేపారభేదింపనా
ఘన శైలాగ్రము వ్యర్థమౌటఁ గని వృక్షశ్రేణులన్ గుర్సెన్ వా
నిని గూడన్ త్రిశిరుండు బాణముల ఖండించెం గరం బాఱిచెన్. 1209

హనుమంతుండటఁ బైకి గంతిడుచు సింహం బేన్గునుం బోలె గో
ళ్ళను గోళ్ళన్ త్రిశిరో హయంబుల జీల్చం, గాలుఁడుం గాల రా
త్రిని బోలెన్ త్రిశిరుండు తీవ్రమగు శక్తిం గొంచు వాయు సూ
తిని గొట్టన్ దివినుల్క వోలె నుడు శక్తికిన్ విర్చెనా హన్మయున్.
1210

అటు శక్తిన్ హన్మయు విఱిచి యార్చన్ విలోకించి య
తట నావానరులుం బయోదములటుల్ ధ్వానంబులం జేయగన్
దిట వౌమారుతి రొమ్ముపైఁ ద్రిశిరుఁడెంతేఁ గొట్టిఁ బి
మ్మట నార్చన్ త్రిశిరుండు కొట్టె హనుమన్ హుమ్ముంచుఁబెం గుప్పిటన్.
1211

వడిఁ బెన్గుప్పిటఁ గొట్టి నాహనుమ కోపంబెచ్చి పైకొంచు న
ప్పుడె యాదైత్యు కిరీటకుండల శిరంబుల్ మూఁడు పూర్వంబు శ
క్రుడు నాత్వాష్ట్రుని శీర్షముల్ వలె భువిం గూలంగ ఛేదింప, న
క్కడ రాలెం దివి నుండి తారకలటులం గ్రావాగ్ని తుల్యాంగముల్. 1222

అటు మహోదర త్రిశిరులు నానరాంత
కుండు దేవాంతకుఁడు భువిం గూలి చావ
అతిగఁ గోధముతో మత్తుఁ డనెడి ప్రముఖ
దైత్యుఁ డప్పుడు ప్లవగ బృందముల నెదిరె. 1223

అతిగా సర్వము నిమ్నతో రచితమై హైమంపు బట్టాన నా
వృతమై శత్రుల మాంసరక్తముల యాఫేనంబులం గ్రక్కుచు
త్పత దైరావత సార్వభౌమ సుమహా పద్మాది మాతంగ సం
తతి భీతి ప్రదమౌగపం గపుం నంతందోలెఁ గాలాగ్నియై. 1224

వ. అంత వానర ఋషభుండగు హనుమంతుడు రావణుని తమ్ముఁడైన మత్తానీకుండనబడు మహాపార్శ్వుని నెదుర్కొని వాని యెదుట నిలంబడి పర్వతము వంటి వానశ్రేష్ఠుని గనుఁగొని వజ్ర కల్పమగు గదతో వక్షమున గొట్టె. అంత నతఁడు వక్షము పగుల రక్తము కాఱుచుమూర్ఛిలి చాలకాలమునకు స్మృతి గనియామహాబలుఁడగుమహాపార్శ్వునిగదనులాగుకొని యామత్తానీకునిగొట్టఁగా వజ్రాఘాతమగు కొండవలెనతఁడుకూలి వానికంఠ్లుచిట్లి శక్తిపోగా ఆయువు మూడి చనిపోఁగా ఆమహాపార్శ్వుఁడు పడిపోఁగా చూచి రాక్షసబలమంతయుఁ బాఱెను అంత రావణుని తమ్ముఁడు చనిపోఁగా సముద్రము వంటి యాబలము అయుధములు విడిచి చెదరిపాతి సముద్రమువలె పోయి తమ జీవితములను గాపాడుకొనుటకయి పరువుదీసె. 1225

అతి తేజుండును బ్రహ్మదత్తవరుఁ డస్త్ర్యాభుండు దేవాసురో
ద్ధతి నాశుండతి కాయుఁడాతుముల మత్యంతం బొడల్ జల్లనన్
అతిగాఁ బుల్కలు గూర్చు సేన చెడ నింద్రాభుల్ కడున్ బ్రాతలా
హుతికాఁగన్ స్వపితృవ్య మత్తులు యుద్ధోన్మత్తుడున్ జాఁచగన్. 1216

కనులారం గని క్రుద్ధుఁడై దశశతార్కజ్యోతులం జిమ్ము స్యం
దన మారోహణ చేసి శక్ర రిపువంతన్ వానర త్రాసమున్
జనియింపం ధనువెక్కుపెట్టి చెవులన్ స్వర్ణపుం పత్కుండలా
లును శీర్షాన, గిరీట మొప్పఁదన పేరుం జెప్పి చేసెన్ ధ్వనుల్. 1217

అటులన్ పేరున సింహనాదములు భీమాకారమౌ వింటి యు
త్కట టంకారముచేసి వానరులకున్ త్రాసంబు గూర్చన్ తను
ద్భటదేహ మహత్త్వముంగని మఱిన్ దత్కుంభకర్ణుండె యు
చ్చటకున్ లేచియు వచ్చెనో యని భయంబై చేరి రన్యోన్యమున్. 1218

మునుపున్ విష్ణుని యా త్రివిక్రమమటుల్ నుండట్టి తద్రూపమున్
గని యావానరు లార్తులై యిటునటున్ బర్వెత్తి మూర్ఛాత్ములై
ఘనుఁడౌ రాము శరణ్యునిన్ శరణుఁగా గగ్గొంచు జేరంగఁ స్యం
దనమం డాయతికాయు రాముడరసెన్ గాలాభ్రగర్జద్రయున్. 1219

మఱి రాము డతికాయుని
నరసి భయంపడి పరువిడు నావానరులన్
అరసియు, వారికి ధైర్యము
గఱపె విభీషణుని నంతఁ గనుగొని పలికెన్. 1220

గిరిఁబోలి, విలుపూని పంచాస్య నేత్రుడై
శత దశాశ్వరథస్థుఁ డితఁ డెవండు
భూతాల హరుడట ముసల శూల ప్రాస
తతిచేత నావృతుఁ డితఁ డెవండు

మెఱపులన్ మబ్బటుల్ మృత్యు జిహ్వాదీ
శిత శక్తులన్ వృతుఁ డితఁ డెవండుష్ట

ఇంద్రువిల్ నభమటు, లెక్కెడు పైఁడి విం
డ్లను రథం బలరించు ఘనుఁ డెవండు

అర్క తేజాప్పు రథముతో నాజితలిని
నెగిరి వచ్చు రథికద్వైత్యు డితఁ డెవండు
రాహువు పతాకగఁ గలిగి రవి కరాభ
బాణముల దిశలందగు నీ ప్రముఖుఁ డెవఁడు. 1221

మూడుచోటుల వంగి పైఁడిద్దై యింద్ర ధ
నుసటులౌ ధనుసూను నసుర యెవఁడొ

ధ్వజ పతాకలుఁ గిందిదారు వొప్పారథ ము
ఱుమంజతు స్సారధి ప్రముఖుఁ డెవడొ

ముప్పదెన్మిది యంపపొదులు భీమ ధనుసుల్
పసిడి నారులతేజ ప్రథితుఁ డెవఁడొ

నలుబారల పిడులు న్బదిబార్ల పొడ వున్న
కత్తులు ప్రేల్‌తేరి ఘనుఁ డెవండొ

ఎఱుపు పూదండ కాలుని కరణి మొగము
కొండఁబోలు మెండగు మేను కూడియుండ
మబ్బుపయి భాస్కరుండటు మసలుచున్న
యీ మహావీరుఁ డెవ్వఁడొ యెఱుగఁ జెప్పు. 1222

ఇతఁడో బంగరు టంగదంబుల భుజాలేపారగానొప్పి యు
ద్గత శృంగంబులు రెండుమీఱు హిమవత్శైలంబునుంబోలు దీ
పిత నేత్రంబులుగల్గి కుండలములం బెంపారు నేతన్ముఖం
బతిగా మీఱుఁ బునర్వసుల్ నడిమిదౌ నాచంద్రబింబం బటుల్. 1223

ఇతఁ డెవ్వండో మహాభుజా ! తెలుపుమీ యాదైత్యునిం జూచియే
యతిభీతిన్ గపులెల్లఁ బర్విడుచు నందం దేగుచున్నారుగా
ఇతనిం తెల్పుమటంచు రాముఁ డనగా నీ రీతిగా నప్పుడా
యతికాయుం గని యా విభీషణుఁడు నొయ్యంజెప్పె నారామునితో. 1263

ఘనతేజుండు కుబేరు భ్రాత భయకృత్కర్ముండు నోత్సాహి రా
వణు పుత్రుం డతికాయుడీఘనుఁడు సర్వాస్త్రజ్ఞుఁ డోజస్వి రా
వణతుల్యుండును వృద్ధ సేవియయి యొప్పారున్ మహా ర్యుఁడై
యనయంబున్ శ్రుతిధారియౌ నతని కశ్వాల నేర్పొప్పెడిన్. 1264

వ. మఱియు నతండు మత్త వారణముల నడపుటలో ఖడ్గప్రహారములో ధనురాస్ఫాలనములోను సామదాన భేద దండనయ మంత్రములలో నేర్పరి. అతని బాహుబలము మీదనే లంకావాసము నిర్భయమై యున్నది. అతఁడు ధాన్యమాలి కొడుకు. అతికాయుఁడు. ఇతనిచే నారాధింపఁబడి బ్రహ్మ అస్త్రముల నిచ్చెను. ఇతఁడు శత్రువుల గెలిచె. స్వయంభువు ఇతనికి వధింపరాక యుండ వరమిచ్చె. ఈ దివ్య చక్రము సూర్యునివలె భాసించు రథమును బ్రహ్మ యిచ్చినవే. ఇతనిచే వందలమంది దేవ దానవులు పరాజితులైరి. రాక్షసులు రక్షింపఁబడిరి. యక్షులు చంపఁబడిరి. ఇతని బాణములచే నింద్రుని వజ్రముకూడ నిశ్చేష్ట మయినది. రణమున వరుణపాశము ప్రతిహతమయ్యెను ఈ యతికాయుఁడు రాక్షసులలో శ్రేష్ఠుడు. దేవ దానవుల దర్పముల హరించు ధీమంతుడు కనుక వీనివిషయమై ప్రయత్నము చేయవలె. ఇతఁడు బాణములచే వానర సైన్యములఁ జంపఁగలడు. అని విభీషణుఁడు చెప్పెను. అంత బలవంతుడైన యతికాయుఁడు వానరసైన్యమున ప్రవేశించి ధనుస్సు నెక్కు పెట్టి గర్జించె. ఆ భయంకరాకారుని రథమందుండఁ జూచి వానరప్రధాను లగు కుముదుఁడు ద్వివిదుఁడు మైందుఁడు నీలుఁడు శరభుఁడును వాని నెదుర్కొని

యొక్కమ్మడిగా వృక్షములతోడను గిరిశృంగములతోడను పైఁబడఁగా వాని నన్నిటిని మహాతేజుఁడయిన యతికాయుఁడు భేదించి వానరులను భగ్న కాయులఁ జేయుఁగా వారు ప్రతిక్రియ చేయఁజాలరైరి. అంత వారిని అతికా యుఁడు భయపెట్టి తనతో యుద్ధము చేయనివాని నెప్పనిని కొట్టక ధనుస్సు అంబులపొదిని ధరించి రాముని సమీపించి గర్వముతో నిట్లనెను. 1225

అరదంబెక్కి శరాలు చాపము కరంబందూను నేనిట్టి పా
మరులౌ వీరలతోన పోరుట, యిటుల్ మాబోటివార్కిట్టి వా
నరులం దాకరు విక్రమాన్వితుఁ డెవండైనన్ గలండేని యా
వర వీరుండిటు వచ్చుఁగాక యని సల్పెన్ వేగ నాతోడుతన్. 1226

అని యిట్టుల్ వచియింప శత్రుదమనుండై మీఱు సౌమిత్రి యా
దనుజ వ్యాఘ్రుని యట్టివాక్కు విని క్రోధంబెచ్చ నా వాక్కులో
న నెటుల్ సైపక చాపమున్ గరమునం దాఁబూని యా దైత్యునిన్
గణనన్ జేయక పైకి గంతిడుచు వేగన్ హెచ్చి విశ్లెక్కెడెన్. 1227

విలు సారించి ధరిత్రి యాకసము నా పృథ్వీధర శ్రేణి వా
ర్ధులు దిక్కుల్ త్రుటి నారి మ్రోతలకు మార్మ్రోయంగ మ్రోగించి దై
త్యులు భీతిల్లఁగజేయు ఘోష మతికాయుండంత నాలించి మి
క్కిలి యాశ్చర్యము చెంది లక్ష్మణుని బల్కెన్ బాణముల్ దీయుచున్.

చనుమీ లక్ష్మణ ! పిన్న వీవు యముతో సాటైన నాతోడ ని
ట్లనిఁ గావింపఁ దలంతె మద్భుజ విసృష్టాస్త్రాళి నాజిన్ సహిం
పనుజాలండు హిమాద్రికూడ ధర వ్యోమంబెనియున్ సైచునే
కనుమీ హాయిగ నిద్రపోయెడి మహాకాలాగ్ని మేల్కొల్పెదే. 1228

ఇఁక వింటిన్ విడనాడి జాలు మెటకోయీ ప్రాణముల్ వేగ నెం
దుకు వర్జింతువు పోక యిట్లెదురుకో నూల్కొందువే నుండు మిం
తకు ప్రాణంబులు వీడి కాలుపురిచెంతన్ బోదుగా ద్విషాం
తకమౌ నాదు త్రిశూలతుల్యమగు స్వర్ణాస్త్రాల వీక్షించుమీ. 1230

మృగరాజల్కను నాగరాజు రుధిరంబింపారఁగాఁ గ్రోలు రీ
తిఁగడున్ సర్పము వంటిదైన యిది నాతీవ్రాస్త్రమే నీదు నె
త్తొగిఁ గోలుంజుమి యంచు క్రూరుఁడతికాయుండుగ్రుఁడై రెచ్చి ప
ల్కి గరంబందు ధనుస్సు దాల్చి వడిముల్కిన్ గూర్చెఁ గ్రుద్ధాత్ముడై. 1231

అతికాయుండటులల్గి గర్వమున మాటాడంగ సౌమిత్రి యీ
గతి వాక్రుచ్చె నిటేల ప్రేలెదవురా కార్యంబు గావించి నీ
ధృతిఁ జూపింపర! యిట్లు సజ్జనులు తమ్మేతామిటం మెచ్చుకో
రతికాయా! విలుపూని యుంటినిగ దుష్టా! చూపు నీవీర్యమున్. 1232

పనిని గావించి చూపుము వట్టి పొగడి
కొంట తగదు పౌరుషముతోఁ గూడు వాఁడె
శూరుఁడనఁబడు రథమెక్కి వీరుఁడ వయి
సర్వశస్త్రాలు ధనువూని శక్తిచూపు. 1233

గాలి తాటిపండును గ్రిందఁ గూలిచి నటు
ఇదిగో నీతల పడఁగూల్తు నీశరాల
ఇపుడె నాపైఁడి బాణంబు లిట్టె నీదు
బాణశల్యాలఁబడు నెత్త్రు వడిగఁ ద్రాగు. 1234

ఎను బాలుంగఁ దలంచు కొంచును నవజ్ఞన్ జేయఁ బోకోరి! నే
నును బాలుండనో వృద్ధునో కనుము నన్నున్ నీదు పాలింటి కా
లునిగా; ఆవటువైన విష్ణువెగదా లోకాలు మూడాక్రమిం
చెను మూడడ్గుల నంచు లక్ష్మణుఁ డనన్ శీఘ్రంబ విల్దాల్చియున్. 1235

అతికాయుండటు లక్ష్మణుం బోదువంగా నాయిరువ్వురున్ ఘోరమౌ
గతిం గావించు రణంబు గన్గొనంగ యక్షాదిత్య విద్యాధర
ప్రతతుల్ భూతమహర్షులున్ గగనమెల్లన్ నిండ బాణాలు నా
యతి కాయుండటు పైచె లక్ష్మణునిపై నభ్రంబటుల్ చిమ్ముచున్. 1236

పెనుబాణమ్ములు పైకినచ్చు శరమున్ వీరుండు సౌమిత్రి క్ర
న్నన తీవ్రంబగు నర్ధచంద్ర శరమంతన్ వేసి ఛేదింపగన్
గని యాపై నతికాయుఁడో యయిదు బాణాల్ వేయ సౌమిత్రి వెం
బడె వానిన్ వడి నమ్ములన్ దునిమి మంటల్ గ్రక్కునమ్మున్ గొనెన్.
1237

అటు లమ్ముంగొని వింటఁ గూర్చి యతికాయ క్రూరఫాలంబు నం
తటఁ గొట్టంగ శరాన్నవచ్చి కడున క్తంబుల్ పడింగాఁ ను
త్కటుఁడౌ దైత్యుఁడు కొండపైఁ గల భుజంగం బట్లు భాసిల్ల ను
ద్భట రుద్రాస్త్ర హతంబయైన త్రిపుర ద్వారంబటుల్ కూలెఁగా. 1238

త్రుటిలో నూరటఁగాంచి యా యుద్భటుఁడు దైత్యుండంత సేనాసుఃఉ
త్కట బాణంబులు వేయుటన్ గడు జగత్ప్రాఘ్యుండవై యున్న యు
ద్భట శత్రుండవయైతివంచుఁ దలహస్తాల్ పంచి యాతేరిపై
నటఁ గూర్చుండి రథంటునన్ తిరిగె నిట్టట్టుల్ విజృంభించుచున్. 1239

ఇంకఁ దానొక్కటి మూఁడు నైదు శితమౌ నేడమ్ములన్ గొంచుఁ బూ
నిక సంధించియు లాగివేయు నవి మిన్నెల్లన్ ప్రకాశంబుతో
ప్రకటంబున్ బొనరించి వేయఁబడఁగా నైళంబ యాలక్ష్మణుం
డకలం కాత్ముఁడు వాడి బాణములచే నవ్వెల్ల గూల్చెన్ వెసన్. 1240

అటులా లక్ష్మణుచేతఁ గూల్చఁబడు నామ్ములన్ నిరీక్షించి పి
మ్మట శీఘ్రం బతికాయుఁడుగ్రతరమౌ బాణంబు వేయంగ నా
పటువౌ బాణము లక్ష్మణో రసు దెబ్బన్ దీయు నెన్గున్ మదం
బటు రక్తంబు స్రవించె నైననుగరంబాలక్ష్మణుం డుద్ధతిన్. 1241

వ్యర్థయే మాత్రము చెందకుండ శితమౌనాగ్నేయ మస్త్రంబు నే
మ్మది మంత్రించియు వేయఁ గన్గొనుచు నాప్రౌఢాతి కాయుండు నే
న్మదుఁడై సౌరము నస్త్రమున్ వదల మింటన్ రెండుమంటల్ వెలా
ర్చి దురంబున్ బొనరించెఁ గ్రుద్ధమయి పేర్మిన్ బోరుపాముల్ వలెన్. 1242

అవి యన్యోన్యము పోరిభీకరముగా నర్చిస్ఫుల్లాంగవే
భువి భస్మంబయి కూల రావణియు నెంతో యుగ్ర యైషీకమన్
జవనాస్త్రంబును వేయ లక్ష్మణుఁడు సైంద్రాస్త్ర ప్రయోగానఁ గొ
ట్ట వడిన్ దానతికాయుఁ డంత వెనువెంటన్ వేసె యామ్యాస్త్రమున్. 1243

అటు సౌమిత్రియు యామ్యమస్త్రమును వాయవ్యాస్త్రమున్ వేసి కొ
ట్టుటయేగాక శరాలు కుర్సివడి నాటోపంబుతో మీఱి, మి
క్కుట మౌధారలచే మహాగిరిని మేఘుండట్లు గర్జింప నం
తట నారావణియో యవధ్యకవచుం డౌటన్ వ్యథన్ గాంచఁడున్. 1244

అపుడు వాయువు వచ్చి యిట్లనియె "నితడు
బ్రహ్మవల్ల వరము పొందె వాని కవచ
మెట్లు ఛేదింపరానిది, యిందువల్ల
నితని బ్రహ్మాస్త్రమునసె వధింపనగును. 1245

ఇతని నింకొక రీతి వధింపరాదు
బలయుతుఁ డభేద్య కవచుఁడై యలరియుంట
ఇతర మగు నస్త్రములచేత వధింపఁబడఁడు
అనుచు వాయువు చెప్ప లక్ష్మణుఁడు వేగ. 1246

వింట బ్రహ్మాస్త్రమును గూర్చి వేగయపుడ
దిశలు రవిచంద్రులు గ్రహాలు దివియు భువియు
వణఁకిపోయె నంతటను లక్ష్మణుఁడు త్వరగ
వజ్రసమ కాలసమంబగు బాణమేసె. 1247

వ. అట్లు లక్ష్మణునిచేఁ బ్రయోగింపఁబడిన యస్త్రము సువర్ణవజ్రోత్తమ చిత్రపుంఖమై వచ్చుచుండ అతికాయుఁడుచూచి యనేక నిశితబాణములు వేసె. అపుడు లక్ష్మణునిబాణము అతికాయుని సమీపమునకు రాఁగా మండుచున్న యంతక కాలసదృశంబగు నాబాణమును శక్తి ఋష్టిగద గొడ్డలి శూలము హల ములు వేసినను వానిని ఆ బ్రహ్మాస్త్రము వ్యర్థముగావించి అతికాయుని కిరీటమును అతని శిరస్సునుకొట్టి హరించె. అంత ఆ అతికాయుని శిరస్సు హిమాద్రిశృంగమువలెఁ గ్రిందబడెను. అదిచూచి హతశేషులయిన రాక్షసులు దీనులయి యార్తిపొంది వికృతముగ అర్చుచు పురోభిముఖులయి చనిరి. అంత వానరులు ప్రహృష్టులయి లక్ష్మణుని పొగడిరి. 1248

అతికాయుండు యశస్వి లక్ష్మణునిచే నట్టుల్ హతుండై చనన్
దితి జాధ్యక్షుఁడు రావణుండు వ్యధచే దీనాత్ముడై పల్కె నీ
గతి "ధూమ్రాక్షుఁ డకంపనుండు ఘనుడింకన్ గుంభకర్ణుండు ను
ద్ధతుఁడౌ ధన్వి ప్రహస్తుడున్ ఘనులు యోధశ్రేష్ఠులుం బోయిరే. 1249

ప్రబలుఁ డక్లిష్ట కర్ముఁడౌ రాముచేత
వివిధ శస్త్రవిశారదుల్ వీరులైన
వీరెగాక యితరులైన విక్రమాఢ్యు
లైన బహుశూరులును హతులైరి గాదె. 1250

ప్రథితబలుఁ డింద్రజిత్తు నాపట్టి యట్లు
బ్రహ్మయిడిన యేశరముల రామునకు జుఁ
గట్టివైచె వానిని దివౌకసులు యక్ష
దితిజ గంధర్వులేన్ విడదీయలేరె. 1250

అట్టి శరములనుండి వారట్టు లెట్లు
మాయచే నేప్రభావ మహిమచేత
నెట్టి మహితౌషధులచేత నెట్లు ముక్తు
లైరొ నాకేమియుఁ దెలియదయ్యె మదికి. 1252

నాదు శాసనము గొని యేయోధులైతె
ఘనబలులయి వెడలిరొ యాదనుజవరులఁ
గపులు కూల్చిరి రాములక్ష్మణు విభీష
ణుని గపీశు వధించెడి ఘనుని గనను. 1253

* యోద్ధయగు రాముడెంత మహాబలుండో
అతనియస్త్రాలు నెంతమహత్తు గలవొ
యవని విక్రమమున దైత్యులెల్లఁ జచ్చి
రాయభయము రాముఁదలఁతు నాతోయటునీగ. 1254

వీని భీతిచేతనె లంకలోని ద్వార
ములును తోరణములుగూడ మూయఁబడియె
వడిగ నీలంకను ప్రమాదపడక యుండి
పాలకులచేతఁ గాపాడఁ బడఁగవలయు. 1255

ఎందు సీతయె కావలాయందు నుండె
ఆ యశోకవనికి నెవరరుగుచుంద్రొ
బయట కరుదెంచుచుందురొ వారినెల్ల
జాగ్రతగ సర్వగతులఁ గాంచంగ వలయు. 1256

---

* ఇక్కడ "యో" అన్నది గాయత్రి మంత్రములోని బీజాక్షరము.

ఎక్కడెక్కడ సేనలు నెంచినిలుపఁ
బడెనొ యక్కడక్కడ మీరు బలముతోడఁ
గూడి మాటిమాటికి శ్రద్ధతోడఁ జూచి
యరయుండవలెఁ జుండి యంకనుండి యోధులారః 1257

తగఁ బ్రదోషాల నర్ధరాత్రముల యందు
సెపను ప్రత్యూషముల సర్వవిధులమీరు
వానరుల జాడఁగనిపెట్టి బహువిధాల
నిలిచి రాక్షసులారః వీక్షింవవలయుం. 1258

వ. మఱియు ఎల్లపుడు వానరవీరుల విషయమై నిర్లక్ష్యముచూపరాదు.
శత్రుబలమెప్పుడెప్పుడు ఎదుర్కొననో వచ్చుచుండునో ఆబలమెంతయున్నదో
చూడవలె. అని యారాక్షసాధిపతి యాజ్ఞాపింప వారు ఆ యాజ్ఞనట్లె యొన
ర్చిరి. ఇంక నా రావణుఁడు రాక్షసుల కందఱకాజ్ఞయిడి శోకశల్యము మేనఁ
దాల్చియె దీనుఁడై తన భవనమునకువెళ్ళి కోపాగ్ని మండఁగా ఆ తన కుమా
రుని స్మృతిచే మాటిమాటికి నిట్టూర్చుచుండెను. 1259

ఇటు దీనుండయి స్రుక్కి మూర్ఛిలిన దైత్యేశు న్నిరీక్షించి యు
త్కట దుఃఖాంబుధి మున్గి తేలు పిత నోదార్పంగ నా యింద్రజి
త్తిటు వాక్రుచ్చెను తండ్రి ! మోహపడఁబో కీయింద్రజిత్తుండ నీ
విటు శోకింపకు మింద్రజి త్శరహతుం డే డేని జీవించెనే. 1260

వినుమా లక్ష్మణు రాము మత్శర వినిర్భిన్నాంగులంజేసి భూ
మినినిట్టట్టులు దొర్లఁజేతుఁ గనుమీ యాయింద్రజి త్పౌరుషం
బును దైవంబును నైన యిట్టి ప్రతిసన్ బూర్ణంబ యాలింపు ప్ర
స్ఫూన నవ్వారి నమోఘమౌశరపు వానన్నేన పూరించెదన్. 1261

యమ వైశ్వానర చంద్ర సూర్య హరిసాధ్యాశ్వీంద్రాదులిం
క మదీ యామిత విక్రమంబు- బలి యాగక్షోణి నా విష్ణు వి
క్రమముంబోలెను గాంత్రుగాక యని వేగం బింద్రజిత్తట్టి వా
క్యములన్ రాక్షసరాజు వీడుకొని వీకన్ సత్త్వ వీర్యోద్ధతిన్. 1262

ఖరముఖ్యంబులు పూన్చి యాయునిల వేగంబొప్పుతేరెక్కి తా
నురు తేజుండయి యుద్ధభూమి కరుగన్ యోధాగ్రులౌ రాక్షసుల్
వర చాపంబులు దాల్చి హర్షమున నశ్వంబుల్ గజాలెక్కి ము
ద్గర నిస్త్రింశగదల్ పరశ్వధములన్ గై కొంచు వెన్నాడఁగన్. 1263

శంఖ నాదంబులు శ్రావ్యభేరీధ్వనుల్
పూర్ణంబుగా మాఱుమ్రోగుచుండ

వాల్గువైపుల నాదంబులు చేయుచు
రాక్షసుల్ స్తోత్రముల్సలుపు చుండ

చంద్రుచే గగనంబు చాడ్పున శశిసమ
చ్ఛత్రంబుచే భువి సౌరు లీన

పసిడి భూషల మీఱు పసిఁడి వింజామరల్
వెసఁబరి చారకుల్ వేయుచుండ

వర ధనుర్ధరుఁ డరుణార్క వర్చసుండు
శక్రజేత సూర్యుఁడాక సముసుబోలె
నెల్ల రణధరణిని ప్రకాశింపఁ జేసి
స్వీయరథము చుట్టును దైత్యసేన నిలిపె. 1264

మంత్రాలతో భువి మార్గోక్తియు విధిరీతి
హుతభుజులో హోమమొగి నొనర్చి

హవిసుతోఁ బేలాల నమరు సంస్కారాల
మాల్య గంధాల హోమములు చేసి

తెల్లకు బదులుగాఁ బెల్లు శస్త్రములు తాం
డ్రడ సమిధల్ రక్తవస్త్రముల నుంచి
నల్లని స్రువమును తెల్లుపుల్లలు దర్భ
లస్త్రాలు నగ్నిచుట్టలర వ్రేల్చి

బ్రదికి తగు నల్లమేక గళంబుపట్టి
హృతఘనాభతేజుఁడు రాక్షసేంద్రుఁ డింద్ర
జిత్తు శాస్త్రవిధిని నగ్నిఁజేరి వేల్పఁ
బొగ గనని యగ్ని జయ చిహ్నములను జూపె. 1165

అటు ప్రదక్షిణావర్త శిఖాంచిత మయి
మేలి బంగారు భూషలు మేనఁ దాల్చి
స్వయముగా వచ్చి యగ్నియు సత్వరమున
ఇంద్రజిత్తిచ్చిన హవిస్సునెద గ్రహించె. 1216

ఇంద్రజిత్తంత బ్రహ్మాస్త్ర మెదజపించి
తగు రథమును మంత్రించె యథావిధిగను
అట్లు బ్రహ్మాస్త్రము జపింపనగ్ని వ్రేల్చ
చంద్రతారాగ్రహాద్యమౌ చదలు వణఁకె. 1267

అటులా పావక తేజుఁ డింద్రజికరంబా యగ్నిలో వ్రేల్చి య
చ్చట నింద్రప్రతిమ ప్రభావుఁడగుచున్ చాపాన బాణాలతో
పటు ఖడ్గాశ్వరథాలతో క్షణములో భావింపరానట్టులన్
మటు మాయుంబయి పోవ రాక్షస బలం బవ్వానివెన్కన్ జనెన్. 1268

అటు వెంటాడిన రాక్షసుల్ కపులపైన త్యంత తీవ్రంబులై
పటు శక్తిందగు తోమరాంకుశములున్ బాణాల్ ప్రయోగించి కొ
ట్టుటయున్ క్రుద్ధుఁడ యింద్రజిత్తు కడు నాటోపవీక్షించి యాదైత్యులన్
ఇటు పల్కెన్ ముదమొంది వానరుల మీరెల్లన్ వధింపుడీఁకన్. 1269

అప్పుడా రాక్షసు లెల్ల నార్చికపి సైన్యంబున్ జయింపంగ ఁదీ
వ్రపు నాదంబులు చేయుచున్ శరములన్ వర్షింప నాయింద్ర జి
త్తపుడే దైత్యులచేత నావృతుడైయె యావానర నీకమున్
విపులాస్త్రాళి శరాలఁబెన్ గదలతో వెకొట్టి కూర్చెన్ వ్యథన్. 1270

తరులేయాయుధమై తనర్చు కపులంతన్ జచ్చుచున్ గూడ, సం
గర భూమిన్ సమరోగ్రు నింద్రజిని వేగన్ గూడి పై కోఁగ వా
నర దేహాల మహాబలుండును దురం తౌజస్వియౌ నింద్రజి
త్తురు కోపంబున మీఱి శస్త్రములచే సెక్కుమ్మడిం జీలిచెన్. 1271

ఒక బాణంబునఁ దొమ్మదేడయిదుమం దుర్విన్ బడన్ గొట్టుచున్
నికటంబందుఁ జరించు రాక్షసుల కెంతే మోదముం గూర్చుచున్
ప్రకటార్కుంబలె వెల్గు బాణములఁ గాత్రతతుల్ విదీర్ణంబు చే
చి కడున్ దుర్జయుఁడౌచు నింద్రజియెఁ గూల్చెన్ వానర శ్రేణులన్. 1272

అటు మధ్యాహ్న రవింబలెన్ నిశిత బాణాంశుల్ పయిన్ జిమ్ముచున్
కటు శౌర్యంబునఁబోరు నింద్రజి పయిన్ మైశంబ సంక్రుద్ధులై
అట నావానర ముఖ్యులున్ బడియు భిన్నాంగాల రక్తంబులం
తటఁ గారన్ వ్యథఁ జెంది పర్విడిరి ధ్వస్తస్వాంతులై యుత్తతిన్. 1273

మఱియున్ రామునికై స్వజీవితము నిమ్మోఁ జీఱికింగోక సం
గర మందున్ బెనుఱాళ్ళు శస్త్రములుగా గర్జించుచున్ బైఁబడన్
దొరకొంచున్ గిరిశృంగ వృక్షములతోఁ దూర్ణంబుగా నిల్చి సం
గరమున్ జేయఁగ నింద్రజిత్తనల సంకాశాస్త్రమున్ వేయుచున్. 1275

కపి సైన్యంబుల ఛిన్నభిన్నములుగాఁ గావించి పద్దెన్మి దు
గ్రపు బాణంబుల గంధమాదనుని, దొలస్ మీఱు వీరున్ నలున్
అప్పుడే తొమ్మిది యుమ్ములన్నెఱకు లల్లార్పించునే దమ్ము లే
సి వృధున్ మైందుని, ద్వైదునమ్ములగజున్ శీఘ్రంబ కొట్టెన్గడున్. 1276

పదిబాణంబుల జాంబవంతు ఋషభున్ బల్వీరు సుగ్రీవు నం
గము నీలున్ ద్వివిదున్ వరాస్త్రచయ నగ్రంబైన బాణాళి సు
ప్పదిటన్ మూర్ఛిలఁజేసి మన్యకపులన్ పైశంబ సంక్రుద్ధుఁడై
వదనా బాణములేసె కొట్టెఁగడు రేవన్ గాలి వహ్నింబలెన్. 1277

అంతన్ జోకయు నింద్రజిత్తు పరమోగ్రౌజస్వి సూర్యాభ దు
ర్దాంతంబగు నమ్ములేసి శరముల్ వర్షించి యావానరుల్
భ్రాంతిల్లన్ రుధిరార్ద్రులౌచుఁ బడిపోవం గూల్చి మర్దించి వి
క్రాంతిన్ స్వీయబలంబు వీడి వడిగాఁ గన్పింప దేమాత్రమున్. 1278

ఇటు లమ్ముల్ కురిపించి యింద్రజి విజృంభింపన్ విశీర్ణాంగులై
పటు మాయాహతులై వికారముగ పల్ధ్వానంబులం జేసి యం
తట నావానరు లింద్ర వజ్రహత భూధ్రంబుల్ వలెన్ గూలి ర
చ్చట మాయేంద్రజి కానిపింపఁడిఁక దృశ్యంబయ్యె నాయమ్ములే. 1279

వ. మరియు నామహాబలుండు సూర్యునివంటి బాణగణంబులచే దిక్కులు కప్పి వానరముఖ్యుల విషాదపఱచి మండిన యగ్నివంటి శూలములను ఖడ్గంబులను గొడ్డళ్ళను కపిసైన్యము పయి విసర నాయింద్రజిత్తు బాణములచేఁ గొట్టబడి వానర యూథపతులు విచ్ఛిన్న మోహముచెత్తవలె నయిరి. వికృత స్వరములతో నార్చుచుఁబడిరి. పైకిఁ జూచుచున్న వానరులు కండ్లపైఁ గొట్టఁబడి యొకరినొకరు పట్టుకొని పడిరి. ఆవల హనుమంతుని సుగ్రీవుని అంగదుని గంధమాదనుని జాంబవంతుని వేగదర్శియైన సుషేణుని మైందద్వివిదులను నీల గవాక్ష గజగోముఖులను పచ్చని రోమములు గల కేసరిని విద్యుద్దంష్ట్రుని సూర్యానన జ్యోతిర్ముఖులను దధిముఖుని పావకాక్షుఁడైన నలుని కుముదుని ఇంకను యితర కపీంద్రులను మంత్రించిన శితబాణములచేతను నిశితప్రాసముల చేతను శూలముల చేతను నిర్భేదించి సూర్యరశ్మివంటి బాణవర్షములను

రాముని పయి వర్షించెను. అంత బాణవర్షములచే వర్షింపఁబడుచుఁ గూడ వర్ష ధారలనువలె వానిని నిర్లక్ష్యముచేసి పైకిఁ జూచుచు పరమాద్భుతలక్ష్మి గల రాముఁడు లక్ష్మణునితో నిట్లనియె. సురేంద్ర శత్రువయిన యింద్రజిత్తు బ్రహ్మాస్త్రమును ఆశ్రయించి కపిసైన్యమును పడఁగొట్టి మనలను గూడశరము లచే బాధించుచున్నాఁడు. ఇతఁడు బ్రహ్మవలన వరములను పొందిన మహా బలుఁడు తన భీమ శరీరముతో నంతర్ధానము పొందియున్నాఁడు అస్త్రములను వేయుచు నదృశ్యుఁడై యుద్ధమున ఎట్లు కొట్ట శక్యుడగును. అచింత్యప్రభా వుఁడైన భగవంతుఁడు స్వయంభువు ఇతనికి స్వయముగా అస్త్రములను ఇచ్చెను. కనుక ధీమంతుఁడవై అవ్యగ్రమైన మనస్సుతో ఈతని బాణావ పాతములను సహింపుము. ఈరాక్షసేంద్రుఁడు బాణవర్షజాలములచేత దిక్కు లన్నిటిని గప్పివేయుచున్నాఁడు. ఇతఁడు తప్పక మనము స్మృతి లేక పడి యుంటిమనియు రోషహర్షములవిడిచి యుద్ధమునుండిమరలితిమనియుఁ జూచి యుద్ధలక్ష్మిని గ్రహించి ఇతఁడు దేవారియయిన రావణుని మందిరమునకుఁ బోవును. అని చెప్పఁగా నంతట నాయింద్రజిత్తు తన బాణములచే ఆ రామ లక్ష్మణులు పీడింపఁబడియుండఁ జూచి హర్షమున సింహనాదము చేసి ఆ రామ లక్ష్మణులను వానరసేనను విషాదపెట్టి వెంటనే దశకంఠభుజ రక్షితమైన లంకా పురమున ప్రవేశించె. 1280

అవలన్ రాముఁడు లక్ష్మణుండు నట మూర్ఛాక్రాంతులై పోవ నా
ప్లవగానీకము గూడ మోహమును జెందన్ నీల సుగ్రీవ జాం
బవదాదుల్ మతి యేమిచేయకయె పోవన్ జింతలో మున్గ నా
ప్లవగాళిన్ గని యా విభీషణుఁడ యాశ్వాసం బిటుల్ గూరిచెన్. 1281

మది భీతిల్లకుఁ డీ విషాదమున కేమాత్రంబు కాలంబు కా
దిది యా బ్రహ్మశరాన గౌరవము చూపింపంగ నీ భ్రాత లీ
విదితాత్ముల్ మది నింద్రజిత్తు శరముల్ వేయంగ నిర్భిన్నులై
రిది యిచ్చోట విషాదమొందుటకు నేమీ కాలమే కాదయా. 1282

అట నీరీతి విభీషణుం డనఁగ బ్రహ్మాస్త్రంబు మన్నించి యం
తట నా మారుతి యిట్లుపల్కెఁ గపిసైన్యంబెల్లఁ గూలంగ ని
చ్చట జీవంబుల నున్నవారిఁగని యాశ్వాసింత మంచున్ హుటా
హుటి వారిద్దఱు నివ్వెకట్టి గొని యెంతో చూచి రయ్యాజిలో. 1283

తెగి క్రిందంబడు తోకలన్ శిరములన్ దృష్టోరు పాదాల ప్రే
శ్ళఁ గరాలన్ దొడలన్ రుధిరార్ద్రింబైన గాత్రాలఁ బ
ల్నగముల్ పోలికఁగూలు వానరుల శస్త్రిలన్ విరాజిల్లి యెం
తగనో భూమియు వ్యాకులంబగుచు సంతన్ దోఁచె నవ్వారికిన్. 1284

నల సుగ్రీవ గవాక్ష నీలులు సుషేణ జ్యోతిపక్తున్ గజుం
డల మైంద ద్వివిమల్ ఘనుండు శరభుండా యాహుకుం డంగదుం
డల వీరాఢ్యుఁడు గంధమాదనుఁడు నింకన్యుల్ కపిగ్రామణుల్
ఇలపై నింబడి కానఁగాఁబడిరి యెంతేప్రుక్కి యుద్ధంబులో. 1285

అరువదియేడుకోట్ల కపులంత దినాంతమునందు బ్రహ్మయౌ
శరమునఁగూల భీమమగు సాగరతుల్య బలంబు చూచి చె
చ్చెఱ హనుమద్విభీషణులుచేరి రణోర్విని జాంబవంతుకై
యరయుచు వృద్ధు బాణహతు నారిననిప్పటు చూచిరయ్యెడన్. 1286

ముసలితనాన-నూఱుశరముల్ పడ సోలిన బ్రహ్మపుత్త్రినిన్
వెసనట జాంబవంతుఁగని వీర విభీషణుడిట్లు పల్కె నా
ర్య! సుఖమె తీవ్రబాణములఁ బ్రాణములేగవు గాదె యుంచుఁ బ
ల్కె సరగ జాంబవంతుఁడెటొ కష్టముతోడ వచించెనిట్టులన్. 1287

వరదనుజ! మహావీర! నీస్వరముఁబట్టి
నిన్ను గుర్తింపగల్గితి నిశితశరము
లార్తి గూర్పఁగ నిను గండ్ల నరయలేను
ఇంచెపడి విభీషణ! నేను నిట్టులుంటి. 1288

ఎవనిచే నంజనాదేవి పవనుఁడిందు
పుత్త్రవంతులలో శ్రేష్ఠపుత్త్రవంతు
లైరొ యాహనుమంతుఁడు ప్రాణములను
దాల్చి యున్నాఁడుగద చెప్పు త్వరగ నిపుడు. 1289

అన విభీషణుఁ డాలించి యనియెనిట్లు
ఆర్యపుత్త్రుల భ్రాతల నడుగకుండ
వారివిడి హనుమంతుని ప్రశ్న చేతు
వంగదుని రాము సుగ్రీవు నడుగవేల. 1290

వడివిభీషణుతో జాంబవంతుఁ డనియె
వినువిభీషణ! యేటికి హనుమ నడుగు
చుంటినో యాఘనుడు బ్రదికున్న యెడల
బోయియును నందఱు బ్రతికిపోయినట్లె 1291

ఇతఁడె గనుకఁ బ్రాణాలతో నెసఁగకున్న
పరిగ మనము జీవించినన్ జచ్చినట్లె
అగ్ని వాయుతుల్యుండైన హనుమ బ్రదికి
యున్న బ్రదుకుదుమను నాశయుండు మనకు. 1292

అపుడు నియమంబుతోడ నాహనుమ దరిసి
జాంబవంతు కాళ్ళనుపట్టి సాగిమ్రొక్కె
వడిగ హనుమ వాక్కువిని జాంబవంతుడపుడు
ఇల మరలఁ బుట్టినటు తన్ను దలఁచుకొనియె. 1293

మహితౌజుండగు జాంబవంతుఁడు హనూమంతున్ నిరీక్షించి యా
రహిఁబల్కెన్ గపివర్య! యీవకపులన్ రక్షింపనర్హుండ వో
యి హనూమంత! పరాక్రమంబునను నీకెవ్వారలున్‌సాటి లే
రొహహో వీరికి నీవె సత్సఖుఁడవై యున్నావు సుమ్మెల్లెడన్. 1294

ఇదె నీవిక్రమమెల్లఁ జూపు సమయంబేతెంచె నీవంటి యు
న్మదవీరున్ గపి ఋక్షసైన్యములఁ గావన్ రామభ్రాతన్ గత
వ్యథులన్‌జేసి సమస్తవానరుల సైన్యంబుల్ ప్రహృష్టంబుఁ జే
యుఁచగున్ భిన్నుల రామలక్ష్మణుల శల్యంబుల్ తొలంగింపుమీ. 1295

వ. హనుమా నీవు సముద్రముపైని చాలదూరమేగి పర్వతరాజగు హిమాద్రికడకేగుము. అచట మిగుల ఎత్తైన ఋషభంబను పర్వతమును కైలాసశిఖరమును జూతువు. ఆ రెండు శిఖరములమధ్య ప్రకాశించుచు అతుల కాంతిగలిగి యోషధులతోఁగూడిన యోషధిపర్వతమును జూతువు. అందు నాలుగుదిక్కులను ప్రకాశింపఁజేయుచు ఆ పర్వతముపైని పుట్టిన అమృత సంజీవని, విశల్యకరణి, సావర్ణ్యకరణి, సంధానకరణి యను నాలు గోషధులను జూచెదవు. వానినన్నింటిని గ్రహించి మారుతీ! శీఘ్రమేవచ్చి కపులకు ప్రాణములు తెప్పించి వారినూరడింపుము. అని జాంబవంతుండనగా విని కపివరుండగు హనుమంతుఁడు నీటివేగములతో సముద్రమువలె స్వబలోత్కర్షములతో నిండిపోయెను. 1296

గిరియగ్రంబున నిల్చిత్రొక్కుచు ప్లవంగేంద్రుండు రెండౌ మహీ
ధరమున్ బోలెఁ గనంబడెన్ ప్లవగపాదాల్ వినిర్భిన్నమై
గిరి తన్నున్ సహియింపఁజాలకయె క్రుంగెన్ జెట్లురాలెన్ గపీ
శ్వరు వేగంబున మండి శృంగములు కూల్చన్ నిల్వరై రాకపుల్. 1297

పలుద్వారంబులు ఘూర్ణిలన్ గృహములున్ భగ్నంబుకాన్ గోపురం
బులు కూలన్ నిశిలంక వణ్కినట్లుగై పోవన్ గిరీంద్రంబౌ నా
నిలఁ బీడించి వార్ధియుత్తధర నెంతే క్షోభింజేసి యా
మలయాద్రిన్ హనుమంతుఁడెక్కి విహరింపంగాచ్చె నందెల్లెడన్. 1298

వివిధంబౌ తరువుల్ లతల్‌గలిగియున్ విస్ఫారు చెందామరల్
పువులున్ నల్లని కల్వలొప్పఁగను దేవుల్ సిద్ధ గంధర్వ మౌ
నివరుల్ కింపురుషాప్సరల్ మృగములున్ నిండార నింపౌ గుహల్
మివులన్ గల్గిన యద్రి మారుతి విజృంభించెన్ సురల్ స్రుక్కగన్. 1299

జలదాభుండగు వాయుసూతి బడబాస్యంబట్టి వక్త్రంబు భీ
తిలునట్టుల్ కడువేగమే దెఱచి యెంతేస్ దైత్యులన్ బిట్టు భీ
తిలఁగాఁ జేసెడివాడ యట్లుఱవ రాత్రించారులౌ నెల్ల దై
త్యులు లంకన్ జలియింపఁగానయిన శక్తుల్‌గాని వారై రిగా. 1300

ఇకనామారుతి రాముస్రొక్కి భయదుండే యౌచు నారాముకై
యకలంకంబగు కర్మచేయ మదిలోనాలోచనంజేసి స
ర్ప కఠోరంబగు తోకయెత్తి నడుమున్ వక్రంబుగావించి మో
ముకడున్‌విప్పి చెవుల్ నిలన్‌బఱచి యప్డున్‌మింట వేగన్ జనెన్. 1301

భుజజానూరు జవానఁజెట్టులు నగంబుల్ ఱాళ్ళు మామూల్ కపి
వ్రజముల్ నాశితవేగులై జలధినీళ్ళున్‌గూల సర్వారితు
ల్యజవుండై దిశలెల్ల లాగునటులై యద్రీశు మేరున్ జతు
ర్భుజ యుక్తంబగు చక్రమట్టుల సముద్రున్‌జూచుచున్ వేఁజనెన్. 1302

తరులున్ శైలములున్ పురంబులు నదుల్ తత్తజ్జనస్థానముల్
సరసుల్ చూచుచు వాయువేగము దనర్చన్ సూర్యమార్గంబుగా
త్వరగాఁ బోవుచు జాంబవంతు పలుకుల్ పల్మారులో నెంచి తా
నరసెన్ మారుతి శ్వేత మేఘసమ శృంగాఢ్యున్ హిమాద్రిన్ ఘనున్.
1303

పలు వృక్షంబులతోడ శృంగములతో వ్యాపించి దేవర్షి సే
వల నొప్పారిన పావనాశ్రమములన్ బాగైన యాయద్రిలో
పలఁ గైలాసము బ్రహ్మకోశమును దేవాధీశు పుణ్యామర
స్థలి నాబ్రహ్మకపాలమున్ గనె హయాస్యారాధన స్థానమున్. 1304

వ. మఱియు అచ్చోట వైశ్రవణాలయమును సూర్యప్రభము సూర్యుని బంధనము బ్రహ్మాసనము శంకరు చాపంబును పాతాళ ప్రవేశ రంధ్రమును హిమవచ్ఛిలను ఋషభనామ కౌషధి పర్వతమును ప్రకాశించు నోషధులతో నిండి అగ్నివలె ప్రకాశించు మృతసంజీవని మొదలగు నోషధులు గల పర్వతమును జూచి యాహనుమంతుఁడు ఆశ్చర్యపడి యందు మృత సంజీవని మొదలగు నోషధులకై అనేక యోజనములు దాటి అన్వేషింపసాగి యాశైలమున పంచరింపదొడగెను. అంత నామహౌషధులు తమ్ముఁ దీసికొనిపోవ వచ్చు హనుమంతుని జూచి అదర్శనమై పోవుటయు అపుడు ఆమూలికలను జూడక మహాత్ముఁడైన హనుమంతుఁడు క్రుద్ధుఁడై గర్జించి సైపక అగ్ని వలె మండెడి కన్నులతోఁ జూచుచు ఆనద్రిరాజుతో నిట్లనియె.  1305



రాముపై దయఁ జూపక యోమహీధ్ర!
ఓషధులు గానఁ బడకుండ నొనరుచుటయె
నీదు నిశ్చయమేయైన నాదు బాహు
బలముచేఁ బెల్లగింతు నీపాట్లు చూడు. 1306



అని పలికి శృంగములతోడ గజాళితోడ
గైరికాది ధాతు సహస్ర కలితమైన
మండు చఱియలు వ్రీలఁ బసిఁడి కొండ
వేగ గ్రహియించి వెంటనె పెల్లగించె.



అటులఁ బెల్లగించి సురసురాధిపులును
పొగడ ఖేచరులు స్తుతింప మిగుల వేగ
గురుడివోలె నెగిరి దివాకరుని పథిని
రవి సముఁడు రవిసమ శిఖరాన వెలిఁగె. 1307

వేయి యంచులు గల చక్రవేగమునను
విష్ణువటు దివిన్ మారుతి వెలయఁ జూచి
ముదముతో వానరులు ధ్వానములు బొనర్ప
అ ధ్వని విని లంకావాసు లార్చినారు. 1308

ఆమహాత్ముఁడౌ హనుమ యాయద్రిఁ గపుల
మధ్యదిగి కపులకు మ్రొక్కి మఱివిభీష
ణునిఁ గవుంగలించుకొనె లక్ష్మణుఁడు రాముఁ
డాకపులు నోషధుల తావి కపుడె లేచి. 1309

తెల్లవార నిద్దుర నుండి తేఱినటుల
వారు శల్యముల్ బాధలున్ వదలిపోవ
సంగరమున నిహతులైన సర్వకపులు
ఓషధుల తావికినిలేచి యూరడిలిరి. 1310

ఇంకఁ గపులచే హతులైన యెల్ల యసురు
లప్పటికి నప్పుడే రావణాజ్ఞచేత
ఎంతమంది చచ్చిరో యెవ్వరెఱుఁగ నటుల
వారిధిని జిమ్మఁబడి పోయినారు మున్నె. 1311

అంత మారుతి యుగ్ర వీర్యంబుతోడ
ఓషధీ పర్వతమును నదున్న చోట
మరలను హిమాద్రి యందుంచి త్వరిత గతిని
రాముదరికి యథా ప్రకారముగఁ జేరె. 1312

ఇది

చర్ల నారాయణశాస్త్రి జనకగురుప్రాప్తవిద్యుఁడును వెంకమాంబా పుత్రుడునగు
చర్ల గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన గణపతి వాల్మీకి రామాయణసుధ
యందు యుద్ధకాండము మొదటిభాగము సమాప్తము.




— / ప్రచురణములు / —

| | |
|---|---|
| సాహిత్య సౌందర్య దర్శనము (సమగ్రాలంకార దర్శనము) | రు॥ 35-00 |
| గణపతిరామాయణసుధ — బాలకాండ | 15-00 |
| అయోధ్యకాండ | 25-00 |
| మిగతా కాండలు (ఒకొక్కటి) | 15-00 |
| రఘువంశలహరి (పద్యములు : కాళిదాసు) | 10-00 |
| కుమారస్వామి విజయము (పద్య గద్యములు) | 4-00 |
| బుద్ధభగవానుని చరిత్ర (పద్య గద్యములు) | 4-00 |
| బ్రహ్మమీమాంసాదర్శనము (వ్యాస మహర్షి) | 10-00 |
| న్యాయమీమాంసాదర్శనము (గౌతమ మహర్షి) | 4-00 |
| వైశేషికదర్శనము (కణాద మహర్షి) | 4-00 |
| సాంఖ్యమీమాంసాదర్శనము (కపిల మహర్షి) | 6-00 |
| సిద్ధాంత తత్త్వదర్శనము (వ్యాస మహర్షి) | 6-00 |
| మహాభారత మీమాంస (1వ భాగము) | 4-00 |
| మధుర శాకుంతలము (నాటకము) | 6-00 |
| ఉత్తరరామ ప్రణయచరిత్ర (నాటకము) | 5-00 |
| ఉపనిషత్సుధ 1వ భాగము (మూల తాత్పర్య పద్యానువాదము) (ఈశ కేన కఠోపనిషత్తులు) | 5-00 |
| ,, 2వ భాగము (ముండ మాండూక్య తైత్తిరీయ ఐతరేయములు) | 5-00 |
| ,, 3వ భాగము (ఛాందోగ్యము) | 30-00 |
| ,, 4వ భాగము (బృహదారణ్యకము) | 20-00 |

చర్ల గణపతిశాస్త్రి,
33, కిర్లంపూడి లేఔటు,
వాల్తేరు -3.